c

తెలంగాణ రాష్ట్ర అవతరణ సందర్భంగా ప్రత్యేక సంచిక

# అభ్యుదయ

త్రైమాసిక సాహిత్య పత్రిక

జులై-సెప్టెంబర్ 2017 సంపుటి : 1 సంచిక : 1 వెల : 25/-



[4Th February, 1908-25Th Auguest, 1969]

అరసం ప్రచురణ, తెలంగాణ రాష్ట్రం

CI

# రచయితలకు విజ్ఞప్తి...

అరసం, అభ్యుదయ రెండవ సంచికను తెలుగు భాషా సాహిత్య సంస్కృతులపై ప్రత్యేకంగా వెలువరించాలనుకుంటుంది. సామాజిక స్పృహ కలిగిన రచయితలు, కవులు, పరిశోధకులు ప్రామాణికమైన వ్యాసాలు, కవితలు, కథలు, తెలుగు భాష, సాహిత్యం, సంస్కృతులపై పంపగలరని విజ్ఞప్తి..


చిరునామా

**డా॥ వి.వీరాచారి**

సంపాదకులు,

అభ్యుదయ త్రైమాసిక పత్రిక

ఇ.నెం. 2-1-132/1, మాధవనగర్ కాలనీ

రోడ్ నెం. 3, విద్యారణ్యపురి, గోపాల్‌పూర్ రోడ్,

హన్మకొండ (మం), వరంగల్ అర్బన్ జిల్లా

పిన్ : 506 009

E-mail ID : veeracharyvadla@gmail.com

Mobile No. **9963610842**

PR3VM02A101

# అభ్యుదయ

త్రైమాసిక సాహిత్య పత్రిక

జులై-సెప్టెంబర్ 2017 సంపుటి : 1 సంచిక : 1 వెల : 25/-



కవిత్వం, కథ, వ్యాసాలు, ఉత్తరాలు, సమీక్ష కోసం రెండు పుస్తకాలు మరియు ఈ సంచికపై మీ అభిప్రాయాలు పంపవలసిన చిరునామా

**డా॥ వి.వీరాచారి**
ఇ.నెం.2-1-132/1,
మాధవనగర్ కాలనీ, రోడ్ నెం.3,
విదారణ్యపురి, గోపాల్‌పూర్ రోడ్,
హన్మకొండ, వరంగల్ (అర్బన్)
పిన్ కోడ్ : 506009, తెలంగాణ.
సెల్ నెం. 9963610842

E-mail ID :
veeracharyvadla@gmail.com

## సంపాదకీయం

తెలంగాణ రాష్ట్రం ఏర్పడి చూస్తూ ఉండగానే మూడేండ్లు గడచిపోయాయి. అరసం తెలంగాణ రాష్ట్రశాఖ ఏర్పడి కూడా మూడో వసంతంలోనికి అడుగిడబోతున్నాం. తెలంగాణ రాష్ట్రం ఏర్పడగానే 2014 సెప్టెంబర్ 27, 28 తేదీల్లో వరంగల్లులో ఏడు పదుల చరిత్ర కలిగిన అరసం ఉమ్మడి రాష్ట్ర మహాసభలను నిర్వహించు కొని, తెలంగాణ-ఆంధ్ర ప్రదేశ్ శాఖలుగా అరసం రూపుదిద్దు కున్నది. ఇరు రాష్ట్రాల అరసం శాఖలు గత మూడు సంవత్స రాలుగా నిర్మాణాత్మకమైన, ప్రామాణికమైన భాషా సాహిత్య సేవను చేస్తున్నాయి. అమూల్యమైన పుస్తకాలను ప్రచురిస్తున్నాయి. సభలు - సమావేశాలు జరిపి "కళ కళకోసం కాదు ప్రజలకోసం" అన్న సామాజిక స్పృహతో రచనలు చేస్తున్న రచయితలను గుర్తించి పురస్కారాలను అందిస్తూ వారిని ప్రోత్సహిస్తున్నాయి. అయినా మాలో ఏదో తెలియని వెలితి. ఆగిపోయిన అభ్యుదయ సాహిత్య పత్రికను తిరిగి ప్రారంభిస్తే తప్ప ఆ వెలితి తీరదు. ఎలా ?

ఈ విషయమై గత మూడు సంవత్సరాలుగా తెలంగాణ అరసం శాఖ కార్యవర్గ సమావేశాల్లో తర్జనభర్జనలు చేసింది. పత్రికను రెన్యూవల్ చేయించడానికి పట్టువదలని భట్టి విక్రమార్కునిలా ప్రయత్నించింది. 2016లోనే వెలువరిద్దామనుకున్నాం. వీలుకాలేదు. 2017 ఉగాది అనుకున్నాం. మేడే రోజు

అనుకున్నాం. చివరికి తెలంగాణ రాష్ట్ర అవతరణ రోజున బులెటిన్‌గానైనా ప్రచురిద్దామనుకున్నాం. ఈ ప్రయత్నం ఫలించి అభ్యుదయ మీ ముందుకు వస్తుంది.

ఇది సాహిత్య త్రైమాసిక పత్రిక. సాహిత్యానికి సమాజానికి అవినాభావ సంబంధం ఉంది అన్న విశ్వాసంతో, 'కళ కళకోసం కాదు ప్రజలకోసం' అనే నినాదంతో అడుగులు వేయడానికి, అరసం గత వారసత్వాన్ని కొనసాగించడానికి సంసిద్ధమవుతున్న పత్రిక. కందుకూరి వీరేశలింగం పంతులుగారన్నట్లు "దేశాభివృద్ధి–భాషాభివృద్ధి"ని అభిలషిస్తూ ముందకు వెళ్ళడానికి ప్రయత్నిస్తున్న పత్రిక. "పత్రికొక్కటి చాలు పదివేల సైన్యంబు. పత్రికొక్కటున్న మిత్రకోటి" అన్న నార్లవారి మాటకు జీవం పోయాలన్న లక్ష్యంగల పత్రిక. అందుకు నిబద్ధతగల కవులు – రచయితలు – కళాకారులు తమ సంపూర్ణ సహాయ సహకారాలను అందిస్తారని ఆశిస్తున్నాం.

అయితే ఈ పత్రిక స్వరూప స్వభావాల పరిధిలో మీ రచనలు ఉంటే ప్రచురణకు వీలుకలుగుతుంది. విషయసూచికను జాగ్రత్తగా పరిశీలిస్తే అభ్యుదయ పత్రిక స్వరూపం తెలిసిపోతుంది. ఇందులో ప్రధానంగా ఆరు విభాగాలున్నాయి. 1.స్పందన, 2.శోధన, 3.సృజన, 4.వీక్షణ, 5.సాధన, 6.వేదిక ఈ ఆరు విభాగాలలోని అంశాలను చదివితే ఈ పత్రిక స్వభావంకూడా మీకు తెలిసిపోతుంది.

ఇక్కడ ఇంకో విషయాన్ని కూడా గమనించాలి. అభ్యుదయ పత్రిక తుమ్మల వెంకట్రామయ్య గారి నేతృత్వంలో అరసం ఆధ్వర్యంలో 1943లో ప్రారంభమైంది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వెంకటరామయ్యగారు ఈ పత్రికను రిజిస్ట్రేషన్ చేయించినారు. రి.నెం.30484 టి.ఎన్. తెలుగు00003. 1980వ దశకం దాకా ఏటుకూరి ప్రసాద్ గారి సంపాదకత్వంలో హైదరాబాదు నుండి వెలువడింది. దాదాపు 40 సంవత్సరాలు నడిచిన పత్రిక ఇప్పటికి ఆగిపోయి 30 సంవత్సరాలు కావస్తుంది. ఆగిపోయిన అభ్యుదయ మాసపత్రికను త్రైమాసిక పత్రికగా ప్రచురించాలని తెలంగాణ అరసం కార్యవర్గం నిర్ణయం తీసుకుంది. అరసం జాతీయ నాయకుడు పెనుగొండ లక్ష్మీనారయణగారు అందుకు మద్దతు పలికారు. ఏటుకూరి ప్రసాద్ గారు ఆశీస్సులు అందజేసారు. ఇది ఎల్లలులేని తెలుగు పత్రిక. ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొని నారు నాటాం. నీరు పోయండి. మన తెలుగు భాషా సాహిత్య సంస్కృతులకు పట్టం కట్టండి.

మీ

డా॥ వి. వీరాచారి

# విషయ సూచిక :

# అంకితం



తెలంగాణ రాష్ట్ర సాధనకోసం తొలి-మలి దశ ఉద్యమాల్లో

అశువులు బాసిన అమరులకు ....

స్పందన

అభ్యుదయ

# COMMUNIST PARTY OF INDIA
## TELANGANA STATE COUNCIL

Ph:040-23224966
Fax : 23264296, 040-23227942
cpitelanganastatecouncil@gmail.com



#3-6-201, Makhdoom Bhavn,
Street No.15, Himayatnagar,
HYDERABAD - 500 029.

## అభ్యుదయ పత్రికను పునరుద్ధరిస్తున్నందుకు మీకు శుభాకాంక్షలు

ఇటీవలే తెలంగాణ ఏర్పడిన ఈ సందర్భంలో మన సాహిత్య పత్రిక మళ్ళీ రావడం సంతోషాన్ని కలిగిస్తున్నది. రాష్ట్ర ఆవిర్భావానికి శ్రమించిన, ప్రాణాలొడ్డిన నిజమైన తెలంగాణ వాదుల త్యాగాలను ఈ పత్రిక ద్వారా నేటి తరానికి అందించిడం సమంజసంగా ఉంటుంది.

కేంద్ర, రాష్ట్ర పాలకులు అవలంభిస్తున్న ఫాసిస్టు దోరణులను విశ్లేషిస్తూ, లౌకిక వ్యవస్థ పరిరక్షణకు ప్రత్యేక కృషి జరగాలి. అట్టి ప్రాముఖ్యతను "అభ్యుదయ" పత్రిక సంతరించుకొని ప్రజల ఆదరణను పొందాలని ఆకాంక్షిస్తున్నాను. అటుకేంద్రం, ఇటు మన రాష్ట్రంలో తలెత్తుతున్న ప్రజా వ్యతిరేక విధానాలను తెలంగాణ సాయుధ పోరాట త్యాగాలను వెలుగులోకి తేవాలి. ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షలు నేడు ఏ మేరకు అమలు జరుగుతున్నవో వాస్తవ దృక్పథంతో సామాజిక చైతన్యాన్ని పెంపొందించే మంచి వ్యాసాలు ప్రచురించబడాలి. గతంలో సమసమాజ సాధనే లక్ష్యంగా తెలుగు రచయితులు ఎందరో "అభ్యుదయ"లో రచనలు చేశారు. ఇప్పుడున్న ప్రగతిశీల రచయితలందరి రచనలు "అభ్యుదయ" ద్వారా పాఠకులకు అందించబడాలి. గతంకంటే ప్రస్తుతం ఉన్న పరిస్థితులలో ఈ పత్రిక చారిత్రక అవసరం ఉన్నదని భావిస్తున్నాను

ఇప్పుడు వస్తున్న వివిధ పత్రికల్లోని రచనల కంటే పదునైన రచనలతో మన "అభ్యుదయ" రావాలని కోరుకుంటూ ఆహ్వానిస్తున్నాను.

అభినందనలతో...

24/3/2017

(చాడ వెంకటరెడ్డి)

కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత
గోపీచంద్ జాతీయ సాహిత్య పురస్కార గ్రహీత
**డా॥ అంపశయ్య నవీన్**
ఇ.నెం. 2-7-71, ఎక్సైజ్ కాలనీ, సుబేదారి,
హనుమకొండ, వరంగల్ - 506 001
ఫోన్ : 0870-2456458
మొబైల్ : 9989291299

Central Sahitya Akademy Awardee
Gopichand National Literary Awardee
*Dr. Ampashayya Naveen*
H.No. 2-7-71, Excise Colony, Subedari,
Hanamkonda, Warangal - 506 001.
Tel : 0870 - 2456458
Mobile : 9989291299

Date 30-5-2017

# సందేశం

అభ్యుదయ రచయితల సంఘం, తెలంగాణ రాష్ట్రశాఖ వారు 'అభ్యుదయ' మాస పత్రికను తిరిగి ప్రారంభిస్తున్నారని తెలిసి చాలా సంతోషించాను.

ఒకప్పుడు... 'అభ్యుదయ' పత్రిక అభ్యుదయ సాహిత్యాన్ని ప్రజల్లోకి తీసుకుపోవడంలో ఎంతో నిర్ణయాత్మకమైన పాత్రను నిర్వహించింది.

ఒకప్పుడు... అంటే 1930ల నుండి అరవైల వరకు ఆధునిక తెలుగు సాహిత్యంలో అభ్యుదయోద్యమ సాహిత్యమే ప్రధాన భూమికను పోషించింది. ఈ విషయంలో ఆనాటి 'అభ్యుదయ' పత్రిక నిర్వహించిన పాత్ర గణనీయమైనది...

అనేక కారణాల వల్ల 'అభ్యుదయ' ప్రచురణ ఆగిపోయింది. అలా ఆగిపోయిన పత్రికను పునరుద్ధరించాలని నిర్ణయించినందుకు అభ్యుదయ రచయితల సంఘం వారిని అభినందిస్తున్నాను.

— అంపశయ్య నవీన్

**(డా॥ అంపశయ్య నవీన్)**

# అభ్యుదయకు స్వాగతం

అభ్యుదయ సాహిత్య త్రైమాసిక పత్రికను అరసం పునఃప్రచురణకు పూనుకోవడం అభినందనీయం. తెలుగు ప్రజల్లో అభ్యుదయ భావాల వ్యాప్తికి, సాహిత్య సాంస్కృతిక వికాసానికి అరసం ఉద్యమంగా ప్రారంభమైనప్పుడు "అభ్యుదయ" పత్రిక దిక్సూచిగా పనిచేసింది. 1936లో ప్రపంచ వ్యాప్తంగా అభ్యుదయ సాహిత్య ఉద్యమం ప్రారంభమైంది. దానికి చారిత్రక నేపథ్యం నాడు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఛాందస భావాలు, బానిసత్వం, మూఢవిశ్వాసాలు, రాచరిక నియంతృత్వ పోకడలు, వలసపాలకులు ప్రజలకు కలిగించే అవస్థలు మొదలైనవాటితో పాటు స్పెయిన్‌లో ప్రజాస్వామికంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని కూలదోయడానికి ప్రజలపై ఫాసిస్టు దాడులు జరుపుతున్న ఇటలీ, జర్మనీ, స్పెయిన్ తదితర ఫాసిస్ట్ శక్తులకు వ్యతిరేకంగా తమకళాకారులను, కవులను ఎక్కుపెట్టారు.

ఆనాటి ప్రపంచంలో రచయితలు, కవులు తమ భావాలను వ్యక్తిగతంగా వ్యక్తం చేసేవారు. కానీ ఫాసిస్ట్ శక్తుల విజృంభననే నాటి కవులు, కళాకారులను ఒక సంఘటిత శక్తిగా, ప్రగతిశీల భావాలకు అంకితమై తమ రచనలు చేయాలన్న సంకల్పం కలిగించింది అభ్యుదయ సాహిత్యోద్యమం. అదే సమయంలో లండన్‌లో వివిధ దేశాల అభ్యుదయ రచయితలు ఒక ఉద్యమంగా సాగడానికి సంకల్పించి రచయితలకు, సామాజిక దృక్పథం, మానవకళ్యాణమే లక్ష్యాలుగా అభ్యుదయ భావాలతో అంతర్జాతీయ ఉద్యమంగా రూపుదిద్దుకుంది. ఈ లక్ష్యాలతోనే భారతదేశంలో కూడా 1936లో అభ్యుదయ శక్తులు ఏకమై మున్షీప్రేమ్‌చంద్ నాయకత్వంలో తమ పాత్రను ఉద్యమంగా సాగించాయి. దీని ఫలితంగా దేశంనలుమూలల పేరుగాంచిన రచయితలు, కళాకారులు స్వాతంత్ర్యోద్యమ కళాసైనికులుగా ముందుకు రావడం వల్ల నిరక్షరాస్యులు రాజకీయ చైతన్యంలేని ప్రజల దగ్గరికి చేరడానికి దోహదమైంది.

జాతీయ, అంతర్జాతీయ పరిణామాల ప్రభావంతో 1943లో తెలుగునాట అభ్యుదయ సాహిత్య ఉద్యమం తెనాలిలో ఆరంభమైంది. అప్పటి నుండి ప్రజల భాషలో, ప్రజల సమస్యలు చిత్రితమై "కళకళకోసం కాదు. కళ ప్రజలకోసం" అనే

భావన పెరిగింది. మాభూమి, కష్టజీవి వంటి బుర్రకథలు మొదలైనవి ప్రజలను అభ్యుదయ మార్గం వైపు నడిపించాయి.

నిజాం నిరంకుశపాలన, దొరలు, జమీందారుల దోపిడి, దౌర్జన్యాలతో నలిగిపోతున్న తెలంగాణ ప్రజల్లో అభ్యుదయ రచనల ద్వారా, సాంస్కృతిక ప్రదర్శనల ద్వారా పోరాడే మనోధైర్యాన్ని అభ్యుదయ శక్తులైన ప్రగతిశీల భావాల అరసం కలిగించింది. దానితో అక్షర జ్ఞానంలేని యాదగి చేత "నైజాముసర్కరోడా" అనే పాటను గానం చేయించింది. బందూకులు చేతపట్టి పోరాడే రాజకీయ చైతన్యం, పోరాటపటిమలను కలిగించింది. అదే తెలంగాంణ రైతాంగ సాయుధ పోరాటమైంది. ప్రపంచ వ్యాప్త అభ్యుదయ వేత్తలతో ప్రశంసలనందుకుంది.

భారతదేశ స్వాతంత్ర్యానంతరం అభ్యుదయ శక్తులు కొంత బలహీనపడడం వల్ల అభ్యుదయ నిరోధక రచనలు, సినిమాలు, దూరదర్శన్ వంటి మాధ్యమాలల్లో అశ్లీలం, అనైతికత మొదలగునవి జనాన్ని తప్పుదోవపట్టిస్తున్నాయి. అంతేగాక రచయితలు కళాకారులు కులాల పేరుతో, మతాల పేరుతో, దళితులుగా, స్త్రీలుగా, ప్రాంతీయ భేదాలతో ఎవరికి వారు వేర్వేరుగా ఉండడం వల్ల మనందరికీ ఉమ్మడి శత్రువైన కుల, మతాల అహేతకశక్తులు విజృంభించి, జనాన్ని వంచిస్తున్నాయి. ఇటువంటి తరుణంలో ప్రజల్ని సరైన అభ్యుదయ పథంలో నడపడానికి "అభ్యుదయ" పత్రిక ఎంతో అవసరం. అరసం ఉద్యమంగా బలపడాలని, అభ్యుదయ పత్రిక కవులు, కళాకారులందరికీ దశ, దిశ నిర్దేశం చేసే వాణిగా నిలవాలని ఆకాంక్షిస్తూ అభ్యుదయ పత్రికను ఆహ్వానిస్తున్నాను.

(కందిమళ్ళ ప్రతాపరెడ్డి)
జాతీయ ఉపాధ్యక్షులు,
ఇండియన్ పీపుల్ థియేటర్స్ అసోసియేషన్
మరియు అరసం అధ్యక్ష వర్గ సభ్యులు

## ఇది మీ పత్రిక ! మన పత్రిక !! తెలుగువారి పత్రిక !!!

అరసం అధికారిక పత్రిక అభ్యుదయ తెలుగు సాహిత్యానికి, సమాజానికి అందించిన వెలుగులు ఎంతో ప్రకాశవంతమైనవి. అప్పుడప్పుడు పత్రిక ఆగినా మళ్ళీ కొనసాగుతూనే ఉంది అభ్యుదయ పర్వం.

అభ్యుదయ పత్రిక చరిత్రలోకి వెళ్తే శ్రీమతి రాచమల్ల సత్యవతీదేవి సంపాదకత్వంలో వెలువడిన "తెలుగుతల్లి" పత్రికను, అరసం తొలినాళ్లలో తన పత్రికగా నిర్వహించింది. తరువాత అరసం నేత తుమ్మల వెంకటరామయ్యగారు ప్రచురణకర్తగా వెలువడిన అభ్యుదయ, సాహితీ వేత్తల కరదీపికగా వెలుగొందింది. నిర్బంధ కాలంలో ఆగిపోయింది. చాలా కాలంతరువాత మదరాసు నుండి అక్కడి అరసం శాఖ అభ్యుదయను కొంత కాలం ప్రచురించింది. ఈ సందర్భంగా శెట్టి ఈశ్వరరావు, మహీధర రామమోహన్‌రావు, శ్రీకాంత్ గారల కృషి ప్రశంసనీయం. తరువాత డా॥ ఏటుకూరి ప్రసాద్ గారి సంపాదకత్వంలో హైదరాబాదు నుండి వెలువడింది. మళ్ళీ ఆగిపోయింది. డా॥ఏటుకూరి ప్రసాద్ గారు అభ్యుదయ పత్రిక కోసం తన శక్తియుక్తులన్నింటిని ధారపోశారు. ఈ సందర్భంగా ప్రస్తుత తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య యస్వీ సత్యనారాయణగారి కృషి కూడా గౌరవించదగినది.

విశాఖ జిల్లాశాఖ అరసం బులిటిన్లను అప్పుడప్పుడు వెలువరించింది. అప్పట్లో రాష్ట్ర కార్యదర్శుల్లో ఒకరైన విరియాల లక్ష్మీపతిగారు అభ్యుదయ బులిటిన్లను ప్రచురించడంలో విశేషమైన కృషి చేశారు.

అరసం అధికార పత్రిక అభ్యుదయ లేనప్పుడు అరసంనేత గజ్జల మల్లారెడ్డిగారు 1977-78 సంవత్సరాల్లో తన సంపాదకత్వంలో "వీచిక" మాస పత్రికను నడిపారు. అరసం కార్యవర్గ సభ్యుల్లో ఒకరైన చెరుకు మల్లి సింగా తెనాలి నుండి వెలువరించిన ప్రజాభారతి, ప్రశీద పత్రికలను, అరసం రాష్ట్ర అధ్యక్ష వర్గ

సభ్యులైన శశిశ్రీ కడప నుండి నిర్వహించిన 'సాహిత్యనేత్రం' పత్రికలు అభ్యుదయ సాహిత్యానికి ప్రాతినిధ్యం వహించాయి. వీరందరిని అరసం గుర్తుచేసుకుంటుంది.

అభ్యుదయ పత్రిక అభ్యుదయ సాహిత్యాన్ని విస్తృతంగా ప్రచురించడమే కాక ఎందరినో తెలుగు సాహిత్యానికి పరిచయం చేసింది. తెలుగు సాహిత్యాన్ని సంస్కృతిని ప్రజాపరం చేసింది. అనేక విలువైన ప్రత్యేక సంచికలను ప్రచురించింది. నేటికి సందర్భానుసారం ప్రత్యేక సంచికలను వెలువరిస్తూనే ఉంది.

అరసం నేతలు పలువురు అభ్యుదయ పత్రికకు సంపాదకులుగా, సంపాదక వర్గ సభ్యులుగా ఎనలేని కృషిచేశారు. వారందరికి జోహార్లు.

అభ్యుదయ పత్రిక సంప్రదాయ సాహిత్యాన్ని ధిక్కరిస్తూ ప్రజాసాహిత్యాన్ని సృష్టించింది. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంలో తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించింది. ఆ విలువలను, ఆ విధానాలను కాపాడుకుంటూ అనేక సామాజిక, సాంస్కృతిక లక్ష్యాలు - బాధ్యతలతో మళ్ళీ మీ ముందుకు అభ్యుదయ డా॥వి.వీరాచారి వంటి ప్రతిభావంతుల సంపాదకత్వంలో వస్తుంది.

ఇప్పుడు తెలుగు రాష్ట్రాలు రెండైన సందర్భం అరసం కూడా రెండైంది. అయితేనేమి మౌలిక భావాలన్నీ ఒక్కటే. భాషా సాహిత్య సంస్కృతులకు ఎల్లలు లేవనేది అరసం భావన. అభ్యుదయను అన్నివేళలల్లో ఆదరించినట్లే మళ్లీ అభిమానించండి.

-ఇది మీ పత్రిక, మన పత్రిక, తెలుగువారి పత్రిక...

మీ..

**పెనుగొండ లక్ష్మీ నారాయణ**

అరసం జాతీయ నాయకులు

అభ్యుదయ

ఫోను: 040-23234815
సెల్: 9490189824
ఫ్యాక్స్: 040-23236911
ఇ-మెయిల్: vc@teluguuniversity.ac.in



**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**
**POTTI SREERAMULU TELUGU UNIVERSITY**
Public Gardens, Hyderabad - 500 004.
**Accredited by NAAC**

ఆచార్య ఎస్వీ సత్యనారాయణ
ఉపాధ్యక్షులు

లలితకళా క్షేత్రం
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్ - 500004

తేది:01-08-2017

## అభినందనలు

పత్రిక ఒక సంస్థకు ప్రాణవాయువు వంటిది. ఒక సంస్థలోని దృక్పథాన్ని, ఆలోచనలను, లక్ష్యాలను ప్రజలకు తెలియజేయడానికి పత్రిక ఒక ప్రబలమైన ఆయుధం. అలాగే అభ్యుదయ పత్రిక సాహిత్యోద్యమానికి ఊతకర్రగా నిల్చిన ప్రధానమైన సాధనం. తొలినాళ్ళలో తుమ్మల వెంకట్రామయ్య గారి సారథ్యంలో చాలాకాలంపాటు అరసం వాణిగా "అభ్యుదయ" వెలువడింది. మధ్యలో ప్రభుత్వ నిర్బంధకాండ వలన "అభ్యుదయ" కొంతకాలంపాటు వెలువడలేకపోయింది. తర్వాతి దశలో మహీధర రామమోహన్‌రావు మద్రాసు నుండి "అభ్యుదయ"ను ప్రకటించారు. మహీధరగారు కూడా తమ ఓపిక నశించినదని తెలిపిన తర్వాత డా॥ఏటుకూరి ప్రసాద్ సారథ్యంలో "అభ్యుదయ" చాలాకాలంపాటు వెలువడింది. మాసపత్రికగా ఒకవైపు అభ్యుదయ సంచికను వెలువరిస్తేనే అభ్యుదయ రచయితల సంఘం అనేక "అభ్యుదయ" విశేష సంచికలను వెలువరించింది. కవిత్వం, కథ, నవల, వాడుకభాష మొదలైన ప్రత్యేక సంచికలను, గోర్కి, రోణంకి అప్పలస్వామి, పురిపండా, శ్రీశ్రీ వంటి వారలపై విశేష సంచికలను వెలువరించింది. అనేక అభ్యుదయ సంచికలను వివిధ విశ్వవిద్యాలయాలలో పిహెచ్.డి. పరిశోధన చేస్తున్న పరిశోధకులకు ఉపయుక్త గ్రంథాలుగా తోడ్పడ్డాయి. అభ్యుదయ సంచిక నిర్వహణలో నిడమర్తి ఉమారాజేశ్వరరావు, మల్లిక్, గుర్రంకొండ శ్రీకాంత్, ఆర్.సి.ఎమ్. గుప్తల తోడ్పాటు స్మరింపదగినది.

పత్రిక నిర్వహణ ఎన్నో వ్యయప్రయాసలతో కూడింది. రచనలను తెప్పించడం, కంపోజింగ్, ప్రూఫ్ రీడింగ్, ప్రింటింగ్ వ్యవహారాలు చూడ్డం మొదలుకొని అడ్రసులను అతికించడం, చందాదారులకు పంపడం దాకా చేయగలిగే కార్యకర్తల సమూహం ఉన్నదా? అనే విషయాన్ని అంచనా వేసుకున్న తర్వాతనే పత్రికను పునర్‌ప్రారంభిస్తే బాగుంటుందని నా సూచన. వినడానికి ఇవ్వన్నీ చిన్న విషయాలుగా తోచవచ్చు. కానీ ఆచరణలో ఎంత కష్టసాధ్యమైనవో నాకు ప్రత్యక్షంగా తెలుసు. ఇది నిరుత్సాహపరచడానికి కాదు. ముందు జాగ్రత్త చర్యగా చేస్తున్న మిత్రవాక్యం. బహుశా ఇవన్నీ పరిగణనలోకి తీసుకొని సమగ్రంగా ఆలోచించి అభ్యుదయను మళ్ళీ ప్రారంభించాలన్న సంకల్పానికి నా అభినందనలు, చిరకాలం పత్రిక వెలువడాలని, వర్ధిల్లాలని ఆకాంక్షిస్తున్నాను. శుభాకాంక్షలు.

ఎస్వీ సత్యనారాయణ

**(ఆచార్య ఎస్వీ.సత్యనారాయణ)**

# అభ్యుదయకు ఆహ్వానం

అభ్యుదయ సాహిత్యం, అభ్యుదయ రచయితల సంఘం, అభ్యుదయ పత్రిక, ఈ మూడూ ఒక త్రయం. ఈ మూడింటి సంకల్పం సమాజపరివర్తన. ఇప్పటి సమాజం కన్నా మెరుగైన సమాజం. అసమానత్వం, దోపిడి, పీడన, అణచివేత, వివక్ష, ఆధిపత్యం, మౌఢ్యం లేని సమాజం. సారాంశంలో అది సమ సమాజం. ఈ త్రయంకోరుకునేది దోపిడి వ్యవస్థలో భాగస్వామ్యంకాదు. దోపిడిలేని శ్రామిక సమాజం. విశ్రాంత వర్గాధిపత్యం లేని సమాజం. అయితే సమసమాజం ఆకాశంలోంచి, శూన్యంలోంచి, యజ్ఞాలు యాగాలతో, మంత్ర జపతపాలతో అది సాధ్యంకాదు. శ్రామిక వర్గ, శ్రామిక కులాలు సమైక్యఉద్యమాల ద్వారానే సాధ్యం. ఈ విషయం అభ్యుదయ విభాగాల కన్నింటికీ చాలా స్పష్టంగా తెలుసు. ఈ విషయంలో సాటి ప్రగతిశీల ప్రజా ఉద్యమాలను, ఉద్యమసంస్థలను కలుపుకొని వెళ్ళాలన్న జ్ఞానం కూడా ఈ విభాగాలకుంది. అభ్యుదయ సాహిత్యం ఎప్పుడూ పలచబడలేదు. అభ్యుదయ సాహిత్యం సమసమాజం ఏర్పడేదాకా తన క్రియాశీల పాత్ర నుండి విశ్రమించదు. అభ్యుదయ రచయితల సంఘం అభ్యుదయ పత్రిక విషయంలో మిట్టపల్లాలున్న మాట వాస్తవమే. అవి పెట్టుబడిదారు వ్యవస్థలు కాకపోవడమే అందుకు కారణం.

ప్రపంచీకరణ బ్యానర్ కిందపెట్టుబడిదారి వ్యవస్థలు బలపడి, ప్రజాతంత్ర్య వ్యవస్థలన్నీ బలహీనపడుతున్న విస్తవాన్ని చూస్తూనే ఉన్నాం. ప్రజాతంత్రశక్తులలో చీలికలువచ్చి, కొన్ని శక్తులు దోపిడీ వ్యవస్థకు నాయకత్వం వహించే పనికి పూనుకోవడం మొదలైనప్పటి నుంచి మతోన్మాదశక్తులు బలపడి రాజ్యాధికార దశకు చేరుకున్న వాస్తవాన్ని కూడా గమనిస్తున్నాం. భారతీయ సామాజిక వ్యవస్థలోని సంక్లిష్టపరిస్థితులే ఈ చీలికలకు దోహదం చేశాయన్న వాస్తవాన్ని కూడా మరవకూడదు. అందువల్ల ఇవాళ వర్గ, కులవాదుల సమన్వయ ఉద్యమాలు అనివార్య సామాజిక అవసరం. ఈ అవసరాన్ని గుర్తించింది అభ్యుదయ సాహిత్యం. అభ్యుదయ పత్రిక ఈ చరిత్రక దశలో పునరుజ్జీవనం పొందడం ఆహ్వానించదగిన విషయం.

అభ్యుదయ పత్రిక నిర్వహణ బాధ్యతను భుజాన వేసుకున్న తెలంగాణ అభ్యుదయ రచయితల సంఘానికి నా హృదయపూర్వక శుభాకాంక్షలు, అభినందనలు. ప్రగతిశీల రచయితలందరూ తమ రచనల్ని అభ్యుదయ పత్రికకు పంపించి ఆ పత్రికను సొంతం చేసుకొని, బతికించకోవాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను.

అన్నిరకాల ఉన్మాదులకు అభ్యుదయ ప్రతిఘటనశక్తిగా రూపొందాలని కోరుకుంటున్నాను.

అభినందనలతో...

అనంతపురం.

(రాచపాళెం చంద్రశేఖర రెడ్డి)

అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం

# ఆకాంక్ష

ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో అభ్యుదయ రచయితల సంఘానికి ఒక ప్రత్యేకమైన చరిత్ర ఉంది. సాహిత్యానికి సామాజిక స్పృహ ఉండాలి, కళకలకోసం కాదు ప్రజల కోసం అన్న ఆశయాలతో స్వాతంత్ర్యోద్యమ కాలం నుండి అరసం పడిలేచే కెరటం లాగా నిరంతరం కృషి చేస్తుంది. ఎన్నో సాహిత్య ఉద్యమాలకు తల్లివేరుగా ఉంది. అలాంటి ఈ సంఘం నుండి వెలువడిన అభ్యుదయ పత్రిక కూడా అనేక ఆటుపోటులను తట్టుకుంటూ నిటారుగా నిలబడింది.

అయితే అప్పుడప్పుడూ ఈ పత్రిక ప్రచురణలో కొన్ని ఇబ్బందులు వచ్చి కొన్నాళ్లపాటు ఆగిపోయినా, ఈ పత్రిక చేసిన సాహిత్యసేవ అమూల్యమైంది. తెలంగాణ రాష్ట్ర అరసం ఆ వారసత్వాన్ని కొనసాగించాలన్న సంకల్పంతో డా॥వి.వీరాచారి సంపాదకత్వంలో ఇప్పుడు ముందుకు వస్తుంది. అందుకు అభినందనలు.

డా॥వి.వీరాచారి 1990 నుండి నాకు తెలుసు. తెలుగునాట సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు-కవులు రచయితలు అనే ఆయన పరిశోధన గ్రంథానికి నేను 1994లో ముందుమాట రాసాను. ఆయనకు సాహిత్యం పట్ల జిజ్ఞాస ఉంది. పరిశోధనా-సామాజిక పరిశీలనలో ఆసక్తి ఉంది. అనుకున్నది సాధించాలన్న పట్టుదల ఉంది. కాబట్టి అభ్యుదయ పత్రిక ఆయన నేతృత్వంలో జవసత్వాలతో ముందుకు సాగుతుందన్న ప్రగాఢ విశ్వాసం నాకుంది. అందుకు సంపాదక మండలిలో ఉన్న డా॥రాపోలు సుదర్శన్, వేల్పుల నారాయణ గారలు అండగా ఉండాలని ఆకాంక్షిస్తున్నాను. గౌరవ సలహాదారులుగా ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, నేను -మావంతు సహాయ సహకారాలను తప్పక అందిస్తామని ఈ సందర్భంగా గుర్తు చేస్తున్నాను.

**ఆచార్య వాసిరెడ్డి భాస్కర్ రావు**

అరసం అధ్యక్షవర్గ సభ్యులు, తెలంగాణ రాష్ట్రం.

# ఈ అభ్యుదయ నేడు చారిత్రక అవసరం

అభ్యుదయ పత్రిక మళ్ళీ ఆరంభం అవుతోంది. శుభం. అభ్యుదయ సాహిత్యం, అభ్యుదయ భావనలు నిరంతర ప్రవాహాలు. ప్రగతిశీల భావాలుండటం సహజం. ఆ భావాలను ఆచరణలో ఉండేలా కృషిచేసేటి సంస్థ ఉండాలనుకోవడం అత్యంత ఆవశ్యకం. ఆ సంస్థలో భాగస్వాముల తపన రచయితలకో వేదిక కూడా చాలా ఆశవ్యకం. అదిగో ఆ వేదిక ఈ పత్రిక "అభ్యుదయ సాహిత్య పత్రిక".

అభ్యుదయ రచయితలకు నిర్మాణ రూపంలో ఓ సంస్థ ఏర్పడ్డ తర్వాత అభ్యుదయ పత్రిక ఆవిర్భవించింది. సర్వశ్రీ చదలవాడ పిచ్చయ్య, తుమ్మల వెంకట రామయ్య గార్ల నేతృత్వంలో అది చాలా సంవత్సరాలు నడిచింది. కొంత కాలం చిన్న చిన్న బులెటిన్‌లుగా మహీధర రామమోహనరావు, సెట్టి ఈశ్వరరావు, శ్రీకాంత్‌లు మద్రాసు నుండి నడిపించారు. దరిమిళా నేను చాలా సంవత్సరాలు హైద్రాబాద్ నుంచి తీసుకొచ్చాను. అభ్యుదయ సాహిత్య ఉద్యమంలో ప్రముఖ రచయితలందరూ ఎప్పుడో అప్పుడు, ఏదో రూపంలో అభ్యుదయ నిర్వహణలో భాగస్వాములయ్యారు.

అంతర్జాతీయంగా ఫాసిజం నాజీజం, ప్రగతిశీల సంస్కృతీ సాహిత్యంపైన తుపాకీ గురిపెట్టిన తరుణంలో అంతర్జాతీయ అభ్యుదయ సాహిత్య ఉద్యమం తలెత్తింది. అభ్యుదయ నిరోధకుల సవాళ్ళకు ఎదురొడ్డింది. దీని ప్రకంపనలు భారతదేశం మీద 1936 లోనూ తెలుగు నేలమీద 1943లోనూ సంస్థాగతంగా రూపుదిద్దుకున్నాయి. ప్రగతిశీల సాహిత్యానికి ఎప్పుడూ ఆటంకాలు కలగడం సహజం. ఆటుపోట్లు ఎదురవ్వడం సహజం. అయినా పురోగామి భావాలు శక్తులు నిర్భయంగా ఎదుర్కొన్నాయి. నిలదొక్కుకున్నాయి. నిరంతరం ముందుకు సాగుతూనే ఉన్నాయి. ఉంటాయి కూడానూ. ఇది చరిత్ర మనకందించిన సత్యం.

తాత్వికత గట్టి పునాదిగా ఉన్నప్పుడు సాహితీ సౌదం పటిష్టంగా ఉంటుంది. అందుకే అభ్యుదయ సాహిత్యం అభ్యుదయ రచయితల సంఘం, అభ్యుదయ పత్రిక ఎవరెన్ని దుమారాలు సృష్టించినా శాపనార్థాలు పెటినా ముందుకెల్తూ ఉంటుంది. ఉంది. పత్రిక ప్రజలకోవేదికగా ఆవిర్భవిస్తూనే ఉంటుంది.

ప్రస్తుతం రెండు తెలుగు రాష్ట్రాలు, అశేష సాహిత్యాభిమానులు, వర్ధమాన రచయితలకు కొదువలేని సాహిత్య బలం. కొత్త రక్తం కొత్త ఆలోచనలు, కొత్త శక్తులతో తప్పక అభ్యుదయ నిలబడుతుంది. పక్కా ప్రణాళిక, నిరంతరం దీనిమీదే ధ్యాసపెట్టి కార్యకర్తలు రచయితలందరితో సమన్వయ దృక్పథంలో మెలగగలిగే స్వభావమున్న

కార్యకర్తలు, నిర్వాహకులు, ప్రస్తుతం నిర్వహణాభారం వహిస్తున్నారు. అభ్యుదయ రచయితల సంఘం తెలంగాణ శాఖ బాధ్యతలను తలకెత్తుకుంటె అందుకు వారిని అభినందిద్దాం. మితవాద, మతవాద, అతివాద ఫ్యూడలిస్టు భావజాలం. దానికితోడు అహంకార పూరిత ఫాసిస్టు భావజాలం కలగలిపిన నేటి సమాజంలో చాపక్రింద నీరులా ప్రవహిస్తుండటం గమనించగలం. దీని దుష్పరిణామాలు రచయితలను ప్రభావితం చేయడం ఉండవచ్చు. అది అభ్యుదయ దృక్పథాన్ని అడ్డుకోవచ్చు. ప్రజల్లో అసహనం పెచ్చురిల్లి, అభద్రతా భావం పెరిగి సమైక్యతకు విఘాతం కలిగే ఆస్కారముంది. ఈ ప్రమాదాన్ని ముందుగానే రచయితలు గ్రహించి హెచ్చరించాల్సిన ఈ తరుణంలో అభ్యుదయ పత్రిక చాలా అవసరం. ఇరు రాష్ట్రాల సాహిత్య వేత్తల అండదండలను ఆశిస్తుంది. ఆర్థికంగా చేయూతనివ్వడం మనందరి బాధ్యతగా గుర్తిద్దాం. "అభ్యుదయ"ను ప్రగతిశీల కాలనాళికగానూ వర్ధమాన రచయితల వేదికగాను రూపుదిద్దుకొందాం. పత్రికను ప్రతి సాహితీ వేత్తకు చేరవేద్దాం. విభిన్న సాహిత్య వాదం వేదికగా మలుద్దాం. ప్రస్తుతం ఉన్న సంక్లిష్ట సంస్కృతి, సాహితీ, సామాజిక పరిస్థితులలో కొత్త ఆలోచనలతో దృష్టికోణాల్తో అభ్యుదయ రచనలను నిర్దేశించుకుందాం. అభ్యుదయ పత్రిక. పదికాలాలు కొనసాగాలని మనసారా ఆకాంక్షిస్తూ ఆహ్వానిద్దాం... ఆదరిద్దాం... అక్కున చేర్చుకుందాం... గో హెడ్ అందాం...

**డా॥ ఏటుకూరి ప్రసాద్**
అభ్యుదయ పూర్వ సంపాదకులు
అరసం అధ్యక్షవర్గ సభ్యులు

---

## అభ్యుదయ సంపాదకులకు అభినందనలు...

వ్యవస్థలో ప్రజావ్యతిరేక శక్తులతో పోరాడడానికి "అభ్యుదయ"ను పునః ప్రవేశపెడుతున్న అభ్యుదయ మిత్రులకు, అభ్యుదయ ప్రేమికులకు శుభాకాంక్షలు.

ప్రగతిశీల రచయితలకు పాఠకులకు గతంలో మాదిరి చైతన్య స్ఫూర్తిదాయక రచనలతో అభ్యుదయ వెలువడుతూ కష్టజీవులకు అండగా నిలుస్తూ, ఆరోగ్యకరమైన సాహిత్యమూ తెలుగులో వెలువడేట్టుగా చేయాలని ఆకాంక్షిస్తూ నవనవోన్మేషనంగా 'అభ్యుదయ' వెలువడాలని ఆశిస్తూ ఆహ్వానిస్తున్నాను.

**మల్లెపల్లి ఆదిరెడ్డి**
కార్యవర్గ సభ్యులు
సి.పి.ఐ. తెలంగాణ రాష్ట్రం

# వరంగల్లు సాహిత్య చరిత్ర

-డా॥ వి.వీరాచారి

ఈతరం పిల్లలకు జానపద కథలపై పెద్దగా అవగాహనలేదు. ఆసక్తికూడా లేదు. వీడియోగేమ్స్, చాటింగ్స్, వగైరా వగైరా... నిజానికి వాళ్ళని అనడంలో ప్రయోజనంలేదు. ఇవ్వాల వాళ్ళకు ఆ అవకాశాలు లేవు. కారణం భారతీయ సాంస్కృతిక జీవనానికి పెట్టని కోటగా వున్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థ అంతరించిపోవడం. అమ్మమ్మలు-తాతయ్యలు, జేజమ్మలు-జేజినాయనలను కుటుంబ వ్యవస్థకు దూరంగా వృద్ధాశ్రమాల్లో ఉంచడం. ఫలితంగా పిల్లలు వాళ్ళకు అందుబాటులో వున్న ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో వినోదిస్తున్నారు. దానివల్ల వారిలో మానసిక వికాసం కలగడంలేదు. మాతరం వరకు జానపదకథలను అమ్మమ్మ నాయనమ్మ తాతయ్యల ద్వారా వినే భాగ్యంకలగడం, అది మా అదృష్టం.

ఈ విషయం ఎందుకు రాస్తున్నానంటే నేను చిన్నప్పుడు విన్న అనేక జానపద కథల్లో "ఈగ ఇల్లు అలుకుతూ తన పేరును మరచిపోయే" కథ ఒకటి. ఈగ తన పేరును తెలుసుకోవడం కోసం నానా అవస్థలు పడి చివరకు సఫలీకృతం అవుతుంది. తెలంగాణ సాహిత్య చరిత్రను వున్నదాన్ని అధ్యయనంచేసి, అవసరమైతె వెలికితీసి పునర్నిర్మించుకోవాలంటే 'ఈగ' పడిన అవస్థలు మనం కూడా పడక తప్పదు. విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే భ్రమలో వున్నవారి మూలంగానూ, సీమాంధ్ర పెట్టుబడిదారులు, రాజకీయ నాయకుల కుట్రల మూలంగానూ ఆంధ్రప్రదేశ్‌లో విలీనం చేయబడి మన ఉనికిని కోల్పోయాం. ప్రజాకవి కాళోజీ అన్నట్లు రెండున్నర జిల్లాల, కులాల దండిభాష మన భాష అయింది. 1956కు పూర్వం తెలంగాణకు ప్రత్యేక సామాజిక, రాజకీయ, చారిత్రక, సాహిత్య, సాంస్కృతిక పరమైన ఉనికి ఉంది. మధురమైన యాసతో కూడిన భాషా సమాజం ఉంది. శాతవాహనుల కాలం నుండి, తెలంగాణ రాష్ట్ర మొదటి చివరి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు గారి దాక సాగిన పాలనలో ప్రజాసంక్షేమానికే ఎక్కువ ప్రాముఖ్యత ఉందని చరిత్రలోనికి వెళ్తే సాక్ష్యాధారాలతో సహా తెలుస్తుంది.

తెలంగాణ ప్రాంతాన్ని పరిపాలించిన ప్రధాన రాజ్యాలైన శాతవాహన, కాకతీయ,గోల్కొండ కుతుబ్‌షాహీలు, నిజాం దాక సూక్ష్మ దృష్టితో పరిశీలిస్తే ఈ చారిత్రక సత్యం అవగతమవుతుంది. రాజరిక వ్యవస్థ. ప్రజాస్వామ్యవ్యవస్థ, సామ్యవాద వ్యవస్థ, సామ్రాజ్యవాదవ్యవస్థ ఇలా ఏవ్యవస్థకు వుండే స్వరూపం-స్వభావం ఆ వ్యవస్థకు ఉంటుంది. దీన్ని కాదనలేము. కానీ ఆయా వ్యవస్థలు వాటి స్వభావాలు వాటికి ఉండగా, వాటికున్న

పరిమితుల్లో ప్రజల పట్ల ఏవిధంగా వ్యవహరించాయన్నది ప్రధాన అంశం. ఈ దృష్టికోణంలో నిష్పాక్షికంగా, కుల-మత రాజకీయాలకు అతీతంగా, లోతుగా పరిశీలించి తెలంగాణ సాంఘిక చరిత్రను పునర్నిర్మించుకోవలసి ఉంది. సాంఘిక చరిత్రకు సాహిత్య చరిత్రకు అవినాభావ సంబంధం ఉంటుంది కాబట్టి సాహిత్య చరిత్రను సహేతుకంగా పునర్నిర్మించుకోడానికి అవకాశం ఉంది.

ఇంతకు ముందు చెప్పినట్లుగా ఈగ ఇల్లు అలుకుతూ తన పేరును మరచిపోయినట్లుగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మన ఉనికిని మనం మరచిపోయి సీమాంధ్ర కవులు-రచయితల సాహిత్య పల్లకీలు మోసాం. దేశీ కవిత్యోద్యమకారుడు, సాహిత్య ప్రక్రియల ప్రయోగకారుడు పాల్కురిని, భాగవత సుధారసాలను పంచిన పోతనను, కథా కావ్యరచనకు పట్టంకట్టిన కొరవి గోపరాజును, అచ్చతెనుగు కావ్యం రాసిన పొన్నగంటి తెలగన, పురాణ రచనకు నాంది పలికిన మారన, యక్షగానానికి జీవం పోసిన కందుకూరి రుద్రకవిని, "నేనురా తెలగాణ నిగళాలు దెంచ ఆకాశమంత ఎత్తు అరచినాను" అన్న దాశరథిని, ప్రజాకవి కాళోజీని, ఆంధ్రుల సాంఘిక చరిత్రను తెలియచేసిన సురవరం ప్రతాపరెడ్డి గారిని గురించి ఆలోచించాల్సినంతగా మనం ఆలోచించలేదు. వాళ్లపై చేయవలసినంత పరిశోధనలు చేయలేదు. రాయవలసినంతగా రాయలేదు. కానీ మన ప్రాంత కవులను, సాహిత్యాన్ని విస్మరించి తెలంగాణలో కవులు పూజ్యం అని ముడుంబై రాఘవాచారి లాంటివారు అన్నప్పుడు గోలకొండ కవులసంచిక ద్వారా సమాధానం చెప్పి ఆత్మగౌరవాన్ని ప్రకటించుకున్నాం. మీది తౌరాక్యాంధ్ర భాష అంటూ వాళ్లు ఎద్దేవ చేసినప్పుడు 'వట్టికోట ప్రజల మనిషి' దాశరథి రంగాచార్యగారుచిల్లరదేవుళ్లు వంటి నవలలు రాశారు. పాకాల యశోదరెడ్డి లచ్చక్క కథలు చెప్పింది. రవ్వా శ్రీహరిగారు, నలిమే భాస్కర్‌గారు తెలంగాణ భాష-యాసలో ఉండే మాధుర్యాన్ని విప్పిచెప్పడమే కాక ఎవరిది అసలు తెలుగు భాషో సోదాహరణంగా వివరిస్తూ పరిశోధన గ్రథాలు రాశారు. వీటన్నింటిని లోతుగా అధ్యయనం చేసి తెలంగాణ సాహిత్య చరిత్రను పునర్నిర్మాణం చేసుకోవలసి ఉంది.

1

తెలంగాణ రాష్ట్ర సాధన ఆకాంక్ష సకల జనుల గుండెల్లో బలంగా గూడుకట్టి, ప్రజా ఉద్యమంగా ప్రజ్వరిల్లి "చావో-రేవో" అనే రీతిలో సాగుతున్న ఈ తరుణంలో కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం "తెలంగాణ సాహిత్య చరిత్ర-పునర్నిర్మాణం" అనే అంశంపై యూజిసి వారి సహాయంతో జాతీయ సదస్సును నిర్వహించడానికి ముందుకు రావడం ఒక చారిత్రక సందర్భం. ఈ సదస్సు సంచాలకులు, తెలుగు విభాగం అధ్యక్షులు డా॥పంతంగి వెంకటేశ్వర్లు గారికి, అధ్యాపక బృందానికి అభినందనలు. ఈ సదస్సులో నేనుసమర్పిస్తున్న పత్రం "వరంగల్లు సాహిత్య చరిత్ర".

ఈ జిల్లా సాహిత్య చరిత్ర పునర్నిర్మాణాన్ని గురించి ఆలోచిస్తున్నమంటే తెలంగాణ సాహిత్య చరిత్ర పునర్నిర్మాణాన్ని గురించి ఆలోచిస్తుస్తున్నమన్నట్లే. ఎందుకంటే వరంగల్లు యావత్

తెలుగు ప్రాంతాలన్నింటిని ఒక గొడుగు కిందకు తెచ్చిన ఒకప్పటి కాకతీయ సామ్రాజ్యానికి రాజధాని. కళల కాణాచి, ఉద్యమాల ప్రయోగశాల. నన్నయ ప్రారంభించిన మార్గకవితా పద్ధతికి భిన్నంగా దేశీ కవితా ఉద్యమానికి ఊపిరి పోసినవాడు, శతకం, ఉదాహరణకావ్యం, పురాణం, అష్టకం-ఇలా ఎన్నో నూతన సాహిత్య ప్రక్రియలను సృష్టించి కొత్తదారులు వేసిన పాల్కురికి సోమన ఈ ప్రాంతంవాడే. తెలంగాణ సాహిత్య చరిత్రను పునర్నిర్మాణం చేసుకొనే క్రమంలో పాల్కురికి సోమనను తెలంగాణ లిఖిత సాహిత్యానికి "ఆదికవిగా" ఒక మైలురాయిని నాటి సాహిత్య చరిత్ర రచనకు పూనుకోవాలి.

అంతేకాదు. శిల్పపరంగా కూడా తన రచనల్లో మణిప్రవాళ శైలిని ప్రవేశపెట్టిన ప్రయోగవాది పాల్కురికి సోమన. ఒక్క మాటలో చెప్పాలంటే "పురాణం పంచలక్షణం" అనే భావనను పక్కకుపెట్టి వస్తువు-భావం-శిల్పం-ఈ మూడింటిలో కొత్తదారులు తొక్కి బసవపురాణం, పండితారాధ్య చరిత్ర వంటి గ్రంథాలు రాసిన ప్రయోగవాది, ప్రజాకవి పాల్కురికి. మొత్తం తెలుగు సాహిత్య చరిత్రలో ప్రయోగాలు చేసిన కవులు ఇద్దరే ఇద్దరు ప్రాచీన కాలంలో పాల్కురికి సోమన, ఆధునిక యుగంలో శ్రీశ్రీ.

పాల్కురికి సోమనాథుని నుండి కాళోజీదాక ఉన్న వరంగల్లు సాహిత్య చరిత్రను అధ్యయనం చేస్తే మనకెన్నో మైలురాళ్లు కనిపిస్తాయి. వాటన్నింటిని లోతుగా విశ్లేషించడం స్థలకాలాల దృష్ట్యా సాధ్యంకాదు. కాబట్టి రేఖామాత్రంగా విహంగ వీక్షణం చేయడం జరుగుతుంది.

ప్రాచీన కాలం నుండి నేటిదాకా వున్న వరంగల్లు జిల్లా సాహిత్యాన్ని పరిశీలిస్తే ఈ ప్రాంతంలో దేశీ-మార్గకవితా పద్ధతులు జమిలిగా సమాంతరంగా సాగినట్లు కనిపిస్తుంది. భాషా విషయంగా చూస్తే విచిత్రం, తెలుగు సంస్కృతం- ఈ రెండు భాషల్లో కవులు ఈ ప్రాంతంలో రచనలు చేశారు. ఇక వస్తు-భావ-శిల్ప పరంగానే కాకుండా ప్రక్రియ పరంగా కూడా ఈ ప్రాంతంలో జరిగినన్ని ప్రయోగాలు తెలుగు నాట ఎక్కడ జరుగలేదనే చెప్పవచ్చు. ఆనాటికవులుసాధారణంగా తాళపత్రాలపై కావ్యాలు రాయడమనేది జగమెరిగిన సత్యం. ఇక్కడ శిలాకావ్యాలు కూడా కనిపిస్తాయి. క్రీ.శ.1163 ప్రాంతానికి చెందిన వేయి స్థంబాలగుడి శాసనం. 12వ శతాబ్ది ఉత్తరార్థానికి చెందిన ఉర్సుగుట్ట శాసనాల్లో మనకు కావ్యాలు కనిపిస్తాయి. అంటే కావ్యాలను రాళ్లపై చెక్కించడం అనే సంప్రదాయం ఒక్క మన వరంగల్లులోనే కనిపిస్తుంది. వేయిస్థంబాల గుడి శాసనకావ్యం అచితేంద్రయతిది. ఉర్సు గుట్ట శాసనాలపై చెక్కబడిన సిద్ధోద్వాహ కావ్యకర్తా నృసింహర్షి.

కాకతీయులు సంస్కృత-తెలుగు భాషలను రెండు కళ్లుగా భావించారని చెప్పవచ్చును. మొదటి రుద్రదేవునికి విద్యా భూషణుడనే బిరుదు వుంది. రెండో ప్రతాపరుద్రదేవుని ఆస్థానంలో రెండు వందల మంది సంస్కృత కవులున్నట్లు ప్రతాపరుద్రీయం ద్వారా తెలుస్తుంది. ఇతడు కవి పోషకుడే కాకుండా స్వతహాగా కవి కూడా. యయాతి చరిత్ర, ఉషారాగోదయం, నీతిసారమనే నాటకాలను రచించినట్లు తెలుస్తుంది. వీటన్నింటిని పరిశీలించి, పరిశోధించి, సాహిత్య చరిత్రను పునర్నిర్మించుకోవలసి ఉంది.

అయితే ఈ పరిధిలో వరంగల్లు జిల్లా సాహిత్య చరిత్ర రచన ఇంతవరకు జరగలేదనే చెప్పవచ్చును. దురదృష్టకరమైన అంశం ఏమిటంటే సాహిత్య చరిత్రలకు, విమర్శలకు, సమీక్షలకు, పరిచయాలకు మధ్య వుండే భేదాన్ని స్పష్టంగా గుర్తించే దృష్టి మనకు ఈనాటికి లేదు. వీటన్నింటిని సాహిత్య చరిత్రలుగానే భావిస్తున్నాం. ఇతిహాసానికి పర్యాయపదం చరిత్ర అని ఈనాటికి భావించేవాళ్లు వున్నారు. ఇతిహాసమంటే ఇలా జరిగింది అని చెప్పడం. చరిత్ర అంటే అలా జగడానికి సంబంధించిన కారణాలను విశ్లేషించి ఫలితాన్ని నిర్ధారించడం. అంటే సమాజంలోని వైరుధ్యాల మధ్య జరిగే సంఘర్షణ మూలంగా కలిగే మార్పు చరిత్ర. ఈ మార్పుకు సంబంధించినకార్యకారణ సంబంధాన్ని వివరిస్తే అది సాంఘిక చరిత్ర అవుతుంది. సమాజ ప్రతిబింబమైన సాహిత్యంలో వచ్చిన మార్పులను గుర్తించి అందుకు సంబంధించిన కారణాలను సహేతుకంగా విశ్లేషించి రాస్తే సాహిత్య చరిత్ర అవుతుంది. ఆయా ప్రాంతాల్లోని కవులు-రచయితల జీవితం-సాహిత్యంపై జరిగిన పరిశోధనలు, విమర్శలు, సమీక్షలు, పరిచయాలు, సమాలోచనలు-ఇలాంటివన్నీ సాహిత్య చరిత్రకు ముడిసరుకు అవుతాయి. ఈ ముడిసరుకుకు సంబంధించిన కృషి శిష్ట-జానపద సాహిత్యాల్లో ఇక్కడ విశేషంగా జరిగింది. అది వ్యక్తుల పరంగానూ, సాహిత్య సంస్థల పరంగానూ, విశ్వవిద్యాలయం, దాని పరిధిలోని విద్యాసంస్థల్లోనూ, ఇలా అనేక రూపాల్లో ఈ కృషి విస్తరించింది. కానీ వీటన్నింటిని సమీకరించి వరంగల్లు సాహిత్య చరిత్ర రచనకు మాత్రం ఇంతవరకు ఎవ్వరూ పూనుకోలేదు. ప్రాంతీయ చరిత్రలను కానీ, సాహిత్య చరిత్రలను కానీ రాసుకునే అలవాటు మనకు మొదటి నుండి లేదు. అస్తిత్వ ఉద్యమాల పుణ్యమా అని ఈ ఆలోచనలు ఇప్పుడు ప్రారంభమైనాయి. సంకుచిత దృష్టితో కాకుండా విశాల హృదయంతో ప్రాంతీయ సాహిత్య అధ్యయనాలు చేసి చరిత్రను రాసుకోవడం చాలా అవసరం. ఎందుకంటే ఇలాంటి చరిత్రలే ప్రామాణికమైన ఒక జాతి సాహిత్య చరిత్ర రాయడానికి ఉపాధేయాలు అవుతాయి.

3

సాహిత్య చరిత్రలను సాధారణంగా రాజుల పరంగానో ప్రక్రియల పరంగానో, కవుల పరంగానో రాసే సంప్రదాయం ప్రస్తుతానికి ఉంది. దీనికి కొంత భిన్నంగా తాత్త్విక పునాది మీద వరంగల్లు సాహిత్య చరిత్రను 1)ఆస్థాన సాహిత్యం 2)ఆస్థానేతర సాహిత్యం అని ప్రాచీన సాహిత్యాన్ని రెండు భాగాల్లోనూ 1)తెలంగాణ విమోచనోద్యమ సాహిత్యం 2)చేతనా వర్తన కవిత్వం 3)స్వేచ్ఛాకవిత్వం 4)తిరుగుబాటు ఉద్యమ కవిత్వం 5)విప్లవ సాహిత్యం 6)అభ్యుదయ సాహిత్య 7)నవ్య సంప్రదాయ సాహిత్యం 8)దళితవాద సాహిత్యం 9)స్త్రీవాద సాహిత్యం 10)అస్తిత్వ ఉద్యమ సాహిత్యం 11)జానపద సాహిత్యం అని ఆధునిక సాహిత్యాన్ని పదకొండువిభాగాల్లోనూ - ఇలా మొత్తం పదమూడు విభాగాల్లో ఈ పత్రాన్ని రాయడానికి పరిధిని ఏర్పరచుకున్నాను. ఇది ప్రారంభం మాత్రమే కాని ఇదే సమగ్రంకాదు. ప్రామాణికమైంది అంతకన్నా కాదు.

**1)ఆస్థాన సాహిత్యం :** వరంగల్లు జిల్లాకు సంబంధించినంతవరకు ఆస్థానసాహిత్య పరిధి చాలా తక్కువ. ఇప్పుడున్న వరంగల్లు జిల్లా భౌగోళిక పరిధిలో లభ్యమవుతున్న ఆధారాల నేపధ్యంలో ఆలోచించినపుడు ఇక్కడ ఆస్థాన కవులంటూ ప్రత్యేకంగా కనిపించరు. కాని గణపతిదేవుని పాలనలో ఏదో ఒక ఉద్యోగం చేస్తూ రచనలు చేసిన వారే మనకు ఎక్కువగా కనిపిస్తారు. కారణం కాకతీయులు వ్యవసాయానికి ఇచ్చినంత ప్రాముఖ్యతను ప్రత్యేకంగా సాహిత్యానికి శ్రీకృష్ణదేవరాయల్లాగా ఇవ్వలేదు. వీరు సాహిత్యాన్ని ఆదరించారనటానికి ఆధారాలున్నాయి. పోషించారు అనడానికి ఆధారాలు ఇప్పుటికైతే లేవు. ఆనాడు సంస్కృత భాషలోనైనా, తెలుగు భాషలోనైనా, భాష ఏదైనా కావచ్చు, ఆయా భాషల్లో రచనలు చేసినవారుమాత్రం కవిత్వాన్నే జీవనోపాధిగా పెట్టుకోలేదు. వివిధ వృత్తుల్లో హోదాల్లో పనిచేస్తూ ప్రవృత్తిగా మాత్రమే గ్రంథ రచనలు చేసినట్లు కనిపిస్తుంది. డా॥టి.శ్రీరంగ స్వామిగారు వరంగల్లు జిల్లా వాఙ్మయ సూచికలో 1900కి ముందు వున్న వరంగల్లు జిల్లా కవులు అంటూ మార్కండయపురాణ కర్త మారనను మొదలుకొని సుంకరనేని రాజమౌళిదాక మొత్తం 101 మంది కవుల పేర్లను పేర్కొంటు ఒక పట్టిక ఇచ్చారు. వీరిలో ముప్పది మంది కవులను మాత్రమే ప్రాచీన కవులుగా గుర్తించడానికి అవకాశం ఉంది. మిగతా వాళ్ళంతా దాదాపుగా ఆధునిక యుగానికి సంబంధించిన ఆధునిక సంప్రదాయ కవులని భావించడానికి ఆస్కారమున్నది. ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యుల సంపాదకత్వంలో జిల్లా సాంస్కృతిక మండలి ప్రచురించిన ఏకశిల సాహిత్య సౌందర్యం (ఇందులోని వ్యాసాలుఆకాశవాణి వరంగల్లు కేంద్రం ద్వారా ధారావాహికంగా ప్రసారమైనాయి) డా॥యల్లంభట్ల నాగయ్య గారు ఎస్.వి.ఎస్. డిగ్రీ మరియు పి.జి. కళాశాలలో తెలంగాణ ప్రాచీన సాహిత్యం పై సెప్టెంబర్ 17, 2008లో రాష్ట్రస్థాయి సంగోష్ఠినిర్వహించి, అందులోని ప్రసంగ పత్రాలను పుస్తకంగా ప్రచురించిన దానిలో ఆయనే రాసిన "వరంగల్లు జిల్లా ప్రాచీన సాహిత్యం" అనే వ్యాసాన్ని పరిశీలించినప్పుడు ఎవరెవరి కాలంలో ఏయే కవులున్నారు, వారు రాసిన గ్రంథాలు ఏవి అన్న సమాచారం కొంత లభిస్తుంది.

కుమారసంభవ కావ్యకర్త నన్నెచోడుడు అనే కవి వున్నట్లు చాలామంది పరిశోధకులు అంగీకరించడంలేదు. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిలాంటి వారు 'కుమారసంభవం' కూటసృష్టి అంటూ ఏకంగా ఒక గ్రంథమే రాశారు. డా॥యల్లంభట్ల నాగయ్య గారు మాత్రం చెరుకూరి శాసనాన్ని ఆధారంగా చేసుకొని ఇతడు గణపతిదేవ చక్రవర్తి ఉద్యోగి అని క్రీ.శ. 1160-1170 ప్రాంతంలో జీవించి వున్నాడని పేర్కొన్నాడు. దీన్ని బట్టి మొత్తం తెలుగు సాహిత్యానికి ఆదికవి నన్నెచోడుడు అయ్యే అవకాశం ఉంది. అయితే ఈ విషయాన్ని సహేతుకంగా నిరూపించాల్సి ఉంది. ఇలాగే పురుషార్థసారం, శివదీమణి శతకం పరతత్వరసాయనం అనే గ్రంథాలు రాసిన శివదేవయ్య సంస్కృతాంధ్ర కవితా పితామహుడిగా బిరుదు పొందాడు. అతడుగణపతి దేవ చక్రవర్తికి దీక్షా గురువుకూడా. సుమతి శతకకర్త, నీతిశాస్త్ర ముక్తావళి కర్త బద్దె భూపాలుడు ఓరుగల్లు నివాసి. కాకతీయుల సామంతరాజు, సిద్దేశ్వర చరిత్ర రాసిన ఏకామ్రనాధుడు వరంగల్లు

ప్రాంతంలో క్రీ.శ.1500 ప్రాంతంలో జీవించివున్నాడని ఖండవల్లి లక్ష్మీరంజనం పేర్కొన్నాడు. నెల్లూరుకిచెందిన తిక్కనకూడా రాచకార్యంమీద వరంగల్లుకు వచ్చి గణపతి దేవుని ఆశ్రయించి ఇక్కడే భారత రచన చేశాడని చారిత్రక విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. ఈకాలంలో ఈయనకు శిష్యులుగావున్న మార్కండేయ పురాణకర్తమారన, దశకుమార చరిత్ర, ఆంధ్ర భాషా భూషణం, విజ్ఞానేశ్వరీయం వంటి గ్రంథాలురాసిన మూల ఘటిక కేతన, సింహాసన ద్వాత్రింశక రాసిన కొరవి గోపరాజు, మొదలైనవారంతాఈ ప్రాంతంవారే.

సంస్కృత కవులుగా ప్రసిద్ధి పొందిన శాకల్యమల్లుడు, ప్రతాపరుద్రుని కాలంలో వున్న విద్యానాథుడు, అగస్త్యుడు మొదలైనవారు పేర్కొనదగిన వారు. ప్రతాపరుద్రుని కథానాయకునిగా చేసి విద్యానాథుడు ప్రతాపరుద్రయశోభూషణం అనే అలంకార శాస్త్రగ్రంథాన్ని సంస్కృతంలో రాశారు. అగస్త్యుడు బాలభారతం, నలకీర్తికౌముది, కృష్ణచరిత్ర మొదలైన డెబ్బది గ్రంథాలు రాశారు. గంగాదేవి మధరా విజయం అనే గ్రంథం రాసింది. ప్రతాపరుద్రుడు స్వయంగా సంస్కృతంలో నీతిసారము, ఉషారాగోదయం, యయాతి చరిత్ర వంటి నాటకాలు రాశారు. నృత్తారత్నావళి వంటి శాస్త్ర గ్రంథాలను రాసిన జాయప సేనాని - ఇలా పేర్కొంటూపోతే చాలా మంది కవులు మనదృష్టికి వస్తారు. వీళ్లెవ్వరు కూడా రాజుల ఆస్థానంలో కవులుగా లేరు. ఉద్యోగులుగానో, సామంతులుగానో, రాజులు–చక్రవర్తులుగా ఉంటూ రచనలు చేశారు. కాబట్టి ఆస్థానకవులుగా పేర్కొనడం జరిగింది. అంటే వీళ్లు వృత్తిరీత్యా ఆస్థానానికి చెందిన వారే కానీ ప్రవృత్తిరీత్యా కాదు అన్న విషయాన్ని ఇక్కడ మనం గుర్తించాలి.

**2.ఆస్థానేతర సాహిత్యం :** ఈ విభాగంలో వృత్తిపరంగానూ, ప్రవృత్తిపరంగానూ రాజులను ఆశ్రయించకుండా రచనలు చేసినకవులుమాత్రమే వస్తారు. వరంగల్లు సాహిత్య చరిత్రకు సంబంధించినంత వరకు ఈ విభాగం ప్రత్యేకమైనది ప్రముఖమైనది. దేశి కవితా ఉద్యమ కారుడు పాల్కురికి సోమన, తెలుగు పుణ్యాల పేటిగా కవిసామ్రాట్ విశ్వనాథ ప్రశంసించిన సహజకవి పోతన వంటి వారుఈ విభాగంలోనికి వస్తారు. చాతుర్వర్ణ వ్యవస్థపై తిరుగుబాటు చేస్తూ భగవంతునికి అందరూ సమానమనే తాత్త్విక పునాది మీద బసవేశ్వరుడు స్థాపించిన మార్గపద్ధతికి భిన్నంగా అందరికి అర్థమయ్యే రీతిలో జాను తెనుగులో దేశీ ఛందస్సుల్లో బసవపురాణం, పండితారాధ్య చరిత్ర వంటి గ్రంథాలు రాసిన పాల్కురికి సోమనాథుడు. రామానుజాచార్యులు స్థాపించిన విశిష్టాద్వైతాన్ని తన భాగవత రచన ద్వారా భక్తి సుధారసంలో అందించిన పోతన - ఈ ఇద్దరూ, వరంగల్లు జిల్లాలోని బమ్మెర, పాలకుర్తి గ్రామాలకు చెందినవారే. ఈ రెండు గ్రామాలు పక్కపక్కనే ఉంటాయి. ఈ ఇద్దరు కవులు తెలుగు సాహిత్య చరిత్రలో మేరు హిమవత్పర్వతాల్లాంటివారు. భక్తుని ముందు రాజులైన, తరాజులైన చివరకు దేవుడైనా సరే తల వంచాల్సిందే అని చాటి చెప్పి భక్తికవిత్వ ఉద్యమానికి జీవంపోసారు. వీరిద్దరిలోనూ ధిక్కార స్వరాలున్నాయి. సోమనలో పరోక్షంగానూ, పోతనలో ప్రత్యక్షంగాను మనకు రాజధిక్కారం కన్పిస్తుంది. “ఇమ్మనుజేశ్వర అధములు, గూళలు, కర్నాట కిరాత కాంధ్రులు

అంటూ రాజులను ధిక్కరించిన పోతన సాత్విక గుణసంపన్నుడు. నిమ్నకులకు చెందిన వ్యక్తులను, స్త్రీలను పాత్రలుగా చేసి రచనలు చేసిన పాల్కురికి సోమన రజోగుణుడు. "చేతులారంగ శివుని పూజించడేని నోరునొవ్వంగ హరికీర్తినుడువడేని" అంటూ శివకేశవులకు అభేదాన్ని చెబుతూ పోతన వైష్ణవ తత్త్వాన్ని బోధిస్తే; శివుడే దేవుడంటూ పాల్కురికి సోమన వీరశైవా చార వ్రతాన్ని భక్తి మార్గంలో ప్రబోధించాడు. పాల్కురికి సోమన 13వ శతాబ్దానికి చెందినవాడు. పోతన 15వ శతాబ్దానికి చెందినవాడు. పోతన తరువాత రెండు వందల సంవత్సరాలకు వచ్చిన పరుశరామ పంతుల లింగమూర్తి గారు సీతారామాంజనేయ సంవాదం గ్రంథం రాసి వరంగల్లు సాహిత్య చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు. కాబట్టే ఆచార్య కోవెల సంపత్కుమారగారు ఆయనను గురించి ఇలా అన్నారు.

"తెలుగు నాట వేదాంతులెందరో ఉండవచ్చు. ఆ శాస్త్రంలో అద్వితీయ పండితులూ ఉండవచ్చు. కాని, వేదాంత మార్గాన పటిష్ఠమూ, స్వతంత్రమూ అయిన గ్రంథం ఏదీ రాలేదు. పద్దెనిమిదవ శతాబ్దం చివర పరుశురామపంతుల లింగమూర్తి రచించిన సీతారామాంజనేయ సంవాదం ద్వారా ఓరుగల్లు ఈ లోటును తీర్చింది".

ఈ విధంగా వరంగల్లు ప్రాంతానికి చెందిన ఆస్థాన-ఆస్థానేతర కవులు ఎవరికివారే తమకాలంనాటి సామాజిక వ్యవస్థను దృష్టిలో వుంచుకొని బలమైన తాత్త్విక భూమికతో రచనలు చేశారు. ఈవారసత్వం మనకుతెలంగాణ సాహిత్యంలోనే కనిపిస్తుంది. విస్తృతమైన పరిశోధనల ద్వారా ఈ విషయాన్ని ప్రామాణీకరించవలసి ఉంది. ఇది సదస్సుకు సంబంధించిన పత్రం కాబట్టి దీనికి ఉండే పరిధిలోనే ప్రాచీన వరంగల్లు సాహిత్య చరిత్రను పరిచయం చేయడం జరిగింది. ఇప్పుడు ఆధునిక సాహిత్యాన్ని పరిశీలిద్దాం.

## ఆధునిక సాహిత్యం

**1. తెలంగాణ విమోచనోద్యమ సాహిత్యం :** హైదరాబాద్ కేంద్రంగా 1920 నుండి తెలంగాణ విమోచనోద్యమ సాహిత్యంప్రారంభమైంది. అది ఆంధ్రజన సంఘంగా, ఆంధ్రమహాసభలుగా పరిణతి చెంది తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంగా దిశను-దశను మార్చుకున్నది. ఈ పరిణామ దశలన్నింటిలోనూ వరంగల్లు ప్రాంతానికి చెందిన కవులు రచయితలు ప్రముఖ పాత్రను వహించారు. వారిలో ప్రజాకవి కాళోజి దాశరథి సోదరులు, మొదలైన వారు పేర్కొనదగినవారు.

"మన కొంపలార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచిపోకుండా గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసగొట్టు చుండాలె
కాలంబు రాగాన కాటేసి తీరాలి"

అంటూ నిజాం ప్రభుత్వ దౌర్జన్యాలను నిరసిస్తూ మనకు కర్తవ్యాన్ని బోధించిన ప్రజాకవి కాళోజీ ఈ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు.

"ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలినరాజు మాకెన్నడేని
తీగలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ"

అంటూ దాశరథి నిజాంపై తన ధిక్కార స్వరాన్ని వినిపించాడు. దాశరథి సోదరులలో ఒక రైన దాశరథి రంగాచార్య గారు చిల్లరదేవుళ్లు, మోదుగపూలు, జనపదం వంటి నవలలను రాసి తెలంగాణ సామాజిక రాజకీయ, ఆర్థిక పరిస్థితులను నమోదు చేశారు. ఈ సోదరులది మహబూబాబాద్ మండలం చిన గూడూరు గ్రామం. ఈ ముగ్గురు కవులుగా కవిత్వాన్ని చెప్పడానికి మాత్రమే పరిమితం కాకుండ తెలంగాణ విమోచనోద్యమంలో ప్రత్యేక్షంగా పాల్గొని జైలుకు వెళ్ళారు. కవి జీవితం-సాహిత్యం-ఉద్యమం వేరు వేరు కాదు అన్న నిజాన్ని నిరూపించారు.

వందేళ్ళ కథాసాగరంలో వరంగల్లు అనే వ్యాసంలో నేను ఈ ప్రాంతానికి చెందిన 60 మందికథకుల గురించి చెప్పాను. వీరిలో నెల్లూరికేశవస్వామి మాడపాటి హనుమంతరావు వంటి రచయితలు ఈ విమోచనోద్యమ కాలంనాటి సామాజిక జీవితాన్ని ఏవిధంగా చిత్రించారో వివరించడం జరిగింది. ఇంకా ఈ విభాగానికి సంబంధించి లోతుగా పరిశీలించవలసి ఉంది.

**2. చేతనావర్తకవులు :** వరంగల్లు కేంద్రంగా ఆచార్య పేర్వారం జగన్నాథం, కోవెల సంపత్కుమార, కోవెల సుప్రసన్న, వేనరెడ్డి ఈ నల్గురు కలిసి దిగంబర కవిత్వంపైన తిరుగుబాటుగా చేతనావర్తం పేరిట రెండు కవితా సంపుటాలను వెలువరించారు. తమతాత్త్వికతను గురించి సంపత్కుమారాగారు ఇలా ప్రకటించారు.

"దేశకాల సమాజాల త్రిపుటి
అన్నిటికీ కేంద్రమైన వ్యక్తి
అనంత వైవిధ్యం గల మనఃప్రవృత్తి
అన్నిదశల్లో మానవ సమగ్ర వికాసం
ఆధునిక భావ చైతన్య విన్యాసం
ఇజాల విషవలయం చీల్చి వచ్చే నిజం
ఉభయంలోనూ ఏర్పడే సామీచీన్యం
అంతర్బహిరంగ సమన్వయాల సమాలోచన...
...అనంత జగచ్చైతన్యావగాహన"

సంపత్కుమార గారి ఆమాటలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఆనాటి సామాజిక అస్తిత్వం నుండి చేతనావర్త కవులుపుట్టారని చెప్పవచ్చును. 1967 నుండి 1970 దాక సాగిన వీరి

కవితామార్గం వేనరెడ్డి గారు మరణించడంతో ఆగిపోయింది. ఒక్కొక్కరు ఒక్కొక్క కవితా సంపుటానికి సంపాదకత్వం వహించాలన్న వారి లక్ష్యం రెండు సంపుటాలతో ఆగిపోయింది. ఆ తరువాత వీరు నవ్య సంప్రదాయ కవులుగా కొనసాగారు.

**3. స్వేచ్ఛాకవిత్వం ధోరణి :** హైదరాబాద్ కేంద్రంగా కుందుర్తి ఆంజనేయులుగారు ఫ్రీవర్స్ ఫ్రంట్‌ను స్థాపించి వచన కవిత్వ ఉద్యమానికి దిశను దశను తన రచనల ద్వారా నిర్దేశించారు. కాకతీయ విశ్వ విద్యాలయంలోని తెలుగు విభాగంలో ఆచార్యులుగా పని చేసిన మాదిరాజు రంగారావు గారు వరంగల్లు కేంద్రంగా ఈ ఉద్యమ విస్తృతికి తనరచనల ద్వారా ఊపిరి పోశారు. బలమైన మానవీయ దృక్పథం. స్వేచ్ఛాపూరితమైన ప్రజాస్వామ్య భావజాలం మాదిరాజు రంగారావు గారి కవిత్వంలో మనకు కనిపిస్తాయి. ఇప్పటి వరకు తెలుగునాట ప్రతిసంవత్సరం ఒక కవితా సంకలనాన్ని వెలువరించే సంప్రదాయాన్ని ఇద్దరే ఇద్దరు కొనసాగిస్తున్నారు. ఒకరు సినారె అయితే మరొకరు మాదిరాజురంగారావుగారు. అసంఖ్యాకమైన కవితా సంకలనాలను వెలువరించిన వారిలో కూడా ఈ ఇద్దరూ అగ్రగణ్యులే.

వరంగల్లులో ఐదారుగురు పద్యకవులుతప్ప అందరూ వచన కవులే. ఆధునిక యుగంలో మొదటి తరానికి చెందిన కాళోజీ, దాశరథి, పొట్లపల్లిరామారావు, ఆచార్య కోవెల సంపత్కుమార ఆచార్య, పేర్వారం జగన్నాథం, ఆచార్య కోవెల సుప్రసన్న, లోచన్, వరవరరావు మొదలుకొని మలితరానికి చెందిన బాసిరి సాంబశివరావు, రామా చంద్రమౌళి, వి.ఆర్.విద్యార్థి, డా॥టి.శ్రీరంగస్వామి, డా॥టి.బాలరాజు అనిశెట్టి రజిత, కొమర్రాజు రామలక్ష్మి, నెల్లుట్ల రమాదేవి, డా॥కందాళ శోభారాణి, పొన్నయిల కృష్ణవేణి, అపరాజిత, డా॥వి.వీరాచారి, డా॥బన్న అయిలయ్య, పొట్లపల్లి శ్రీనివాసరావు, నిధి, అన్వర్, దర్భశయనం శ్రీనివాసరావు, వల్సపైడి, పసునూరి రవీందర్, చింతం ప్రవీణ్, వరికొండ కాంతారావు, డా॥టి.జితేందర్, డా॥పెద్దివెంకటయ్య, నల్లెల్ల రాజయ్య, బిల్లా మహేందర్, గోపగాని రవీందర్, పిట్ట సాంబయ్య వంటి ఎందరో కవులు వచన కవితలను రాస్తూ, సంకలనాలను, సంపుటాలను వెలువరిస్తున్నారు.

డా॥టి.శ్రీరంగ స్వామిగారు శ్రీలేఖసాహితీ సంస్థ ద్వారా తన సంపాదకవత్వంలో తెలుగుసంవత్సరాల పేర్లతో ప్రభవ, విభవ వంటి కవితాసంకలనాలను పరస్పర సహకార పద్ధతిలో ప్రచురించారు. శిఖరం, నిరంతరంవంటి కవితా సంపుటాలు తనవికూడా ప్రచురించారు. వరంగల్లులో దాదాపు వందదాక వచనకవులు వున్నారు. ప్రతికవి రెండు మూడు వచన కవితా సంపుటాలను లేదా సంకలనాలను వెలువరించారు. రూపపరంగావచన కవిత్వం వైవిధ్యమైనతాత్త్విక భావాలను ప్రకటిస్తూ వరంగల్లు జిల్లాలో వటవృక్షంగా ఎదిగిందని చెప్పవచ్చును.

**4.తిరుగుబాటు కవిత్వం :** వరంగల్లు ఈ ఉద్యమానికి పురిటిగడ్డ. సాయుధ కవిత్వోద్యమానికి పిలుపుగా ఇది ఆవిర్భవించింది. ఈ ఉద్యమ నేపథ్యాన్ని ఆర్.వి.బి.శర్మ గారుసృజన పత్రికకురాసిన సాయుధ కవితోద్యమానికి పిలుపు “తిరుగబడు” అనే వ్యాసంలో ఇలా రాశారు.

"1960 దశాబ్దపు చివరి పాదంలో రాజకీయాలలో "నెత్తురు మండే శక్తులు నిండిన" నవశక్తులు ఈ దేశపు మారుమూలలల్లో, కీకారణ్యాలలో ఆవిర్భవించాయి. అధర్మంపై అక్రమదోపిడిపై కత్తికట్టి నిలిచాయి. పట్టణాల్లో నగరాల్లో విశ్వవిద్యాలయాల్లో కాలేజీల్లో విద్యార్థులు నిరాశ నిస్పృహలవల్ల అయోమయులై ధిక్కార భావాన్ని ప్రదర్శింప జొచ్చారు. వియత్నామ్ ప్రజల మహెూజ్వల పరాక్రమం కొందరిని ఒకవిధంగా ఉత్తేజపరచి కార్యోన్ముఖులను చేయగా సంపన్న పశ్చిమ దేశాలలో సంప్రదాయ నిర్మూలనోద్యమంగా చెలరేగిన లక్ష్యంలేని తిరుగుబాటు మరికొందరికి మరొక విధంగా ఉత్తేజం కలిగించి సాహితీ వ్యాసంగానికి పురికొల్పినది. ఇదీ మన వర్తమాన సాహిత్య దశకు పూర్వరంగం".

వరవరరావు, లోచన్, అశోక్, సంజీవరావు, సుధాకర్, యాదగిరిరావు, కిషన్, సుదర్శన్, ఎక్స్‌రే, ఐ- అనే పదిమంది కవులు కలిసి 1969లో 'తిరగబడు' కవితా సంకలనాన్ని ప్రకటించారు. ఈ దేశంలో విప్లవం రావాలని నిజాయితీగా భావిస్తున్న, వెన్నెముకా, ముందు చూపుగల యువకులందరికీ "తిరగబడుదాం" అని పిలుపు ఇచ్చారు. "విషం కలిపిన పాయసం మన స్వరజ్యాం. డబ్బున్న భడవా పోషించే ఉంపుడు కత్తెమన ప్రజాస్వామ్యం... శాంతియుత పోరాటం అసంభవం... ఇది ప్రజాస్వామ్యం కాదు... మన విద్యా విధానం వొక పెద్ద కుట్ర" - తిరుగుబాటు తత్వాన్ని రాజీధోరణిలోకి మార్చడానికీ... తొలగిపోని ఆర్థిక అసమానతలు... వీటికి మూలం పెట్టుబడిదారీ విధానంలోనే ఉన్నవి. ఈ నిజాన్ని పీడిత తాడితులకు తెలిపి వారిని గాఢ నిద్ర నుంచి మేల్కొల్పి చైతన్యవంతులుగా చేయడం అభ్యుదయవాదుల కర్తవ్యం. అంటూ ఎందుకు తిరగబడాలో కూడా చెప్పారు.

"పదును పెట్టిన కత్తి అంచుమీద
రక్తాక్షరాలు
ఆహ్వానం అందుకో
ఇరవయ్యేళ్ళ అవమానంతో కాలికాలి
ప్రేలుటకు సిద్ధంగా ఉన్నాను
ట్రిగర్ మీద వేళ్ళతో-రా" - అంటూ లోచన్ తన కవితలో ఈ ఉద్యమలక్ష్యాన్ని ప్రకటించారు.

కనురెప్పలు గ్రుడ్లమీద ఆరగట్టి
నోట్లో నాలుకను అణచిపెట్టి
శక్తినంతటినీ అవయవాలలో తొక్కిపట్టి
ఇంకా ఎందుకోసం... తిరుగబడు అంటు "ఐ" (కవి కలంపేరు, అసలు పేరు : పి.సి.నరసింహారెడ్డి)

పిలుపునిచ్చారు. ఈ తిరగబడు కవులే 1970లో విశాఖలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో విప్లవ రచయితల సంఘానికి పురుడుపోసారు. అంటే వరంగల్లులో ప్రారంభమైన

తిరుగబడు కవితా ఉద్యమం ఆ తరువాత విప్లవసాహిత్య ఉద్యమంగా విస్తరించిదన్నమాట. చరబండరాజు, జ్వాలాముఖి లాంటి దిగంబర కవులుకూడా విరసంలో సంగమించారు.

**5. విప్లవసాహిత్యం:** "ఈ సాహిత్యానికి పత్రీక గోదావరి నది. నాసికాత్ర్యయంబకం దగ్గర పుట్టిన గోదావరి విస్తరిస్తూ విస్తరిస్తూ జీవనదిగా రూపొందినట్లుగా వరంగల్లులో పుట్టిన ఈ భావజాలం విశాఖదాక విస్తరించింది. శ్రీశ్రీని విరసం అధ్యక్షుని చేసింది. సాహితీ మిత్రుల కృషి ఆలోచనల ఫలితంగా మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్లలో వరవరరావు గారి చేతులమీదుగా 1966లో వెలుగు చూసిన 'సృజన' పత్రిక, ఆ తరువాత వరంగల్లు కేంద్రంగా 'విరసం'కు వెన్నుదన్నుగా నిలిచింది. నిరంతర నిర్బంధాలకు, అణచివేతకు గురి అవుతూ పడిలేచే కెరటంలా ఎందరో కవులు-రచయితలకు వేదిక అయింది.

'గోడలు లేనివాడు
గోచీలు లేనివాడు
ఎల్లలుంటాయన్న వూసే లేనివాడు
అడవులు ఎవడి ఆస్తి
నదులు ఎవరి స్వంతం
సమస్త ప్రకృతి సమస్త జనులదై వున్ననాడు
ఎవడు రాజు ఎవడు ప్రజ
ఎవడు పాలకుడు ఎవడు పాలితుడు" అంటూ ప్రశ్నల తూటాలతో యన్.కె.లాంటి యువకవి "లాల్‌బనో గులామీ ఛోడో బోలో వందేమాతరం" అదే దీర్ఘకవితను రాసి 1985లో ప్రచురించాడు. వరవరరావు "భవిష్యత్తు చిత్రపటాన్ని" తన కలం కలల కుంచెతో గీసింది ఇక్కడే. న్యాయం కథను రాయడమే కాకుండా, ఎమర్జన్సీ పైశాచికత్వం మనుషుల్ని ఎంత భయపెట్టిందో తెలియచేసే నవీన్ చీకటి రోజులు నవలకు స్ఫూర్తి. ఉపాధేయం అయిన మెట్టు తిరుపతయ్య; జనార్థన్, వడ్డెబోయిన శ్రీనివాస్, బాసిత్, తంగెళ్ల సుదర్శన్, కౌముది, యాదగిరి లాంటి ఎందరో జ్ఞాత-అజ్ఞాత కవులు కథ, నవల, కవిత్వం వంటి వివిధ ప్రక్రియల్లో రచనలు చేసి తెలుగు సాహిత్య చరిత్ర స్థితిని గతిని మార్చివేశారు. 1970 నుండి 1990 దాక సాగిన విప్లవ సాహిత్య ఉద్యమాన్ని లోతుగా పరిశీలించి అజ్ఞాతకవులను-రచయితలను, వారి రచనలను వెలికితీసి సమగ్రంగా సాహిత్య చరిత్రను రాసుకోవలసి ఉంది.

**6. అభ్యుదయ సాహిత్యం :** భారత దేశంలో వామపక్ష రాజకీయాలు విస్తరించేకొద్ది అభ్యుదయ సాహిత్యం కూడా విస్తరిస్తూ పోయింది. మార్క్సిస్టు తాత్విక దృక్పథం ఈ సాహిత్యానికి పునాది. తెలుగునాట 1943, ఫిబ్రవరి13, 14 తేదీల్లో అరసం తెనాలిలో ప్రథమ మహాసభలు జరుపుకున్న నాటి నుండి 2014 సెప్టెంబర్27, 28 తేదీల్లో వరంగల్లులో జరిగిన అరసం 17వ రాష్ట్ర మహాసభల వరకు అరసం తెలుగునాట తనదైన కర్తవ్యాన్ని సమాజం-సాహిత్యం పట్ల నిర్వర్తించింది. మధ్యమధ్య నిర్వహణలో స్థబ్దత ఏర్పడిన మాట వాస్తవం.

అయితే ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. గురజాడ శ్రీశ్రీ రచనలు వామపక్ష భావజాలంగల అరసంకు ఒక తాత్త్విక భూమికను అందించాయి. సీమాంధ్ర ప్రాంతంలో 'అరసం' విశేషమైన కృషి చేసింది. సామాజిక ప్రగతికి దోహదం చేసింది. కానీ నైజాం రాష్ట్రంలో అరసం ప్రభావం చాలా తక్కువ మందికి మాత్రమే పరిమితమైంది. వరంగల్లులో మరీ తక్కువ. ఇది విచిత్రం. ఎందుకంటే తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటాన్ని నడిపి ప్రపంచ ఉద్యమాలకు స్ఫూర్తినిచ్చిన తెలంగాణలో 'అరసం' విస్తృతంగా పని చేయలేకపోవడానికి సంబంధించిన కారణాలను తెలుసుకోవలసిఉంది. అయితే సీమాంధ్రలో అరసం చేసిన సాహిత్య సేవకన్నా ఇక్కడ నిర్బంధాలను ఎదుర్కొంటూ ఆంధ్రమహాసభచేసింది. ఆనాటి ఫ్యూడల్ సమాజంలో రాజులు, వారి అధికారులు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకున్నారే తప్ప సామాన్య ప్రజలకు వాటి ఫలాలను దక్కనివ్వలేదు. కాబట్టి ఇక్కడ సీమాంధ్రలో లాగా భావజాల వ్యాప్తికి దోహదంచేసే ప్రచురణ-ప్రసార మాధ్యమాలు విస్తరించలేదు. అక్కడ ఆంగ్ల విద్య మూలంగా ఏర్పడిన మధ్య తరగతి మేథవివర్గం బడిని పెట్టారు. పత్రికను పెట్టారు. ఫలితంగా చదువుకున్నవాళ్ళ సంఖ్య పెరిగింది. ఇక్కడ ఆ అవకాశం లేదు. అందువల్ల భూమికోసం, భుక్తికోసం, విముక్తికోసం పోరాటం చేయవలసి వచ్చింది. ఆంగ్లవిద్యను చదువుకో-ఉద్యోగంలో చేరిపో అన్నది అక్కడినినాదం. ఫలితంగా కిరస్తానీ చదువంటూ ఆంగ్ల విద్యను ఎద్దేవచేసిన వైదిక బ్రాహ్మణులు సహితం ఈ విద్య వెంట పడిన తీరు గురజాడ కన్యాశుల్కంలో కనిపిస్తుంది. అగ్నిహోత్రావధానులు, వెంకాయమ్మ వంటి పాత్రలు అందుకు నిదర్శనం.

ఇలా అనేక కారణాలవల్ల సీమాంధ్రలోని, నవ్య, భావ, అభ్యుదయ వంటి సాహిత్య ఉద్యమాలు ఇక్కడ కనిపించవు. ఈ ఉద్యమాలకు జీవం-జవం ఇచ్చింది అక్కడి చదువుకున్న మధ్యతరగతి మేధావి వర్గమే అన్న చారిత్రక సత్యాన్ని మనం గమనించాలి. ఇక్కడ వున్నది అక్షర జ్ఞానం లేని పౌరులు. పోరు-బతుకు ఈ రెండే ఇక్కడి వాళ్ళకు తెలుసు. ఈ రెండింటి సంఘర్షణ మూలంగా ఇక్కడ సాహిత్యం పుట్టింది. అదే బతుకు సాహిత్యం. బతుకమ్మ సాహిత్యం. కాబట్టి ఈ ప్రాంతంలోని సాహిత్యాన్ని సీమాంధ్ర ప్రాంతంలోని సాహిత్య ఉద్యమాల పేర్లతో సరిపోల్చడం సరికాదు. పాల్కురికి సోమనాథుని నుండి కాళోజీదాక ఈ ప్రాంతంలో వున్నది ధిక్కార సాహిత్యమే. అధి భక్తిసాహిత్యమైనా బతుకు సాహిత్యమైనా ఈ లక్షణమే కనిపిస్తుంది. తెలంగాణ ప్రాంతానికి గుండెకాయ అయిన వరంగల్లులో కూడా ఇదే కనిపిస్తుంది.

అయితే అభ్యుదయ సాహిత్యం అనే శీర్షికను ఎందుకు పెట్టినట్టు అనే సందేహం మీకు కలుగుతుంది. నిజమే! ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. ప్రపంచాన్ని ఆకర్షించి ఆలోచింపచేసిన తెలంగాణ విమోచనోద్యమం ఆత్మగౌరవంతో ప్రారంభమై. భూమికోసం, భుక్తికోసం, ఉద్యమమై, విముక్తికోసం సాయుధమైంది. అదే తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంగా చరిత్రకెక్కింది. "నిజాంగోరికడతాం" అంటూ ప్రతిజ్ఞ చేసి నాలుగు వేలకుపైగా పోరాట యోధులతో రక్తతర్పణం చేసింది. సీమాంధ్ర కవులను ఆకర్షించి "ఒక వీరుడు మరణిస్తే

వేలకొలది వీరులు పుడతారన్న" ఆవంత్స సోమసుందర్ కలం చెక్కిన వజ్రాయుధమైంది. సుంకర వాసిరెడ్డిల 'మాభూమి" నాటకమైంది. ఆరుద్ర 'త్వమేవాహం' కావ్యమైంది. ఇది తెలంగాణ కాదు హెలంగాణ అన్న కుందుర్తి చేతిలో తెలంగాణ వచన కావ్యమైంది. బొల్లిముంత శివరామకృష్ణ మృత్యుంజయులు నవల అయింది. ఇలా ఎందరో సీమాంధ్ర ప్రాంత అభ్యుదయ రచయితలకు ఈనేల వస్తువు–భావం అయిందే తప్ప శిల్పంకాలేకపోయింది. కాళన్న నాగొడవ కవిత్వంలోనూ, వట్టికోట ప్రజల మనిషి, దాశరథిరంగాచార్య చిల్లర దేవుళ్ల వంటి నవలల్లోనూ, యశోదారెడ్డి కథల్లోనూ వస్తు–భావ శిల్పాదులతో ఈనేల ప్రతిఫలించింది. ఇప్పుడు కె.సి.ఆర్. ప్రసంగాల్లో తొంగి చూస్తుంది.

తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమకాలంలో కె.సి.ఆర్. ప్రసంగాల్లోని ప్రతిమాటకు విపరీతార్థాలు తీసి నాలుక తెగ్గోస్తమన్నవారు ఇవ్వాల తెలంగాణ రాష్ట్రంలో నాలుక కరచుకుంటున్నారు. ఇది విషయం. అంటే ఈనేల గురించి అక్కడివారు రాసినా, ఇక్కడివారు రాసినా, పేర్లు ఏవైనాకావచ్చు. ఈ నేలను స్పృసిస్తూ రాసే సాహిత్యంలో మార్క్సిస్టు తాత్వికత పునాదిగా ఉంది అన్నది చారిత్రకవాస్తవం. కాళోజీ నా గొడవ గేయాలు, దాశరథికావ్యాలు, వానమామలై జగన్నాదాచార్యుల "అభ్యుదయ గీతాలు" గేయ కావ్యం. పల్లా దుర్గయ్య పాలవెల్లి మొదలైన రచనల్లో అభ్యుదయ దృక్పథం పుష్కలంగా కనిపిస్తుంది. కాళోజీ 'నా గొడవ' లోని ఈ గేయం చూడండి.

నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాది తుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్ప కయ్యాలు కవిరాజు కావ్యాలు
కర్షకా, నీ కళ్లు కదలినన్నాళ్లే ...

అలాగే వ్యత్యాసాలు కవిత, "ఆ చల్లని సముద్ర గర్భందాచిన బడబానల మెంతో" అనే దాశరథి గేయాన్ని మించిన అభ్యుదయ కవిత్వం తెలుగు సాహిత్యంలో ఉందా! పాములపర్తి సదాశివరావు లాంటి మార్క్సిస్టు తాత్విక రచయిత ఈ ప్రాంతంవాడే. అంపశయ్య నవీన్ 'కాలరేఖలు' రక్తకాసారం వంటి నవలలు తిరుపతయ్య న్యాయం (కథల సంపుటి) బతుకు, జీవనసమరం, యాదగిరి శేషు, నల్లమల వంటి నవలలు డా॥ వి.వీరాచారి రాసిన వర్ణమాల నాటికలు, వ్యాసాలు, అనిశెట్టి రజిత, అన్వర్ రచనలు - ఇలా ఎన్నో రచనలు అభ్యుదయ దృక్పథంతో వచ్చిన రచనలే.

ఈ దృష్టికోణంలో పరిశీలించినప్పుడు ఇక్కడ సీమాంధ్ర ప్రాంతంలోలాగా ప్రత్యేకంగా అభ్యుదయ సంఘం అంటూ ఒక గొడుగు కింద ఇక్కడి కవులురచనలు చేయకపోయినా వారు రాసిందంతా అయితే అభ్యుదయకవిత్వం. కాకపోతే విప్లవ కవిత్వం. ఈ విషయాన్ని ఇంకాలోతుగా పరిశీలించి నిర్ధారణచేయవలసి ఉంది.

ఇకపోతే ఇక్కడ అరసం ఆవిర్భావానికి సంబంధించిన రెండు మాటలు. కారణాలు ఏవైనా కావచ్చు కాని వరంగల్లు జిల్లాలో నివురుగప్పిన నిప్పులా వున్న అరసం నిర్మాణ భావన 2012లో కార్యరూపం దాల్చింది. ఇవ్వాల వరంగల్లు సాహిత్య చరిత్ర ప్రవాహానికి విరసం అరసం రెండు దరులు. తెలంగాణ రైతాంగ సాయుధపోరాటం నుండే ఈ ప్రవాహం ప్రారంభమైంది. ఇది చారిత్రక సత్యం.

**7. నవ్య సంప్రదాయ సాహిత్యం :** "నవ్య సంప్రదాయం" అనే భావన కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలోనే పుట్టింది. ఈ విషయాన్ని "నవ్య సంప్రదాయ భావన" అనే వ్యాసంలో ఆచార్య కేతవరపు రామకోటి శాస్త్రిగారు మాత్రం తెలుగులో కాల్పనిక వాదంపై తిరుగుబాటుగానే నవ్యసంప్రదాయం వచ్చిందని అభిప్రాయపడినారు.

"రొమాంటి సిజానికీ, అభ్యుదయానికీ వ్యతిరేకంగానూ, క్లాసిజానికి పునరుద్ధరణగానూ రూపొందిన సంప్రదాయ భావజాలాభివ్యక్తితో కూడిన కావ్యాలను నవ్య సంప్రదాయ కావ్యాలంటున్నాం. పద్యరచనా రూపమైన భావాభి వ్యక్తిరీతి సాంప్రదాయికమైనదే అయినా సంప్రదాయ భావజాలాన్ని వ్యతిరేకించేదాన్ని నవ్య సంప్రదాయమని అనం. అందువల్లనే త్రిపురనేని రామస్వామి చౌదరిగారిని నవ్య సంప్రదాయకవుల్లో చేర్చం. విశ్వనాథ సత్యనారాయణను చేరుస్తాం. చేరుస్తాంకాదు. ఆయన వల్లనే అంటే ఆయన సాహిత్యం వల్లనే ఆ మాటను మనం అర్థవంతం చేస్తున్నాం... నియోక్లాసిజాన్ని నవ్యసంప్రదాయమని వ్యవహరించటానికి ఎవరు నాందీ పలికిందీ చెప్పటం కష్టంగానీ 1970-75 సంవత్సరాల మధ్య ఆలోచనలు చేసి చేసి, చివరకు మా కాకతీయ యూనివర్సిటీ తెలుగు విభాగమే ఆ వ్యవహారాన్ని తన అధ్యయనం అధ్యాపనాల్లో నడిపించటం మొదలు పెట్టింది. ఆవిధంగా ఆధునిక కావ్య సాహిత్యంలో భాగంగా నవ్యసంప్రదాయకావ్యాలుగా రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం, సౌందరనందం, ఆంధ్రపురాణం, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, పోతన చరిత్ర మొదలయిన ఆధునిక మహాకావ్యాలను అధ్యయనానికి పెట్టడం జరిగింది" అని నవ్య సంప్రదాయక కవిత్వ ఉద్యమ స్వరూప స్వభావాన్ని ఆచార్య కేతవరపు రామకోటి శాస్త్రిగారు నిర్వచించారు.

ఈ దృష్టితో ఆలోచించినపుడు వరంగల్లు నుండి వెలువడిన కావ్యాల్లో వానమామలై వరదా చార్యుల పోతన చరిత్ర, జగన్నాథాచార్యుల రైతురామాయణం. పల్ల దుర్గయ్య గంగిరెద్దు, అనుముల కృష్ణమూర్తి సరస్వతీ సాక్షాత్కారం, సుప్రసన్న శతాంకుర, సంపత్కుమార, అనుమాండ్ల భూమయ్య, బండారుసదాశివరావు మొదలైన కవుల గ్రంథాలు నవ్యసంప్రదాయా సాహిత్య కోవలోనికి వస్తాయి.

మనకు బ్రాణము కార్మికుడతనియా మాత్రంపు తోడె లభిం
చనిచో నెక్కడి దక్కడే నిలిచి స్తంబించునేనాడొయీ
పనివారల్ పని చేయు నంతవరకే పైమేడ లెన్నైన్ పునా
దిని నాధారముచేసి కొన్నవె శ్రీమాధీనమ్ములీ లోకమ్ముల్

అంటూ రైతు వ్యక్తిత్వాన్ని వానమామలై జగన్నాథాచార్యులు రైతు రామాయణం కావ్యంలో చిత్రించారు. "నైజాం పరిపాలనలో తెలంగాణా రైతుల దీనస్థితి, ప్రభుత్వ నిరాదరణ, ఆర్థిక దుస్థితి, కుటుంబ బాధలు వంటి అన్ని విషయాల్ని చాల విస్తారంగా వాస్తవికంగా కావ్యంలో కవి వర్ణించారు. వీటికి తోడుగా తెలంగాణ విముక్తి ఉద్యమం, రైతాంగ పోరాటంలోని మంచి ఆశయాలు కూడా కావ్యంలో చోటుచేసుకున్నాయి. రాక్షస కిరాతక చర్యలకు నిలయమైన జమీందారీ, ఫ్యూడల్ వ్యవస్థకు ప్రతినిధియైన పాపారావు పై శాంతి విప్లవ వీరుడు, కథానాయకుడు అయిన రైతురాముడు విజయం సాధించడం రైతురామాయణంలోని ప్రధాన సారాంశ," అని మడికొండ సాహితీమూర్తులు గ్రంథంలోని రైతువాల్మీకి వానమామలై జగన్నాథాచార్యులు వ్యాసంలో డా॥యల్లంభట్ల నాగయ్య గారు అన్నారు.

నిజమే "దుష్ట శిక్షణ శిష్టరక్షణ" అనే రామాయణ కథలోని భావాన్ని కేంద్రంగా చేసుకొని రైతురామాయణంలోని రైతురామున్ని పురుషోత్తముడైన రామునిగానూ, పాపారావును రావణాసురుని గానూ, రైతురాముని భార్యను సీతగాను - ఇలా రామాయణ కావ్యంలోని పాత్రలకు ప్రతిరూపాలుగా తీర్చిదిద్ది తెలంగాణ బడుగు రైతు బాధలను కవి సహజంగా చిత్రించారు. పండరినాథరామాయణం రాసిన మోత్కూరి పండరినాథుడు, రంగరాజకేశవరావు, బద్దిరాజు సోదరులు మొదలైన వారు ఇక్కడ నవ్య సంప్రదాయ కవిత్వానికి జీవంపోశారు.

ఈతరంలో కూడా రూపపరంగా సంప్రదాయ పద్యాన్ని స్వీకరించి ఆధునిక సంప్రదాయ భావాలను సమ్మేలితం చేస్తూ కథారాహిత కావ్యాలను రచిస్తున్నారు.

**8. దళితవాద సాహిత్యం :** దళితులపై సీమాంధ్ర ప్రాంతంలోని కారంచేడు, చుండూరు, పదిరికుప్ప, వేంపెంట వంటి గ్రామాల్లో పెట్టుబడిదారి అగ్రకుల దురహంకారులు జరిపినటువంటి హింస, అమానుష చర్యలు తెలంగాణ ప్రాంతంలో జరుగలేదు. ఇక్కడ దొరతనంపై సబ్బండ వర్ణాలవాళ్లు బందూకులు పట్టి పోరాటాలు చేశారు. కాబట్టి సీమాంధ్ర ప్రాంతాల్లో లాగా గ్రామాలకు గ్రామాలనే విధ్వంసం చేసే ఫ్యూడల్, కాపిటలిస్టుల విష సంస్కృతి ఇక్కడ లేదు. ఆ పనిని ఇక్కడ రజాకార్లు చేశారు. కాబట్టి ఇక్కడ 1990 నుండి సీమాంధ్ర ప్రాంతంలో వచ్చినంత విస్తృతంగా ఈ ప్రాంతంలో దళితవాద సాహిత్యం రాలేదు. కానీ పటిష్టమైన దళిత ఉద్యమం ప్రారంభమైంది మాత్రం వరంగల్లు నుండే అన్న విషయాన్ని గమనించాలి. మాదిగ రిజర్వేషన్ పోరాట సమితిని (ఎం.ఆర్.పి.ఎస్) స్థాపించి తెలుగు ప్రాంతమంతా కాలికి బలపం కట్టుకొని తిరిగి దళితుల ఆత్మగౌరవం కోసం పోరాటం చేసింది, చేస్తున్నది మందకృష్ణ మాదిగ అన్నది జగమెరిగిన సత్యం. పూర్వాశ్రమంలో అజ్ఞాతవాస జీవితం గడిపిన విప్లవవాది ఆయన.

అలాగే బి.యస్.రాములు, మాస్టర్‌జీ వంటి వాళ్లు వరంగల్లులోని మొగులయ్య హాల్లో పెద్ద సభ జరిపి బహుజన ఉద్యమానికి శంఖం పూరించిన విషయం మనందరికి తెలుసు. ఈ చారిత్రక నేపథ్యంలో వరంగల్లు నుండి దళిత వాద కవిత్వం పురుడు పోసుకున్నది. బొమ్మ కట్టయ్య లాంటివారు అంబేద్కరిజంతోపాటు బుద్ధిజాన్ని కూడా మేళవించి దళిత ఉద్యమాన్ని ఇక్కడ నడుపుతున్నారు.

ఇక సాహిత్య విషయానికి వస్తే, వరంగల్లులో కవిత్వం కాసే దళితులు చాలామందే ఉన్నారు. కానీ దళితుల జీవితాల మీద కవిత్వం రాసేవాళ్లు మాత్రం వేళ్ళమీద లెక్కపెట్టగల వారు మాత్రమే ఉన్నారు.

"మాయలతో, మంత్రాలతో, కుట్రలతో
కాపట్యంతో శుష్కనీతులతో నిండిన
పుస్తకాలకు
మరణశాసనం ప్రకటిస్తున్న
దళిత వర్ణమాల ఇదిగో ఇదిగో ఇదే.

అంటూ ప్రగాఢ విశ్వాసంతో ఆత్మగౌరవాన్ని ప్రకటిస్తున్న ఈ కవి బన్న అయిలయ్య. రహస్య చిత్రం కవితా సంపుటిని వెలువరించిన చాలా కాలం తరువాత 'నిప్పుకణిక' దీర్ఘకవితను వెలవరించారు. ఈ కవితను గురించి 'నెత్తుటి దీపం' శీర్షికన కవి తన మాటగా ఇలా రాసుకున్నారు. "ఈ దీర్ఘ కవిత ఒక దళితుడి సుదీర్ఘశ్వాస. శ్వాసకోశాల కుంపటిలోంచి వర్తమాన చరిత్రలోకి ఎగిరొచ్చిపడిన ఓ 'నిప్పుకణిక'. ఆధిపత్య వర్గాల సమస్త సాహిత్య పుటల్ని అనేకానేక తాళపత్ర ప్రతుల్ని కాల్చి బూడిద చేయడానికి దళిత పీడిత బహుజన ప్రజానీకం ఊదిన అనుభవ శ్వాస ఇది. పెను బాధకి నిట్టూర్పుగా అనంత వేదన ఒక తక్షణ విరామంగా వేల పేజీలుగా విస్తరించాల్సిన జీవన ఆక్రందనల్లో ఇది ఒక తొలి అవతారికే. అని ప్రకటించిన డా॥ బన్న అయ్యిలయ్య "ఎవడి హక్కుల పక్కరా ఈనేల, ఎవడి కాపలా కుక్కరా ఈ చరిత" అంటూ పెనుకేక వేస్తున్నారు. 'నిప్పుకణిక'ను రగిలిస్తున్నారు.

ఈ దీర్ఘకవితను "ఫైర్-స్పార్క్" గా కె.దామోదరరావు ఆంగ్ల భాషలోనికి అనువాదం చేశారు. తెలుగు మూలం, ఆంగ్లానువాదం కలిపి బై-లింగ్వలాంగ్ పోయమ్‌గా రావటం ఈ పుస్తకం ప్రత్యేకత.

జూపాక సుభద్రగారు దళితవాద సాహిత్యానికి తనకలం-గళం బలంతో వెన్నుదన్నుగా నిలిచారు. వరంగల్లు జిల్లా దామరంచె పల్లె గ్రామంలో పుట్టిన సుభద్ర ఆదిలాబాద్ జిల్లా బెల్లంపల్లిలో పెరిగింది. స్నాతకోత్తర విద్యను మాత్రం కాకతీయ విశ్వవిద్యాలయంలో పూర్తి చేసి, తెలంగాణ రాష్ట్ర సచివాలయంలో ఉద్యోగం చేస్తున్నారు. ఒకవైపు తాను పుట్టిన మాదిగ కుల అణగారిన జీవితాలను తన సాహిత్యం ద్వారా చిత్రిస్తూనే మరో వైపు 'మట్టిపూలు' అనే సాహితీ సంస్థను స్థాపించి దళితవాద సాహిత్యవికాసానికి, తెలంగాణ భాషాభి వృద్ధికి ఎనలేని కృషిచేస్తున్నారు. మాపల్లె కవితలో అయ్యయ్యో దమ్మక్కా కవితా సంపుటి దళితుల జీవితాలను ఇలా చిత్రించారు.

"కులాలు వూరు నుంచి వాడదాక
విచ్చుకొని రొచ్చువాసనొస్తయి, కులాన్ని బట్టే కూడు, గూడు, నీడ
కారంచేడు కడగండ్లు, చుండూరు గండాలు, వేంపెంట మంటలు
పల్లెయాదొస్తే... పగిలిపోయిన దొంతి పెంకల్ల

ఆకలేసిసావుల మొలకలు కుతికెబడ్డా జారని కులం వెక్కిల్లు
వృత్తులన్నీ వత్తిలేని దీపాలైనయి"

అంటూ ఆవేదనచెందే జూపాక సుభద్ర కవితలు "అట్టడుగు సమాజంలోని మహిళల వ్యథలన్నీ గుంపు యాతనయి గుండెల్లి పిండుతాయి. కులరాజకీయ సాహిత్య దొరతనాల సెరల్లో జిక్కిన తెలంగాణ మట్టి మనుషుల జీవభాష, సంస్కృతులను బయటకు తీస్తున్న కొద్ది మంది రచయిత్రుల్లో సుభద్రముందున్నారు. తెలంగాణ నుడి, వడి, పలుకుబడి, పద సంపద, జాతీయాలు సుభద్ర కయితల నుండి వాన తాకిన దువ్వ వాసనై మనసుకు తాకుతాయి". అయ్యయ్యోదమ్మక్కా కవితా సంపుటిలో కవయిత్రి జూపాక సుభద్రను పరిచయం చేస్తూ దండోర కన్వీనర్ అన్న మాటలు అక్షర సత్యాలు.

శ్రమశ్రీ కలంపేరుతో కవిత్వం రాస్తున్న శనిగరం మల్లయ్య శ్రమశ్రీ దళిత గీతాలు, సమత శతకం, సంచలనం, బహుజనపాటలు, సాన తపన వంటి గేయ-కవిత సంపుటాలను వెలువరించారు. ఈయన రాసిన ప్రతి సంపుటిలో దళితవాద స్పృహ ఉంది. మచ్చుకు 'సంచలనం' కవితా సంపుటిలోని ఈ కవితాపాదాలు.

దళిత స్త్రీల చెరిచి సంపు వాళ్ళ దొరలు గాస్తుంటే
అంబేద్కరిజం రెచ్చి, పుట్టించును సంచలనం
కారంచేడు హత్యలన్ని కోర్టే కొట్టేసిందని
చుండూరు మొండాలతో గూండాలకు విందులాయె
పదిరి కుప్ప మంటల్ని, నీరుకొండ నిప్పుల్ని
వేంపెంట శవ కుప్పల కన్నార్పక చూస్తుంది
ఖాకీలతో నాయకులకు కబురంపిన చలించని
దళిత వర్ణం మూడో కన్ను తెరిస్తేనే సంచలనమ్
ప్రభుత్వాల ప్రతినిధులను, ప్రతిఘటించె సంచలనం

అంటూ శ్రమశ్రీ పోరాట గొంతుకను వినిపిస్తున్నారు. వరంగల్లు జిల్లాలో దళిత బహుజన ఉద్యమాల్లో పాల్గొంటూ జిల్లా దళిత కళామండలి ప్రధాన కార్యదర్శిగా పనిచేసి, భారతీయ దళిత సాహిత్య అకాడమీని జిల్లాలో నెలకొల్పారు. భారతీయ దళిత సాహిత్య అకాడమీ రాష్ట్ర అధ్యక్షులుగా కూడా పనిచేశారు.

అయితే ఈ ప్రాంతం నుండి కవిత్వం వచ్చినంతగా ఈ వాదంతో ఇతర సాహిత్య ప్రక్రియలు రాలేదు. ఈ కృషి 'నల్లగొండ' జిల్లాలో ఎక్కువగా జరిగింది. బోయ జంగయ్య 'జాతర', వేముల ఎల్లయ్య 'సిద్ధి', భూతం ముత్యం సూర వంటి నవలను, కథలను రాశారు. ఈ ప్రాంతం నుండి ఈ కృషి జరుగలేదు. కానీ, కాకతీయ విశ్వవిద్యాలయం, తెలుగు విభాగం దళిత వాద సాహిత్యం అధ్యయనాంశంగా యం.ఏ.తెలుగు విద్యార్థులు ఒక పేపర్‌ను సిలబసులో పెట్టింది.

దళిత వాద సాహిత్య చరిత్రను నిర్మించుకునే క్రమంలో కొన్ని చారిత్రకాంశాలను కూడా పరిగణలోనికి తీసుకోవాలి. ముఖ్యంగా సీమాంధ్ర ప్రాంతాల్లో ఆంగ్లేయులు దళితులను క్రైస్తవులుగా మార్చితే, తెలంగాణ ప్రాంతంలో 'నిజాం' మహమ్మదీయులుగా మార్చారు. ఈ అంశాలన్నింటిని దృష్టిలో ఉంచుకొని వరంగల్లు దళిత సాహిత్య చరిత్రను రాసుకోవలసి ఉంటుంది. ఇది చిన్న ప్రయత్నం మాత్రమే.

**9) స్త్రీవాద సాహిత్యం :** దళితవాద సాహిత్య రచయితల్లాగే స్త్రీవాద సాహిత్య రచయితలు కూడా వరంగల్లులో కొద్దిమంది మాత్రమే వున్నారు. కానీ ఈ రంగంలో కృషిచేసిన ఆచార్య కాత్యాయనీ విద్మహేగారు "సాహిత్యాకాశంలో సగం" అనే విమర్శన గ్రంథానికి కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు పొందడం గమనించదగిన విషయం. ఈ జిల్లాలో స్త్రీవాద సాహిత్య విమర్శన రంగంలో ఆచార్య కాత్యాయనీ విద్మహే, డా॥ కందాళ శోభారాణి విశేషమైన కృషి చేస్తున్నారు. డా॥ కందాళ శోభారాణి "తెలుగు సాహిత్య విమర్శ – స్త్రీల కృషి" అనే అంశంపై పిహెచ్.డి చేశారు. తెలుగు అకాడమీ ఈ గ్రంథాన్ని ప్రచురించింది. తెలుగు సాహిత్యంలో స్త్రీవాద విమర్శకులు అనే వ్యాస సంపుటిని కూడా వెలువరించారు. కాత్యాయనీ విద్మహేగారు "జండర్ స్పృహ"పై జాతీయ సదస్సును నిర్వహించి పుస్తకాన్ని వెలువరించారు. ఉభయ రాష్ట్రాల్లో స్త్రీవాద సాహిత్యంపై విశేషమైన కృషి చేస్తున్న వారిలో వీరు ప్రముఖులు.

సృజనాత్మక సాహిత్యంలో అనిశెట్టిరజిత, నెల్లుట్లరమాదేవి లాంటి వారు చేస్తున్న కృషి అమూల్యమైంది. డా॥టి.శ్రీరంగస్వామి గారి సంపదకత్వంలో శ్రీలేఖ సాహితీ సంస్థ అరవై మంది కవయిత్రులతో "కాకతీయ భారతి" ప్రత్యేక కవితా సంకలనాన్ని ప్రచురించారు. సొన్నాయిల కృష్ణవేణి లాంటి వారు ఈ మధ్యనే స్త్రీవాద దృక్పధంతో శక్తివంతమైన కవిత్వం రాస్తున్నారు.

ఐక్యరాజ్యసమితి మార్చి 8వ తేదిని అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా ప్రకటించాక ఈ ప్రాంతంలో అనేక సాహిత్య సభలు, సమావేశాలు జరిగాయి. స్థానిక ఎ.ఎస్.ఎం. డిగ్రీ & పి.జి. కళాశాలవారు స్త్రీవాద దృక్పధంతో స్వాతంత్ర్యానంతరం మహిళల సాధికారికతపై జాతీయ సదస్సును నిర్వహించి పుస్తకాన్ని ప్రచురించారు. ఈ విషయంలో ప్రిన్సిపాల్ విద్యారాణి, అధ్యాపకులు, గిరిజారాణి, కొమర్రాజు రామలక్ష్మి, శ్రీదేవి గారలు విశేషమైన కృషి చేశారు.

ఆమె మనిషిగానే పుడుతుంది
కానీ అంచెలంచెలుగా ఆడదానిగా తయారు
చేయబడుతుంది
గొడ్డు చాకిరీకి నడుము వంగేలా
ప్రత్యేక శిక్షణలో తర్ఫీదివ్వబడుతుంది
మూస ఆడతనం అన్నికోణాల నుండి
ఔషదంలా నూరిపోసే బడి ఇల్లవుతుంది
అబలత్వాన్ని నెత్తురుగా నరాల్లోకి ఎక్కించే
హాస్పిటల్ సమాజమవుతుంది

బామ్మా అమ్మలకు ఆమె
కార్బన్ ప్రింట్ వారసురాలవుతుంది.

అంటూ స్త్రీవాద దృక్పథాన్ని శక్తివంతంగా వినిపిస్తున్న అనిశెట్టి రజిత 1984లో వెలువరించిన మొదటి కవితా సంపుటి "గులాబీలు జ్వలిస్తున్నాయి" లోనే ఈ దృక్పథానికి బీజాలు వేసింది 1997లో "నేనొక నల్ల మబ్బునాతా" కవితా సంపుటిని, ఆ తరువాత "చెమట చెట్టు" కవితా సంపుటిని, మట్టి బందాలు కథా సంపుటిని వెలువరించి వరంగల్లు కేంద్రంగా చేసుకొని తెలుగునాట అంతట స్త్రీవాద భావజాల చైతన్యంకోసం నిరంతరం కృషిచేస్తుంది. ఇంతకు ముందే చెప్పినట్లు వరంగల్లులో స్త్రీవాద సాహిత్యాన్ని సృజన చేస్తున్న రచయితలు కొద్దిమందే అయినా వారి రచనలతో జాతీయస్థాయికి ఎదిగి జిల్లా ఉనికిని చాటుతున్నారు.

**10) అస్తిత్వ వాద ఉద్యమ సాహిత్యం :** అస్తిత్వవాద ఉద్యమ సాహిత్య విషయంలో వరంగల్లుకు ఒక ప్రత్యేకత ఉంది. 1969లో వచ్చిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర అస్తిత్వ ఉద్యమంలోనూ, ఆ తరువాత 1996లో ప్రారంభమైన తెలంగాణ మలిదశ ఉద్యమంలోనూ బలమైన స్పందన, కార్యాచరణ ఈ ప్రాంతం సాహిత్య కారుల నుండే వచ్చిందన్నది నిర్వివాదాంశం. కారణం ప్రజాకవి కాళోజీ, తెలంగాణ సిద్ధాంతకర్త ఆచార్య కొత్తపల్లి జయశంకర్ ఈ ప్రాంతం వారు కావడం పార్టీల కతీతంగా ప్రజాభిప్రాయాలకు, ప్రయోజనాలకు మద్దతు పలికే విశిష్టమైన వ్యక్తిత్వం వీరిది.

అంతే కాదు తప్పు అనేది గల్లీలీడర్ నుండి ఢిల్లీ లీడర్ దాక ఎవరు చేసినా ఆ అంశాన్ని కవిత్వీకరించే గుండెబలం - దండి రీతి కలిగిన వ్యక్తిత్వం కాళోజీది. తెలంగాణలో వచ్చిన మూడు అస్తిత్వ ఉద్యమాలతో ఆయనకు ప్రత్యక్ష సంబంధం ఉంది. 1920లో హైదరాబాద్‌లో జరిగిన ఒక సభలో కన్నడ, మరాట సోదరులు మన వక్తను తెలుగులో మాట్లాడనివ్వక పోవడం మూలంగా పుట్టిన ఆత్మగౌరవ ఉద్యమం "ఆంధ్రమహాసభ"గా రూపొందింది. నాటి నుండి కాళోజీకి తెలంగాణ విమోచనోద్యమంతో ప్రత్యక్ష సంబంధం ఉంది. నిజాం ప్రభుత్వాన్ని, అది బలపరుస్తున్న రజాకారుల అకృత్యాలను తనకవితల ద్వారా నిలదీసి, భావజాల వ్యాప్తికి కృషిచేసిన వాడు ప్రజాకవి కాళోజీ. ఫలితంగా జైలు జీవితం అనుభవించాడు.

అదే విధంగా 1969లో వచ్చిన తొలిదశ తెలంగాణా ఉద్యమంలో కూడా ఆయన చురుకైన పాత్రను పోషించారు. ఈ ఉద్యమకాలంలో వివిధ అంశాలపైన ఆయన ముప్పది కవితలురాశారు. "నిర్వాకం" శీర్షికన రాసిన కవితలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణ ప్రజల్ని సీమాంధ్రులు చేసిన దగాను గురించి ఇలా రాశారు.

నమ్ముకొని పెత్తనము ఇస్తే
నమ్మకము పోగొట్టుకొంటివి
కుప్పకావలి ఉండి కట్టలు
తప్పదీస్తివి ముద్దెరేస్తివి

సాటివాడు చేరదీస్తే
నోటినిండా మన్నుకొట్టివి"

ఆనాటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి తెలంగాణ ఉద్యమాన్ని అణచడానికి కుట్రలు చేస్తూ రాజ్యహింసకు పాలుపడుతున్న సందర్భాన్ని నిరశిస్తూ "అయ్యాయ్యో ఆంధ్రావని" కవితలో ఇలా అంటారు.

ఆంధ్రప్రదేశ్‌ము కాదిది
బ్రహ్మానంద విచిత్రపురి
ఆనందనిలయము "దాదా
అదుపులోన ఆంధ్రావని" అంటూ అప్పటి పరిస్థితులను మన కళ్ళముందుంచారు.

మలిదశ ఉద్యమం వచ్చేనాటికి వరంగల్లులో వున్న ప్రతికవి ప్రజాకవి కాళోజీ అయి ఉద్యమగొంతుకలను వినిపించారు. కవితా సంపుటాలను, కథాసంపుటాలను, సంకలనాలను వెలువరించారు. 1996 నుండి 2002 మధ్య కాలంలో అరకొరగా ఈ ప్రయత్నాలు జరిగితే 2009 నుండి 2014 మధ్య కాలంలో తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో నలభైదాక కవితా సంపుటాలు, సంకలనాలు వచ్చినాయి. దాదాపు అరవై మంది కవులు కళాకారులు ఈ ఉద్యమ నేపథ్యంలో పుట్టుకొచ్చారు. ప్రతికవి కవితా సంపుటాన్ని లేదా సంకలనాన్ని వెలువరించారు. కొందరు వ్యాస సంపుటాలను సంకలనాలు వెలువరించారు. మరికొందరు కథా సంకనాలు, నాటక సంపుటాలు వెలువరించారు. కవితా సంపుటాలు - సంకలనాల్లో కూడా రూపపరంగా పద్య గేయ-వచన కవితలు చోటు చేసుకున్నాయి. వెలపాటి రామారెడ్డి లాంటి సీనియర్ సిటిజన్ తెలంగాణ చరిత్ర సంస్కృతిని ప్రతిఫలింపచేసే మూడు పద్యకావ్యాలు తెలంగాణ, కోటి గాయాల మౌనం 'తెలంగానం', తెలంగాణ పజ్యమంజరి వెలువరించారు. నల్లా ఉపేందర్ తెలంగాణ శతకాన్ని రెండు భాగాలుగా వెలువరించారు. జంగిడి రాజేందర్ లాంటి యువకవి తెలంగాణ దేవుళ్లు పేరిట పద్య కావ్యాన్ని ప్రచురించారు.

ఇక పాటల విషయానికి వస్తే నల్లెల్ల రాజయ్య తెలంగాణ మట్టిపాటలు, తెలంగాణ జంగ్ 2009 మరియు 2010 అనుగ్రలు వంటి పుస్తకాలను తన సంపాదకత్వంలో వరసం తరపున ప్రచురించారు. కరాదుల అరుణ్‌కీర్తి పతాక, తెలంగాణ ఉద్యమ భావగీతాలు, డా॥తక్కెళ్ళ బాలరాజు తెలంగాణ గానామృతం, వల్లంపట్ల నాగేశ్వర్‌రావు జై తెలంగాణ గానాబజానా, "కృష్ణశ్రీ" బైరి బాలయ్య, తెలంగాణ పాటలు, ఇలా ఎన్నో పాటల సంపుటాలు సంకలనాలు వచ్చాయి.

వచనకవితా విషయానికి వస్తే మూడు భాగాలుగా విశ్లేషించవచ్చు. వచన కవితా సంపుటాలు సంకలనాలు, దీర్ఘ కవితలు, మినీ కవితలు. వచన కవితా సంపుటాల్లో పొట్లపల్లి శ్రీనివాసరావు నాగిళ్ళ రామశాస్త్రి సంపాదకత్వంలో వచ్చిన చుక్క పొడుపు, బందగి ప్రచురణలుగా గోదావరి సాహితీ మిత్రులు వెలువరించిన మామట్టికోసం మా హైద్రాబాద్ కోసం, హస్తైదూల, సూర్యుడు ఉదయిస్తాడు, పొట్లపల్లి శ్రీనివాసరావు దెబ్బదిన్న బెబ్బులి వరంగల్లు జిల్లా రచయితల

ఐక్య వేదిక కన్వీనర్ డా॥ వి.వీరాచారి తన సంపాదకత్వంలో తెలంగాణ ఉరుములు-మెరుపులు, అనిశెట్టి రజిత పొట్లపల్లి సంపాదకత్వంలో ఊపిరి, మెట్టు రవీందర్ సంపాదకత్వంలో దోకాంధ్రప్రదేశ్ వంటి సంకలనాలను ప్రచురించారు. వడ్డెబోయిన శ్రీనివాస్, సమైక్య శాపం దీర్ఘకవితను కూడా ఐక్యవేదిక ప్రచురించింది. గొడిశాల సదానందం చిలకలగుట్ట, పసునూరి రవీందర్ లడాయి, యం.డి.నసిరుద్దీన్, సకల జనుల సమరం, డా॥దోమల భిక్షపతి ఎర్రెర్రని తెలంగాణ, నిధి (బ్రహ్మచారి) హైద్రాబాద్ సిర్ఫ్ హమారా వంటి దీర్ఘకవితలను ప్రచురించారు. మెట్టు మురళీధర్ నిగ్రాని పేరుతో మినీకవితల సంపుటి ప్రచురించారు. అన్వర్ 1969 వరంగల్లు జిల్లా తెలంగాణ అమరవీరులు, సవాల్, అత్మబలిదానాలు. బిల్లా మహేందర్ పోరుగానం, పిడికిలి, షేక్ హాజీ నూరాని సైరన్, చింతంప్రవీణ్ నెగడు, నాగబెల్లి జితేందర్ పోరుగింజలు, లోచన్ ఆదాబ్ హైదరాబాద్ మోటపలుకుల రమేశ్ బతుకు పాట పుస్తకాలను ప్రచురించారు. రుద్రమ ప్రచురణలు ద్వారా అనిశెట్టి రజిత 'జిగర్' కవితా సంకలనాన్ని తెలంగాణ చరిత్ర సంస్కృతిని దృష్టిలో పెట్టుకొని ప్రత్యేకంగా తన సంపాదకత్వంలో వెలువరించారు.

ఇలా తెలంగాణ మలిదశ అస్తిత్వ ఉద్యమం ఫలితంగా వరంగల్లు జిల్లా కవులు, పద్యం, పాట, వచన కవితా రూపాల్లో కవితా విశ్వరూపాన్ని ప్రదర్శిని తెలంగాణ మట్టి ఘన చరిత్రను వ్యక్తం చేశారు.

వచన సాహిత్య విషయానికి వస్తే ఒక 'నవల' తప్ప తెలంగాణా ఉద్యమ నేపథ్యంలో కథ, నాటకం, వ్యాసం వంటి ప్రక్రియల్లో ఎన్నో గ్రంథాలు వెలువడ్డాయి. డా॥వి.వీరాచారి వర్ణమాల నాటికల సంపుటి, నల్లెల రాజయ్య చావో-రేవో నాటికలు వచ్చాయి. అరసం ద్వారా డా॥వి.వీరాచారి సంకలన కర్తగా ఓరుగల్లు కథలు, సాహితీ సమితిద్వారా నమిలికొండ బాలకిషన్ రావు సంకలన కర్తగా సాహితీ తరంగ (ఈ రెండు కథా సంకలనాల్లోని కథలు ఆకాశవాణి వరంగల్ కేంద్రంద్వారా ప్రసారమైనవి) వంటి కథాసంకలనాలు, 1969 తెలంగాణ ఉద్యమ కవిత్వ, - కాళోజి నా గొడపై ఆచార్య బన్న అయిలయ్య, విమర్శన గ్రంథం, డా॥పంతంగి వెంకటేశ్వర్లు అర్ట్స్ కళాశాలలో నిర్వహించిన జాతీయ సదస్సు పత్రాల గ్రంథాలు తెలంగాణ తెలుగు నవల, తెలంగాణ తెలుగు కథ, డా॥వేలూరి శ్రీదేవి కాకతీయ విశ్వవిద్యాలయం మహిళా పి.జి. కళాశాలలో నిర్వహించిన తెలంగాణ వైతాళికుడు కాళోజీ, డా॥వి.వీరాచారి సి.కె.యం. అర్ట్స్&సైన్స్ డిగ్రీ, పి.జి. కళాశాలలో నిర్వహించిన "డా॥అపశయ్య నవీన్ జీవితం-సాహిత్యం" ప్రాంతీయ సదస్సులోని పత్రాల పుస్తకం ఇలా సాహిత్య విమర్శ పరిశోధనలకు సంబంధించిన గ్రంథాలు వచ్చాయి. తెలంగాణ సాహిత్యంపై కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం నిర్వహించిన సెమినార్లు, సి.కె.యం. కళాశాల ప్రత్యేకంగా తెలంగాణ విశ్వవిద్యాలయాల్లో యం.ఏ. తెలుగు చదువుతున్న విద్యార్థుల కోసం వట్టికోట, కాళోజీ జీవితం-సాహిత్యంపై నిర్వహించిన సదస్సులు వరంగల్లు జిల్లా అరసం "కాళోజీ-జీవితం సాహిత్యం"పై మహబూబాబాద్‌లో నిర్వహించిన సదస్సులకు సంబంధించిన పత్రాల గ్రంథాలు వెలుగు చూడవలసి ఉంది.

యస్.వి.ఎస్. కళాశాల తెలుగు విభాగం డా॥యల్లంబొట్ల నాగయ్య నేతృత్వంలో నిర్వహించిన దాదాపు పది రాష్ట్రస్థాయి సంగోష్ఠుల్లో తెలంగాణా సంస్కృతాంధ్ర కవులు-రచయితలు, రయ్యాలలక్ష్మీ నరసింహాచార్యులుగారి సాహిత్య సమాలోచన, శ్రీసీతారామాంజనేయ సంవాదము-విమర్శనము, తెలంగాణ ప్రాచీన సాహిత్యం, తెలంగాణ ఆధునిక సాహిత్యం వంటివి కేవలం తెలంగాణ సాహిత్యాన్ని వెలికి తీసేవే. ఇవన్నీ పుస్తకాల రూపంలో వచ్చాయి. పరస్పర సహకార పద్ధతిలో శతాధిక గ్రంథాలను ప్రచురించిన శ్రీలేఖ సాహితీ సంస్థ డా॥టి.శ్రీరంగస్వామి గారి సంపాదకత్వంలో "తెలంగాణ సాహిత్యంపై సదస్సులు నిర్వహించి పుస్తకాలను వెలువరించింది. భాగవత దర్శనం, ఏకశిల వైతాళికులు, వరంగల్లు సాహితీ మూర్తులు వంటి పుస్తకాలు ఆ కోవకు చెందినవి. ప్రజాహిత ప్రచురణలు పేరిట తెలంగాణ సాహిత్య స్వరూపాలు, డా॥టి.శ్రీరంగస్వామిగారు సంపాదకత్వంలోనూ, స్వయంగా వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక - ఇత్యాది గ్రంథాలు వెలువడినాయి. వీటిలో కొన్ని తొలిదశ తెలంగాణ ఉద్యమం తరువాత, మరికొన్ని మలిదశ ఉద్యమ సమయంలో వెలుగుచూశాయి. అలాగే కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలో జరుగుతున్న పరిశోధనలు, వెలువరించిన విమర్శ పత్రిక ప్రాంతీయ అధ్యయనం. తెలంగాణ తెలుగు సాహిత్యం యు.జి.సి., సాప్, డి.ఆర్.ఎస్. చేస్తున్న కృషి తెలంగాణ సాహిత్య చరిత్ర నిర్మాణంకోసం జరుగుతున్నవే- ఇలా చెప్పుకుంటూ పోతే వరంగల్లు జిల్లాలో తెలంగాణ అస్తిత్వ మలిదశ ఉద్యమానికి సంబంధించి వెలువడిన సాహిత్య విశ్లేషణ ఒక పరిశోధన గ్రంథమే అవుతుంది.

**11. జానపద సాహిత్యం :** అనాదృత సాహిత్యంగా పిలువబడుతూ నిరాదరణకు గురియైన జానపద సాహిత్యానికి విశ్వవిద్యాలయ స్థాయి గౌరవాన్ని తెచ్చిపెట్టిన ఆచార్య బిరుదురాజు రామరాజు గారు వరంగల్లు వాడే నన్న విషయాన్ని ఈ సందర్భంగా మనం గుర్తుంచుకోవాలి. పాల్కురికి సోమనాధుడు సృజనాత్మక సాహిత్యంలో దేశీయ సాహిత్యానికి ఊపిరి పోస్తే. ఆచార్య బిరుదురాజు రామరాజు జానపద సాహిత్య పరిశోధనకు జీవంపోశారు. తెలుగు సాహిత్య చరిత్రలో "దేశీయ సాహిత్యానికి" వరంగల్లు ఇచ్చిన ప్రత్యేకత ఇది. ప్రజా సాహిత్యం - ప్రజాకళల కాణాచి వరంగల్లు. కాబట్టే ఇక్కడ తెలుగు విశ్వ విద్యాలయం ఉపకులపతిగా ఆచార్య పేర్వారం జగన్నాథంగారు ఉన్నప్పుడు గిరిజన జానపద విజ్ఞాన పీఠాన్ని నెలకొల్పారు. ఈ జిల్లాకు సంబంధించి జానపద సాహిత్య విషయంలో వీరు చేస్తున్న కృషి అమూల్యమైంది. ఈ పీఠం వారు వెలువరించిన "మనపల్లెటూళ్ళ పాటలు అమ్మాపురం"- ఐదు వందలపై చిలుకు పేజీల గ్రంథమే అందుకు సాక్ష్యం. జానపద సాహిత్యానికి సంబంధించి ఈ పీఠం ద్వారా జరుగుతున్న కృషికి సంబంధించిన విషయ విశ్లేషణకూడా ఒక పరిశోధన గ్రంథమే అవుతుంది. కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం ఆచార్య బిరుదురాజు రుక్మిణి, ఆచార్య పాకనాటి జ్యోతిగారల నేతృత్వంలో జరిగిన జానపద పరిశోధనలను కూడా పరిశీలించి వరంగల్లు జానపద సాహిత్య చరిత్రను నిర్మించుకోవలసి ఉంది.

"వరంగల్లు సాహిత్య చరిత్ర"ను నిర్మించుకోడానికి సంబంధించిన అంశాలను రేఖామాత్రంగా మాత్రమే ఈ పత్రంలో చర్చించడం జరిగింది. ఒక పరిశోధన గ్రంథానికి సరిపడే విషయం ఇది. యువ పరిశోధకులు ఆ దిశగా కృషిచేసి తెలంగాణ సాహిత్య చరిత్ర నిర్మాణానికి తమవంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తారని ఆశిస్తున్నాను.

# వెలుగు తగ్గుతున్న తెలుగుభాష

-జి. తిరుపాల్ సోమశిల

"సంస్కృతంబులోని చక్కెర పాకంబు - అరవ భాషలోని అమృత రాశి -
కన్నడంబులోని కస్తూరి వాసన - కలిసిపోయే తేట తెలుగునందు"

ఎన్నో భాషలలో కలిసిపోయిన మన తియ్యనైన 'తెలుగుభాష'కు నేటి తరంలో ఆదరణ తగ్గిపోయినట్లుగా అనిపిస్తుంది కదూ...? ఎందుకంటె!? నేడు ప్రపంచంలో కనుమరుగవుతున్న కొన్ని భాషలలో మన తెలుగుభాష కూడా చేరిపోయిందంటున్న పరిశోధకుల మాటలను అప్పుడప్పుడు, అక్కడక్కడా వింటూనే ఉన్నాం. వారు అలా ఎందుకంటున్నారంటె...?! 'అమ్మ' అంటే 'వాట్' మమ్మి? అంటున్న నేటితరం పిల్లల్ని మన చుట్టుపక్కలతో పాటు మన ఇళ్లల్లో కూడా నిత్యం చూస్తూనే ఉన్నాం కదా! కాబట్టి వారికి అట్లా అనిపిస్తుందేమో?

సమాజం అన్ని రంగాల్లోనూ అభివృద్ధి సాధించడానికి ఉపకరించే అన్ని రకాల సాధనాల్లో భాష కూడా ఒకటిగా పేర్కొన్నారు. ఇది దృష్టిలో పెట్టుకున్న ఆ తరంలోని కొందరు మేధావుల, భాషాభిమానుల హృదయస్పందన - తెలుగువారికొక గుర్తింపు. తెలుగుభాషకొక గుర్తింపు రావాలన్న ఆకాంక్ష 1913లో బాపట్లలో జరిగిన మొట్టమొదటి ఆంధ్రమహాసభలోనె వెల్లడైంది. అలాగే 1953 ప్రాంతంలో శాసనసభ్యులుగా ఉన్న వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఓ సభలో అధికారభాషను గురించి "రాజ్యాంగ నిబంధనలకు అసంగతంగా లేనంతవరకు ప్రభుత్వ వ్యవహారాలన్ని తెలుగులోనే నిర్వహించాలని" ఓ తీర్మాణాన్ని ప్రవేశపెట్టారు. ఆ తర్వాత అది ఎంతవరకు అమలుజరిగిందన్నది పాఠకులే నిర్ణయించుకోవాలి. కారణాలు ఏవైనా... తెలుగు భాష అభివృద్ధికోసం శతాబ్దానికి పైబడి అనేక మంది ప్రముఖులు ఎన్నో రకాల సంఘాలు స్థాపించినా, ఎన్ని ఉద్యమాలు చేసినా, ఎన్ని ప్రభుత్వాలు మారినా తెలుగుభాష - తెలుగు ప్రజలకు పూర్తిస్థాయిలో ఉపయోగపడేలా ఇంతవరకు జరగలేదనేది భహిరంగ రహస్యమేకదా!

ప్రస్తుతపు ఆధునిక నాగరికతలో - రోజురోజుకు తెలుగు భాష కరిగిపోతుందని - వేదికలపై ఊకదంపుడు ఉపన్యాసాలిస్తూన్న పెద్ద పెద్ద మేధావుల మాటలనూ వింటున్నాం. అంతర్జాలంలో యంత్రాలను నడిపించే నేటి ఆధునిక మానవుని యాంత్రిక జీవనంలో తెలుగులో మాట్లాడటాన్ని ఓ పరాయిభాషగా పరిశీలిస్తున్న కొందరు ప్రముఖుల్ని గమనిస్తూనే ఉన్నాం. పోటీ పరీక్షల్లో ఆంగ్లంలో 'తొంబై ఎనిమిది' మార్కులొచ్చిన పిల్లవాన్ని మిగతా రెండు మార్కులు ఎందుకు తక్కువ వచ్చాయంటూ మందలిస్తున్న తల్లిదండ్రులు, తెలుగులో ముక్కుతూ మూల్గుతూ

'ముప్పై ఐదు' మార్కులొచ్చినా అదే ఎక్కువని భావించి, మా వాడికి తెలుగు సరిగా రాదంటూ ఆ విషయాన్ని కూడా గొప్పగా చెప్పుకుంటున్న అనేకమంది తల్లిదండ్రుల్ని చూస్తూనే ఉన్నాం. అంతెందుకు మన పక్కన్నే కొన్ని కార్పొరేట్ పాఠశాలల్లో 'తెలుగు'లో మాట్లాడినందుకు, రాసినందుకు, చదివినందుకు పిల్లలకు తీవ్రమైన శిక్షలు వేసిన సందర్భాలను మనం చూస్తూనే ఉన్నాం. చూసి సిగ్గుపడాల్సిందిపోయి సంబరపడుతూనే ఉన్నాం. ఇవన్ని చూస్తూంటే... కొందరు – అసలు తెలుగుభాష అనేది మనకు అవసరంలేదు! అనే నిర్ణయానికి వచ్చినట్లు అనిపిస్తుంది కదూ...? ప్రవాస భారతీయుల బంధుజన వారసులు పైకి చెప్పుకోవడానికి మాత్రం – మా బందువులబ్బాయి విదేశాలల్లో తెలుగులో ప్రసంగంచేసి మన భాషను కాపాడుతున్నాడంటూ గొప్పగా చెప్పుకుంటాం. అలాంటి వారికి సంఘాలతరపున గొప్ప గొప్ప సన్మాలుచేస్తూ పొంగిపోతుంటాం. అదే తెలుగులో ఇక్కడెందుకు మాట్లాడలేకపోతున్నాం? మన భాషను ఎందుకు చిన్నచూపు చూస్తున్నాం? 'ఉగ్గుపాల నుండి ఉయ్యాలలో నుండి – అమ్మ పాట పాడినట్టి భాష – తేనెవంటి విందు కనులకు కనువిందు" చేసిన మన మాతృభాషను, ప్రాచీన కాలం నుండి మనకు దారిదీపమైన మన తెలుగుభాషను ఇప్పుడు చీకట్లోకి తోసేస్తున్నామా?

పుట్టగానే 'క్యార్'మని వచ్చే తమతమ బిడ్డలకు ఏ భాష నేర్పాలన్నా ఆ భాషను తొలిగురువులైన తల్లిదండ్రులే సులభంగా నేర్పుతారన్నది అందరికి తెలిసిన సత్యం. మరి మన పిల్లలకు తెలుగు రాదని చెప్పుకోవడం చూస్తే మన భాష మూలాలను మనమే కావాలని నాశనం చేసుకుంటున్నట్లేగదా...!? ఫలితం కాలక్రమంలో పిల్లలు పెరిగి పెద్దయినా మన భాష మాత్రం 'శిలలా' అక్కడే ఆగిపోతుందన్న నిజాన్ని ప్రతి తల్లిదండ్రులు ఆలోచించవలసిన సమయం ఆసన్నమైంది. "తెలుగదెలయన్న దేశంబు తెలుగెను-తెలుగు వలభుండ తెలుగొ కండ-యెల్ల నృపులు గొలువ నెఱుగవె బాసాడి దేశభాషలందు తెలుగులెస్సా" అన్న శ్రీకృష్ణదేవరాయలవారి మాటనైనా మనకు గుర్తుకు రావడంలేదా? తమతమ ప్రాంతీయ భాషల కోసం నానా విధాలుగా ప్రాకులాడుతున్న పొరుగు రాష్ట్రాల ప్రజల పట్టుదలలు చూసైనా మనమూ బుద్ధితెచ్చుకుందామా...?

ప్రపంచంలో ఇప్పటికి కొన్ని భాషలకు 'లిపి' లేదని ఆయా దేశాల భాషాశాస్త్రవేత్తలు తమ భాష లిపి కోసం చేయని ప్రయత్నం, పరిశోధనలేదు. వారు తమతమ 'భాష-లిపి'ల కోసం అంతగా ఆరాటపడుతున్న ఇతర దేశాల వాళ్ళను చూస్తూ కూడా – అన్ని ఉన్నా మన 'తెలుగు భాష'ను అంతం చేసుకోవడం ఎంతవరకు సమంజసమో తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ, మేధావులు, మనమూ ఓసారి ఆలోచించి మన పిల్లలను మాతృభాషపైన మమకారం పెంచుకునేలా తీర్చిదిద్దుకునే ప్రయత్నంలో భాగంగా పిల్లలచేత పొరుగుభాషతో పాటు మన మాతృభాషనుకూడా నేర్పాల్సిన అవసరం ఉందని గట్టిగానే విన్నవిస్తున్నాం.

"తెలుగు బిడ్డ కాని తెల్లవాడైనట్టి - బ్రౌన్‌దొర గారు తెలుగు భాషలోని
తియ్యదనమునంత తేనెలా గ్రోలుచు - తెలుగు భాష నిలుప దీక్ష బూనె
తెలుగు వారికతడు తెలుగు నేర్పగోరి - తెలుగు మాటలెల్ల నిలుపుటకును
అతడు వ్రాసె నొక్క నిఘంటు వాసామి - బ్రూన్ దొర నిలిపె తెలుగు భాష సొగసు"

పరాయిభాష వాడైన బ్రౌనుదొర గారే తెలుగు భాషాభివృద్ధికి అంతగా పూనుకుంటే మరి మనకేమైంది? మనం మన భాషలో మాట్లాడలేక పోవడాన్ని పొరుగు రాష్ట్రాల ప్రజలు ముక్కున వేలేసుకోవడం మనమందరం చూస్తూనే ఉన్నాం కదా ! ఇవన్ని దృష్టిలో ఉంచుకున్న 'కొన్ని తెలుగు ప్రచురణ సంస్థలు" సంఘాలు, తెలుగు భాషకు పరిపుష్టిని చేకూర్చేదిశలో భాగంగానే తొలితరంనాటి అనేక మంది ప్రముఖుల రచనలను ప్రచురించి, వెలుగులోకి తెచ్చి, పాఠకులతో చదివించి, తెలుగు భాషను పెంచే దిశగా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాయి. "తెలుగు పతాకం యెగురని దిశయె లేదు - తెలుగు పులుగు చేరలేని దేశం లేదు - తెలుగు వెలుగు దూరలేని కోశం లేదు" అంటూ మరొక్క అడుగు ముందుకేసిన కొందరు మేధావులు, భాషాభిమానులు తెలుగుభాషపై ఉన్న మమకారాన్ని చాటుకునే ప్రయత్నంలో, మన భాషను అభివృద్ధిపరిచే దిశలో వివిధ రూపాలలో వారు చేపట్టిన, చేస్తున్న అనేకరకాల కార్యక్రమాలను, ఆయా ప్రచురణ సంస్థలను, భాషా అభిమానులనూ ఈ సందర్భంగా ప్రత్యేకంగా అభినందించుదాం...

తెలుగు భాష మరింతగా ప్రజల్లోకి వెళ్లేలా కార్యరూపం దాల్చాలంటే... కేవలం సూచనలు చేసే వ్యక్తులవల్ల, వ్యవస్థవల్ల ప్రయోజనం జరగదని మేధావుల అభిప్రాయం. అందుకు అన్ని ప్రభుత్వ కార్యాలయాల్లోనూ, పరిపాలనా విభాగాల్లోనూ వ్యవహారాలన్ని తెలుగులోనే జరగాల్సిన అవసరం ఉంది. పాలకులు - ప్రజల్లో అధికారభాష గురించి అవగాహన పెంచేందుకు ప్రస్తుతం కొనసాగుతున్న వివిధ ప్రసార మాధ్యమాలద్వారాగాని, ఇతర ప్రక్రియలద్వారాగాని, ప్రకటనలద్వారాగాని, తమదైనరీతిలో ప్రత్యేక ప్రచారాలు నిర్వహించాల్సిన అవసరం ఉంది. భాషాపరంగా ప్రజలను చైతన్యపరచాలి. ప్రజలందరిలో అధికార భాషాస్పృహను కార్యశీలంతో నిత్యం పెనవేసుకునేటట్లు చేయాలి. ప్రభుత్వ పాఠశాలల్లో ఆంగ్లం తప్పనిసరి అన్నట్లు - ప్రయివేటు పాఠశాలల్లో తెలుగు తప్పనిసరి అన్న ఖచ్చితమైన నిబంధన ఉంచాలి. అలాగే మన పిల్లలకు కుటుంబస్థాయిలో, తెలుగు భాషలో మాట్లాడడం, రాయడం, చదవడం నేర్పించాల్సిన బాధ్యత అందరిపైన వుంది.

"వేనవేల కవుల వెలుగులో రూపొంది - దేశదేశములను వాసిగాంచి - వేయియేండ్ల నుండి విలసిల్లి"న తరతరాల మన భాషను ముందుతరాలకు అందించాలనే సంకల్పమే ఈ ప్రయత్నం.

రోజు రోజుకూ కనుమరుగవుతున్న మన తెలుగుభాష - భాషను కాపాడుకోవటంపైనే ఉండాలి మనందరి ధ్యాస.

# గిరిజన పోరాట కథలు - పరిశీలన

-డా॥ కందాల శోభారాణి

ప్రతి దేశానికి ఆ దేశ నైసర్గిక, చారిత్రక, సామాజిక, ప్రత్యేకతలు కొన్ని ఉంటాయి. భారతదేశానికి గల ప్రత్యేకతలలో గిరిజనుల జాతి ఒకటి. ఇతర దేశాలలో గిరిజనులు లేరని కాదు. మనదేశంలో గిరిజనులకు ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. సంఖ్యరీత్యా జనాభాలో తక్కువ శాతమే అయినా గిరిజనులు దేశంలోని అన్ని రాష్ట్రాలలోను నివసిస్తున్నారు. బ్రిటిష్ వాళ్ళ కాలం నుండి నేటిదాకా మనదేశం అభివృద్ధి పేరుతో చేసే పనుల వల్ల అత్యధికంగా నష్టపోయింది గిరిజనులే అని చెప్పవచ్చు. అత్యధికంగా ఈ 180-200 సంవత్సరాల కాలంలో తిరుగుబాట్లు చేసింది కూడా గిరిజనులే అని చప్పుకోవచ్చు.

శ్రీకాకుళం నుండి ఆదిలాబాద్ దాకా దట్టమైన అడవులు, కొండలు. ఆ అడవులలో నివసించే సవర, జాతాపు, కోయ, కొండరెడ్డి, నాయకపోడు, గోండు, కోలాం తదితర గిరిజనులు కనబడతారు.

గిరిజనుల జీవితాన్ని, ఆశయాలను, ఆకాంక్షలనూ ప్రతిబింబించే సాహిత్యం తెలుగులో చాలా తక్కువ. గిడుగు వెంకటరామమూర్తి, గిడుగు సీతాపతి గార్లు, సవరల జీవన విధానంపై రచనలు చేశారు. భూషణం గిరిజనులపై అనేక కథలు, ఒక నవల రాశారు. వసంతరావు దేశ్‌పాండే, శనగరపు వెంకటేశ్వర్లు (సాహు), అల్లం రాజయ్య, పి.చందు, అడవి సూర్యకుమారి మొదలగువారు నవలలు, కథలు రాశారు.

ఈ పత్రం కేవలం గిరిజనుల పోరాటాలకు సంబంధించిన పది కథలకు మాత్రమే పరిమితం చేయటం జరిగింది. 1981-1985 మధ్యకాలంలో సృజన, అరుణతార పత్రికలలో వచ్చిన కథలు. 1) "తుడుం"- గోదావరి. 2) "రక్తపింజెర" - సాహు (అల్లం రాజయ్య), 3) "ఆకలి"-సాహు, 4) "మరట్ తుడుం పాయనా" (మనమే తుడుం గొట్టాలె)-సాహు, 5) "గెరిల్లా"-పి.చందు, 6) "అడవిలో వెన్నెల"-బి.యస్ రాములు, 7) "రగల్ జెండ్ మైసివాకట్" (ఎర్ర రాజ్యం గెలిచి వస్తాం)-తొడసం జంగు, 8) "గంగజిమ్మ"-కాంతి, 9) జెండా కథ - సాహు. మొత్తం పది కథలు రచయితలు ఆరుగురు. సాహు పేరుతో అల్లం రాజయ్యవి నాల్గు కథలు. పి.చందు రాసినవి రెండు కథలు. మిగతా వారు బి.ఎస్.రాములు, తొడసం జంగు, కాంతి, గోదావరి.

అభ్యుదయ సాహిత్యోద్యమం తరువాత విప్లవసాహిత్యోద్యమ కాలంలో తెలుగు సాహిత్యంలో కొత్తగా ప్రాధాన్యం వహించినవారు గిరిజనులు. సాహిత్యంలో ప్రవేశించిన కొత్తవస్తువు గిరిజన రైతాంగ పోరాటం.

ఇంద్రవెల్లి సంఘటన గిరిజన రైతాంగ పోరాటాలను ఉధృతం చేయటంలో ఎంతో చారిత్రక పాత్ర ఉంది. దాని స్ఫూర్తితోనే గిరిజన పోరాట సాహిత్యాన్ని సృజించగల్గారు. 1981 ఏప్రిల్ నెలలో జరిగిన ఇంద్రవెల్లి సంఘటన తక్షణమే సాహిత్య కారులను కూడా ఆందోళనకు గురిచేసింది. గోండులను, గోండుల పోరాటాలను ప్రజలకు పరిచయం చెయ్యాలనే తలంపు కలిగించింది. ఆ తలంపులో భాగంగానే వచ్చినవి ఈ కథలు.

తమ అనుభవానికందని విషయాల్ని ముట్టుకోవటంగాని, లేని భావాల్ని అంటించుకోవటం గాని, కథాకథనంలో ఆడంబరం చూపటం గాని ఈ కథలలో కనిపించదు. గిరిజనుల సజీవచిత్రాలు కనిపిస్తాయి.

"తుడుం" కథలో గిరిజన ప్రాంతాల్లోకి నక్సలైట్లు వచ్చారని వారికి గిరిజనులు ఆశ్రయం ఇచ్చారనే నెపంతో పోలీసులు గిరిజనుల గూడేలకు వచ్చి దౌర్జన్యం చేయబోతారు. ప్రతిసారి గిరిజనులను నక్సలైట్ల పేరుతో చిత్రహింసలకు గురిచేస్తుంటారు. కాని ఈసారి ఒక ప్రణాళిక ప్రకారం గిరిజనులు పోలీసులకు తగిన బుద్ధి చెప్తారు. తుడుం పిలుపు ద్వారా ఆ పోలీసులను తిప్పి కొట్టడాన్ని దానికి గిరిజనులు చేసిన సాహసాన్ని ఈ కథలో చూడవచ్చు.

గిరిజన ప్రాంతాల్లో పార్టీ చేసే కార్యక్రమాలు. గిరిజనులు దోపిడీకి ఎలా గురి అవుతున్నారు. వాటిని ఎలా ఎదుర్కోవాలో సూచించటం జరుగుతుంది. ఆ క్రమంలో ప్రభుత్వ అధికారుల వల్ల నిర్బంధం కూడా ఉంటుంది. పార్టీ పనితీరును, ప్రజల మధ్య చేసే కార్యక్రమాలను బట్టి తెలుసుకోవచ్చు. పార్టీ గొప్ప క్రమశిక్షణను కలిగి ఉంటుంది. ప్రజల కోసం పని చేసే ఆ పార్టీ కార్యకర్తలను ఆపదలో ఉన్నప్పుడు ప్రజలు కడుపులో పెట్టి కాపాడుకోవటాన్ని చిత్రించిన కథనే "గంగజిమ్మ". అంకమ్మ అనే స్త్రీ పొరకల సార్లు (నక్సలైట్లు) ఎప్పుడొచ్చినా ఉత్సాహంగా పాల్గొంటుంది. వారికి ఎంతో సహకరిస్తుంది. అలాంటి అంకమ్మకు ఆరోగ్యం బాగా లేదని తెలిసి. పొర్కల సారైన చిన్నన్న అనే అతను వైద్యం చేయడానికి వస్తాడు. ఒక కోవర్టు ద్వారా చిన్నన్న ఊళ్ళోకొచ్చినట్టు సమాచారం పోలీసులకు అందుతుంది. దాంతో వెతకటం మొదలుపెట్టారు. సమ్మన్న, పాపన్న, నర్సన్న, ఇస్తారక్క మొదలగువారు చిన్నన్నను తప్పించటంలో చాకచక్యాన్ని ప్రదర్శిస్తారు. గిరిజనులు వారి బ్రతుకులల్లో పొర్కల సార్లు వచ్చాక కొంత మార్పు వచ్చిందనేది వారి విశ్వాసం. అందుకే వారిపట్ల అభిమానాన్ని ప్రదర్శిస్తారు.

అల్లం రాజయ్య సాహు పేరుతో రాసిన "రక్తపింజెర" కథలో అడవి బొంగును కొట్టి కుప్పలుగా కట్టటానికి, వాటిని లారీలకు ఎత్తించటానికి, ఆ లారీలు నడవటానికి కొత్తరోడ్లు వేయిస్తుంటారు. తక్కువ కూలీలు ఇచ్చి గిరిజనులతో ఎక్కువ పని చేయించటాన్ని ఈ కథ వివరిస్తుంది. గిరిజనులను దోపిడీ దౌర్జన్యాలకు గురి చేస్తున్న కంపెనీల స్వభావాన్ని చిత్రించిన కథ ఇది. సంఘం ప్రేరణతో తమ మీద సాగుతున్న అణచివేతకు వ్యతిరేకంగా గిరిజనులు సంఘటితంగా పోరాడే ప్రథమ దశను ఈ కథ చిత్రించింది కూడా.

"మనమే తుడుం గొట్టాలె" (మరట్ తుడుం పాయానా) కథలో అడవి నరికి దున్నుకు బ్రతుకుతున్న గిరిజనులు సంఘటితం అవుతారు. వారి భూమి నుండి వారినే తరిమి వేసే ప్రభుత్వ విధానాలను వ్యతిరేకిస్తూ శత్రువులను ఆయుధంతో ప్రతిఘటించటానికి సిద్ధపడతారు. అధికారుల జులుంను సంఘటితంగా ఎదుర్కోటానికి సిద్ధపడటమే ఈ కథ చిత్రించింది.

గిరిజన రైతాంగ పోరాటంలోని కొన్ని యథార్థ సంఘటనలను వివరించిన కథ "ఎర్ర రాజ్యం గెలిచి వస్తాం" (రగల్ రాజ్య, మైసివాకట్). గిరిజన, గిరిజనేతర పేదవర్గాల మధ్య వచ్చిన సమస్యలను, వైరుధ్యాలను పొరకల పార్టీ పరిష్కరించిన తీరు కనిపిస్తుంది. మాంగనీసు తవ్వే కూలీలు వారి కూలీరేటును పెంచాలని సమ్మె చేస్తారు. అంతేగాక సాత్నాలా ప్రాజెక్టు కడితే గనుక ముంపుకు గురికాక తప్పదని తెలుసుకుంటారు.

ఆ ముంపుకు గురయ్యే బోయగూడెం, సాత్నాలా, మాంగూరు ప్రజలు తమకు నష్టపరిహారం చెల్లించకుండా ప్రాజెక్టు పని చెయ్యడానికి వీలు లేదని ప్రతిఘటిస్తారు. వీరిపై పోలీసులు దాడికి ప్రయత్నిస్తే గిరిజనులు పోలీసులను తిప్పికొట్టటాన్ని మొదలగు సంఘటనలు ఈ కథలో చిత్రించటం జరిగింది.

ఒక ఆదివాసీ ముసలవ్వ జీవితంలో పడ్డ అనేక కష్టాలు దానికి తోడు పొరకల సార్లు చెప్పిన మాటలు బందూకు పట్టక తప్పదనే ఆలోచనకు వస్తుంది. తన కొడుకు జానును ఉద్యమానికి స్వీకారం చుట్టేలా కదిలిస్తుంది "ఆకలి" కథ. ఎంత కష్టం చేసినా కడుపునిండని దయనీయ స్థితిని తలచుకొనగా కలిగిన కోపం ఆ ముసలవ్వది. చేనులో జాన్వర్ (జంతువులు) వస్తె కావలి ఉండి కొడతానం. సాగు చేయటం, పండేపంటను కాపాడుకోవటం. ఇన్ని చేసి కాపాడుకొస్తున్న పంటను మన కళ్ళముందే దోచుకొని పోతున్న దోపిడోల్లను, ఆఫీసర్లను, లంచం తీసుకున్నోళ్ళను, మన భూములల్లో మనం పోడు చేసుకుంటుంటె కేసులు పెట్టి తుపాకులతో కాల్చి చంపేసే సర్కారోల్లను ఎందుకు వదిలి పెడ్తున్నామని తన కొడుకును ప్రశ్నిస్తుంది. జంతువుకో న్యాయం? మనిషికో న్యాయమా? అని నిలదీస్తుంది. ఇంద్రవెల్లి వైపు చూడమని ప్రోత్సహిస్తుంది. పొరకల సార్లు చెప్పినట్లు నేనన్న బందూకును పడతా అంటుంది ముసలవ్వ. దాంతో కొడుకు ఆలోచనలో పడతాడు. ఉద్యమించక తప్పదని ఒక నిర్ణయానికి వస్తాడు. మాక్సింగోర్కి రాసిన "అమ్మ" నవలలో అమ్మకున్న స్ఫూర్తి ఈ ముసలవ్వలో చూడవచ్చు. అమ్మ నవలలో కార్మిక వర్గ స్ఫూర్తినిస్తే, ఈ కథలో ముసలవ్వ గిరిజనులకు జరిగే అన్యాయాన్ని ప్రతిఘటించమని కోరింది.

గెరిల్లా కథలో పొరకలసార్ల జాడ చెప్పమని గిరిజనులను పోలీసులను హింసిస్తుంటారు. దాన్ని తుడుం దెబ్బతో ఎదుర్కొనటం కనిపిస్తుంది. ఫారెస్టు అధికార్ల జులుంకు వ్యతిరేకంగా పోరాటం కొనసాగిస్తారు. కాగితపు పరిశ్రమ కోసం తక్కువ కూలీలతో పనిచేయిస్తుంటె, అది గ్రహించిన ఆదివాసీలు బిర్లా కాంట్రాక్టర్లకు వ్యంతిరేకంగా కూలీ పెంచాలని సమిష్టిగా పోరాటం చేస్తారు. జెండా కథలో కూడా ఇదే స్ఫూర్తి కనిపిస్తుంది.

గిరిజన రైతాంగ పోరాటాలను ప్రతిఫలించిన కథాసాహిత్యంలో 'అడవిలో వెన్నెలకు' ఒక ప్రత్యేకత చోటుచేసుకుంది. ఈ కథలో గిరిజన రైతు జీవితాన్ని వాళ్ళ సంస్కృతీ సంప్రదాయాలను ప్రత్యేకంగా చూపించారు. అనుక్షణం గిరిజనులు ఫారెస్టు అధికారుల పీడనకు, దోపిడీకి గురికావటం కనిపిస్తుంది. నిర్బంధంగా గిరిజనులు అతి తక్కువ కూలీతోనే కంకబొగ్గు కొట్టటానికి పోవలసి వస్తుంది. గిరిజనులు భూమిని దున్ని సాగుచేసి పంట చేతికొచ్చే దాకా జంతువుల, పక్షుల బారిన పడకుండా నిద్రాహారాలు మాని పనిచేస్తే చివరికి పంట చేతికొచ్చే సమయానికి ఎవరో ఒక దొర తనదంటూ వచ్చి, చేసిన కష్టాన్ని పంటను దోచుకోవటం ఈ కథలో చూడవచ్చు. షావుకార్లు, అప్పు, వడ్డీ పేర్లతో పండించిన ధాన్యాన్ని నోటిదాకా రాకుండా చేయటాన్ని ఈ కథ చిత్రించింది.

పీడనకు గురి అయిన గిరిజనులను సంఘటితం చేయటమే కాకుండా, వాళ్ళను వాళ్ళ శ్రమ ఫలితాలను దక్కించుకోడానికి పోరాట మార్గాలలోకి నడిపించడానికి పార్టీ ప్రవేశించటం కూడా ఈ కథలో గమనించవచ్చు. జొన్నచేన్లు, చేన్ల మధ్య పాకలు, చేపలు పట్టే పద్ధతి. అంబలి కాయటం, పండుగల గురించి, అమ్మాయిలకు పచ్చబొట్టు పొడిపించే పద్ధతి ఇవన్నీ రచయిత పాఠకులకు దృశ్యమానం చేశాడు. ప్రకృతి, గిరిజన రైతాంగ జీవితం, వాళ్ళ శ్రమ, వాళ్ళతిండి, అడవి ఇవన్నీ కలగలిసి కథకు మంచి వాతావరణాన్ని సమకూర్చాయి. అడవిగాచిన వెన్నెల అనే పాత భావాన్ని తిప్పికొట్టి, ఈ పోరాటాల యుగంలో అడవిలో వెన్నెల విప్లవోద్యమానికి ప్రతీక అవుతుంది. అడవిలో వెన్నెల అడవంతా వ్యాపించినట్లుగా విప్లవోద్యమాలు అడవంతా వ్యాపిస్తాయి. వెన్నెల చీకట్లో అడవి బాటలను చూపించినట్లుగా, విప్లవోద్యమం కష్టంలో, దుఃఖంలో, పీడనలో వున్న జనానికి వెన్నెల లాంటి మార్గాలను చూపిస్తుంది.

మొత్తం మీద 1981-85 మధ్యకాలంలో వచ్చిన ఈ గిరిజన పోరాట కథలను పరిశీలిస్తే విషయ వైవిధ్యంతో పాటు, నిర్మాణంలో కూడా ప్రమాణాలు కలిగి ఉన్నాయి. తెలంగాణా గిరిజన పోరాట కథలు తెలంగాణా జనజీవితం నిత్యం మాట్లాడుకొనే భాషలో ఉండాలనుకున్నారు. దానిని రచయితలు ఆచరణలో చూపించారు.

ప్రజలను గౌరవించాలనే తలంపు, విముక్తి కోసం రచనలు చేయాలనే నిబద్ధత కనిపిస్తుంది. ప్రజల భాషను గౌరవించటం ప్రజల సమస్యల్ని, ప్రజల పోరాటాల్ని రాయటం ఆశించదగ్గ పరిణామం.

ఒరియాలో భగవతీ చరణ్ పాణిగ్రాహి, గోపీనాథ్ మహంతీ, బెంగాలీలో మహాశ్వేతాదేవి, హిందీలో రాజేంద్ర అవస్టీ హిమాంశుజోషీ, అస్సామీలో వీరేంద్ర భట్టాచార్యులు సృష్టించిన సాహిత్యంతో పోలిస్తే తెలుగులో గిరిజనులపై వచ్చిన సాహిత్యం చాలా తక్కువ.

ఇంగ్లీష్‌లో, హిందీలో ఆదివాసీలపై వచ్చిన పరిశోధన గ్రంథాలు, వ్యాసాలు కోకొల్లలు, ఎన్నో విషయాలు ఇంకా తెలుగు పాఠకులకు అందించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

# సాహిత్య మాగాణం వరంగల్లు-ఒక రేఖాచిత్రం

-పొట్లపల్లి శ్రీనివాసరావు

అజరామరమైన సార్వజనీనమైన సాహిత్యసృజనను అనివార్యంగా మాట్లాడుకుంటాం. శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న సాహితీ కల్పతరుపు వేళ్ళను, తల్లివేరును శతాబ్దాల తరబడి స్పృశించి, సహస్రాబ్ధి స్వాగతించి జీవితంలోని అన్ని పార్శ్వాలు ఒక సార్వత్రిక మానవహక్కుల చరిత్రకు పునాదిగా ముందుకు సాగడం మనిషి సంస్కృతికి ముఖ్యలక్షణం. ఆ నేపథ్యంలో ఇవ్వాళ ఓరుగల్లు సాహిత్య చరిత్ర ఒక్కసారిగా... ఓ చిన్న అద్దంలో చూపే ప్రయత్నమే ఈ సాహసం.

చారిత్రక ప్రాధాన్యత సంతరించుకున్న కళల మాగాణి కాకతీయుల పోరుగడ్డ - వరంగల్ కీర్తి కిరీటానికి సాహిత్య తొలిబావుటా ఎత్తింది పాల్కురికి సోమనాథ కవి పండితుడు. బసవపురాణం, పండితారాధ్య చరిత్ర మొదలగు వాటినెన్నింటినో ద్విపద చందస్సులో రచించాడు. శతకం, ఉదాహరణ కావ్యం, వంటి ఎన్నో విషయాల్లో ఆద్యుడు. వేదోపనిషత్తులు, పురాణేతిహాసములు ప్రామాణీకరించిన మహానీయుడు. జానపదానికికావ్యగౌరవం కల్పించిన ఆదికవి.

వేదానికి భాష్యం చెప్పిన విద్యారణ్యులవారు కాకతీయుల కాలంనాటివారు. శివదేవయ్య కాకతీయ రాజుల మంత్రి మాత్రమే కాదు గొప్పకవి పండితుడు కూడ. జాయప్ప సేనాని వృత్తరత్నావళి, కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక కావ్యాలు ఆనాటివే.

రాజాశ్రయు కవిత్వమే కవిత్వంగా చలామణిలో వున్న ఆరోజుల్లోనే ఆ సంప్రదాయాలన్నింటిని ధిక్కరించి, కటిక దారిద్ర్యం బాధించిన భాగవతాన్ని రచించి తన ఇష్టదైవమైన శ్రీరామచంద్రునికి అంకితమిచ్చిన పోతనామాత్యుడు సంస్కృత భాషలో కూడా దిట్ట. ఒకానొక విశిష్టకవి వీరభద్రవిజయం, భోగినీ దండకం కూడా వీరి రచనలే. ఇతడి నామంలోని బమ్మెర వీరజన్మ స్థలం. సీమంతినీ విలాసము, నీతి చంద్రిక ప్రకటించినసుంకరనేని ఫణికుండలుడు విజయవిలాస యక్షగానగ్రంథరచయిత సుంకరనేని రాజమౌళి 18వ శతాబ్దపు చివరివారు. 19వ శతాబ్దపు మధ్యలో కాలంచేసిన శ్రీమోతుకూరి పండరినాథరావు గారి కృతులు పండరినాథ రామాయణం, రామనాథ కల్పపల్లి గ్రంథాలు ఆధ్యాత్మికచింతనాపరుల ప్రశంసల జల్లులో తరించినవే.

వరంగల్ సమీపంలోని ఖిలాషాపురానికి చెందిన శ్రీరంగరాజు కేశవరావు గారి ఇంద్రదుమ్నీయం, హనుమద్విజయం, కల్కి పురాణం, లీలాపరిణయం మరికొన్ని కృతులున్నప్పటికి చాలా వరకు అలభ్యాలు. వీరు కవి శిరోమణి' బిరుదుతో సత్కరించబడినారు. నెల్లికుదురు

గ్రామానికి చెందిన శ్రీ మాడభూషణం రంగాచార్యులు గారు రామానుజ రహస్య వివరణం, ప్రసన్న జీవధాతువు, తిరునామములు రచించిన భక్త కవి. వీరి మనువడే కీ.శే. యం.యస్. ఆచార్య గారు (వరంగల్ వాణి, జనధర్మ సంపాదకులు). దేశాటన చేస్తూ తాత్వికచింతనతో అశువుగా భావలింగశతకం, మల్లిఖార్జునశతకం రచించిన ముదిగొండ శంకరరాధ్యులు గారు గొప్ప వితరణశీలి. 1918లో స్థాపించిన శబ్దానుశాసన భాషానిలయ భవనప్రదాత.

'సీతారామాంజనేయ సంవాదం' అందించిన పరుశురామ పంతులు రామలింగయ్య శాస్త్రి గారు, వీరి కుమారుడు రాంమూర్తి గారు భక్తి తత్వవ్యాప్తికి కృషిచేసినారు. రామానుజయశోభూషణం, నీలాకళ్యాణం రచించిన అమరవాది నారాయణచార్యులు గారు, ఆంధ్రపదనిదానం (నిఘంటువు) రూపొందించి, గోపికా విలాసం రచించిన తూము రామదాసు సేవలు మరువలేనివి. తెలంగాణ మాండలికాలకు ఈ నిఘంటువులో చాలా వరకు చోటు లభించిందని చెప్పవచ్చు.

ఇనుగుర్తికి చెందిన ఒద్దిరాజు సోదరులు రాఘవరంగారావు, సీతారామచంద్రరావు గార్ల సాహిత్య సేవ మరింత విశిష్టమైనది, సంస్కృతాంధ్ర ఉర్దూ, ఆంగ్ల భాషా పండితులు శ్రీ గ్రంథమాల స్థాపకులుగా 'తెనుగు' పత్రికా సంపాదకులుగా పేరుపొందారు. సోదరులిద్దరు కలసి యాభైకి పైగా గ్రంథాలు రచించారు. సౌధామిమని, అష్టాధ్యాయ వ్యాఖ్య, భట్టికావ్య వ్యాఖ్య వంటివి ముఖ్యమైన కృతులు. 'మనోరమ' పదాల ద్వారా జనసామన్యంలో కూడా కవిగా పరిచయమైన ఉదయరాజు శేషగిరిరావు గారు శృంగార తరంగిణి రచించారు. వీరు కవిరాజ చూడామని అనే బిరుదుతో సత్కరించబడినారు.

వరంగల్లును నివాస స్థానంగా మార్చుకున్న ధూపాటి వెంకటరమణాచార్యులు గొప్ప పరిశోధకులు పోతన బమ్మెర (వరంగల్) వారేనని నిర్ధారించిన సాహితివేత్త. శతావధానాలు నిర్వహించారు. విప్రమేర్వనీయము, అర్జునపరాభావం 6 మొదలగు 15కు పైగా రచనలున్నాయి. వీరి అన్నగారు ధూపాల శేషాద్రిగారు. శేషాద్రిరమణ కవులుగా వీరు ప్రసిద్ధి.

గార్లపాటి రాఘవరెడ్డి గారు ఊర్దూ, తెలుగు హింది భాషాప్రవీణులు... 'పరిదేవనము' 7 ఆర్తి అనుభూతితో నిండిన కృతి. ఈయనను 'శుకయోగి' అని పిలిచెడి వారు. 8 వీరి రచనలుఇంకను వెలుగుచూడవలసినవి ఉన్నవి.

మడికొండ వాసులైన బక్కయ్య శాస్త్రి గారు గొప్ప పురాణ పండితుడు. వీరి కుమారుడైన శ్రీవానమామలై వరదాచార్యులు గారు పోతన చరిత్రను రచించి అభినవ పోతనగా ఘనుతికెక్కగా, జగన్నాథచార్యులుగారు రైతు రామాయణం ద్వారా ప్రశస్తి పొందారు. కళ్యాణరాఘువం అందించిన చిలకమర్రి రామానుజాచార్యులు... 'ఎవరురా మా అమాత్యులనీసడించి కలమునడిపెడి మొనగాడు / తెలుగునేల? అని క్రొత్త శ్వాసను అందించిన నెల్లుట్ల రామక్రిష్ణమాచార్యులు,

రాజకీయ చరిత్రను అక్షరబద్ధం కావించిన మాదిరాజు రామకోటేశ్వరరావు, భారతీయ సంస్కృతి, చరిత్రను అందించిన బహుముఖ ప్రజ్ఞాశీలి పాములపర్తి సదాశివరావు, కుంకుమేశ్వర శతకంరాసిన పరకాల వాసి రాపాక వెంకటపతిగారు, కాపుబిడ్డను అందించిన గంగుల సాయిరెడ్డి ఇంకా ఎందరని చెప్పేది... వీళ్ళంతా ఈ ప్రాంత సాహిత్య వాతావరణాన్ని పరిపుష్టం చేసినావరే.

"మోడువారిన మానవహృదయాలను / మోసులెత్తించడానికి వచ్చింది ఉగాది" అంటూ లలితంగా చెప్పినా, నిజాంనిరంకుశ పాలనను 'ఓ నిజాం పిశాచమా' అని ఎండకట్టినా, ఉద్యమాన్ని కవిత్వాన్ని సమాహారంగా మలుచుకున్న ఘనత దాశరథి కృష్ణమాచారి గారిదే. ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవిగా కళాప్రపూర్ణ, పద్మశ్రీ బిరుదులతో గౌరవింపబడిన దాశరథి అగ్నిధార, రుద్రవీణ, తిమిరంతో సమరం మొదలగు రచనలను ప్రకటించినారు. 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అని సగర్వంగా ఎలుగెత్తి చాటిన నవ్య కవితావైతాళికులు. పండిత కవిమోతుకూరి మధుసూదన్ రావుగారు మధుమంజరి, చిత్ర కవిత్వం, సార్థకజీవి నాటకం, శ్రీ వెంకటేశ్వర శతకం రచించారు.

నవనీతం, పచ్చతోరణం మొదలగు రచనలు కావించి, శోభ సాహిత్య మాస పత్రిక సంపాదకుడిగా, విమర్శకుడిగా, వ్యాసకర్తగా, ఆంధ్రసారస్వత పరిషత్తు అధ్యక్షుడుగా ఈ నేలను సాహిత్యంతో పరిపుష్టం చేసిన దేవులపల్లి రామానుజారావు గారు ఈ శతాబ్దపు వైతాళికుల్లో ఒకరు.

కాలిబాట, జనత లాంగ్ పోయమ్స్ ద్వారా జనబాహుల్యమైన పొట్లపల్లి రామారావు గారు స్ట్రేథాట్స్ చుక్కలు, ప్రజాదీప్తి రచనల ద్వారాను, మంచికథకుడిగాను తనదైన సుస్థిర స్థానాన్ని వరంగల్లు సాహిత్యంలో పదిలపరుచుకున్న తత్వవేత్త.

జానపద గేయ సాహిత్యాన్ని ఊపిరిగా మలుచుకొని ఇక్కడి జానపద జ్ఞానాన్ని నిక్షిప్త పరిచిన ఆచార్య బిరుదు రామరాజు గారు జాతీయ స్థాయి ఉపన్యాసకుడిగా గౌరవించబడిన మొట్టమొదటి తెలుగువాడు కావడం హర్షించదగిన విషయం.

మిత్రమండలిని అవిశ్రాంతగా నడిపిన కాళోజి రామేశ్వర్ రావు గారు తెలుగు రచనలు, ఉర్దూ సాహిత్య సొబగుల్ని, కాయకాత్ ఎ షాద్, 'కలామ్ ఎ షాద్' వంటి గొప్ప రచనలు అందించారు.

ప్రజాకవి కాళోజీ వీరి తమ్ముడు. కాళోజీ నారాయణ రావు గారు కాళన్నగా ఉద్యమకవిగా తెలంగాణ పల్లెప్రజలకు కూడా తెలిసిన ఈయన 'నాగొడవ' బహు ప్రసిద్ధి పొందిన రచన. పద్మ విభూషణ్ పురస్కారం, కాకతీయ విశ్వవిద్యాలయం డాక్టరేట్, రాజ్యలక్ష్మి ఫౌండేషన్ అవార్డులు ఈయన వ్యక్తిత్వం ముందు దాసోహమైనవి. 'కాలునికేకాదు / మహాకాలునికి కూడా/ జీ అనని ఖలేజా కాళోజీ నాగొడవ – నానా ఇబ్బందుల అడుగడుగున చూడ / నా

యిజందే అగుపడును జాడ' అంటున్న నిలువెత్తు మానవత్వపు చూపు – కాళజీ ప్రజాసాహిత్యానికే ఒక ఎస్సెట్.

పద్యానికి పట్టంకట్టి సరళంగా జనం గుండెలోతుల్లోనూ పల్లకెక్కి ఊరేగిన 'రసబ్రహ్మ' అనుముల కృష్ణమూర్తి 'సరస్వతీ సాక్షాత్కారం' సాహితి పరుల నాలుకల మీద సదా సాక్షాత్కరిస్తుంది.

విప్లవాల గడ్డమీద ఉడుకునెత్తురును ఉరికించి మేధావుల మస్తిష్కాలలో ఒక ఆలోచనకు పదునుపెట్టిన విప్లవ మేరు నగధీరుడు పెండ్యాల వరవరరావు గారు. ఆయన కవిత్వం నిఖార్సైన నిబద్ధతకు మారుపేరు. ఆయన చలినేగళ్ళు', 'జీవనాడి, భవిష్యత్ చిత్రపటం' ఊరేగింపు మొదలైనవి ఆయన గ్రంథాలు. 'వరవరరావుగారిది ఆ రోజు నుండి ఈ రోజు వరకు 'సముద్రం'లాంటి గాంభీరమే లోతైన ధృక్పథమే.

పల్లా దుర్గయ్య 'గంగిరెద్దు' పాలవెల్లి, పల్లా రామకోటార్య 'వినగదప్ప వెర్రి వెంగళప్ప' స్పృశించకుండా ఇక్కడి సాహిత్యాన్ని మాట్లాడుకోలేం.

సాహిత్యం లోని అన్ని ప్రక్రియలనూ పట్టించుకున్నా, వ్యతిరేకించినా ఇక్కడి సాహిత్యానికి ఒక ఐడేంటిటి వుంటుంది. అందులోంచి వచ్చిందే 'చేతనావర్తం'. ఒక ఉద్యమ కెరటమై విరుచుకపడింది. అందులో కోవెల సుప్రసన్న, కోవెల సంపత్ కుమార, పేర్వారం జగన్నాథం, వేనరెడ్డి... వీరి గురించి తెలుగు నేలలో తెలియని సాహితీ పరులుండరు. క్రమంగా ఎవ్వరి శైలి వారిదైన సంపత్ కుమార విమర్శకుడిగాను, జగన్నాథం దీక్షదక్షుడైన సాహితికృషీవలుడుగాను, సుప్రసన్న తత్వవేత్తగాను ఎదిగితే వేనరెడ్డి పిన్నవయస్సులోనే కాలంచేయడం ఒక లోటుగా మిగిలింది. వేరు వేరుగా వీరు వ్రాసిన అనేక గ్రంథాలు విశ్వవిద్యాలయాల్లో అధ్యయన గ్రంథాలుగా నిలబడ్డాయి. ఈ నలుగ్గరి చేతనావర్తకవుల్లో పేర్వారం జగన్నాథం గారిది పేరెన్నికగన్న 'అధిక్షేపం' హాస్యాన్ని చల్లుతూనే చెంప పగలగొట్ట గల కవిత్వం.

చక్కని కథకుడు నవలా రచయిత ఆలోచనాతరంగాల చైతన్య స్రవంతి, కేంద్రసాహిత్య పురస్కార గ్రహీత తెలుగు నవలకు అంధమైన ముఖచిత్రం, శిల్పంలో దిట్ట అయిన 'నవీన్' సామాజిక ప్రయోగశీలి. అంపశయ్య, సంకెళ్లు, చీకటిరోజులు, ముళ్ళపొదలు, అంతఃస్రవంతి, విమెన్స్ కాలేజ్, ఎనిమిదో అడుగు, కాలరేఖలు వంటి ముప్పదికి పైగా వీరి రచనలున్నాయి. పింగిళి రంగారావు, సంధ్యా రంగారావు గారలు మంచి కథకులుగా మిత్రమండలికి పరిచయం.

ఆధ్యాత్మిక జీవనధారను ప్రపంచానికి అందిస్తున్న మహామహోపాధ్యాయ శ్రీనల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు రాష్ట్రపతి పురస్కార గ్రహీత. సంస్కృత భాషా పండితుడు శ్రీ భాష్యం విజయసారథిగారు, స్వేచ్ఛాకవిత్వాన్ని రాస్తున్న మాదిరాజు రంగారావు, తిరుగబడు కవుల్లో ఒకరైన రాజలోచన్, రణవిజయం, వలుపుతలుపులు, సింధు లాంటి కవితా సంపుటాలను అందించిన శీలం రాజేశం. లాల్‌బనో గులామి ఛోడో అని చెప్పిన యన్.కె.రామారావు, దాదాపు

28కి పైగా విమర్శనా గ్రంథాలు రచించిన సాహిత్యాకాశంలో సగం విమర్శన గ్రంథానికి కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారాన్ని పొందిన సుప్రసిద్ధ విమర్శకురాలు మానవతావాది కాత్యాయిని విద్మహే, గానడోల, తెలుగు విజయం వంటి రచనలు చేసిన ఆవాల దామోదర్‌రెడ్డి, అలవోకగా అనువదించి అనర్గళంగా రాయగల దేవులపల్లి సుదర్శన్ రావు గారల సేవలు మరువలేనివి.

స్మృతిధార కవి రామాచంద్రమౌళి ప్రకృతి జలప్రవాహం నిక్వణ బాధాలను, వేదనలను అనుభూతులను అక్షరబద్ధం చేసిన వచన కవి. ఓ అస్తమయంలోంచి ఓ ఉదయం ఉండి తీరుతుందనే ప్రగాఢమైన విశ్వాసం ఆయనది, మంచి కథకుడు కూడ, దాదాపు పది కవితా సంపుటిలు, అనేక కథా సంపుటాలు ప్రకటించారు.

శాంతికపోతాన్ని చూసి
ప్రతి బంధూక్ లొట్ట లేస్తుంది పొరపాటున శాంతి ఎక్కడైన
ఏ దేశపు చెట్టుకొమ్మనో ఏ తీరపు చల్ల గాలినో
తన ధవళాంచితపరుచుకొని
ఆదమరచి నిద్రించిందా చాలు
తూపాకి వికటాట్టాహాసం చేస్తూ...
పావురం విలావిలా తన్నుకుంటేనే...

తుపాకి శాంతిస్తుంది. అంటూ ఎగిసిన 'అలలు' చూసిన 'పలకరింత' ఖండాంతర కవి వి.ఆర్. విద్యార్థి సూటిదనం పదునెక్కిన భావంతో కవిత్వం సైనిక కవాతై ఈ వీధుల్లో సంచరిస్తూనే ఉంది.

ఇంకా జయ్యారం మురళీధర్‌రావు గారి గడ్డిపూలు. నవతరానికి నాంది (నాటకం) వెలుగు రేఖలు కవిగా 32కు పైగా పుస్తకాలు వెలువరించిన తక్కెళ్ళ బలరాజు. మధుర, శిఖరం, నిరంతరం వంటి గ్రంథాలను ప్రటించిన డా॥టి.శ్రీ రంగస్వామి, డా॥పల్లేరు వీరస్వామి, వరదాచారి, మంతెన అండాలు, పార్సీ వెంకటేశ్వర్లు, నెల్లుట్ల రాధాక్రిష్ణమూర్తి, తల్లి కోడి హెచ్చరిక వ్రాసిన సుంకరనేని రమేష్, శాంతియాత్ర రచించిన మల్యాల మనోహర్ రావు, నిశ్శబ్ద రూపాలు ఎ.వి.నరసింహరావు వీరంతా వరంగల్లు సాహిత్యానికి హితోదిక సేవ చేస్తున్న వారే కావడం గమనార్హం. అక్షరాల్లో అనంతం, అక్షర చిత్రాలు, యువస్వరం మొదలగు కవితాసంపుటల ద్వారా ఇక్కడి యువ కవులకొక వేదికై సాహితి వ్యాసంగం కొనసాగిస్తున్న నమిలికొండ బాలకిషన్ రావు గారి కృషి కొనియాడదగినది

వేయి నదుల వెలుగు, వెలుగు నగల హంస, చలువ పందిరి వంటి కావ్యాలను అందించిన డా॥ అనుమాండ్ల భూమయ్య గారు కవిత్వం చదివే తీరు ఆనందంగాను,

ఆహ్లాదంగాను, భక్తిజిజ్ఞాసువులకు అమృతంగా ఉంటుంది.

ఉదాసినత నేరం ఉదాసినత నేరం
మూలాలు కదలాలి మూలాలు కదలాలి
మూలలేంటో దేశం దేశమంత తెలియాలి
వెళ్ళే చేట్లైన కొత్త చిత్రం గీయాలి
దేశ పటం మీద పల్లెలు రాజధానులవ్వాలి
ఇక మీద చరిత్ర పల్లెల్లో కూర్చోని వ్రాయాలి. సిద్దంత కర్తల్లారా

భోక్తల్లారా వేళ్ళు మాట్లాడే నేల ఇది అంటూ... ఒక తీవ్ర హెచ్చరిక చేస్తూన్న కవి దర్భశయనం శ్రీనివాసాచార్య జీవనవీచిక, ప్రవాహం, ముఖాముఖి, వేళ్ళు మాట్లాడే వేళ వంటి కవితా సంపుటాల ద్వారా జనసంద్రంలోకి చొచ్చుకపోతూ జీవితంలోని అన్ని పార్శ్వాలు ఇవ్వాల్టి కవిత్వానికి కావాలని తీర్మానిస్తున్న కవిగా పరిచయం చేసుకున్నారు.

ఓ యిజాన్ని ఫాలో అవడం కన్నా
బుద్ధితక్కువలేదని మీరంటే
నిజాన్ని ఫాలో అవడం కూడా

బుద్ధితక్కువే అని నేనంటే నిజాన్ని పలికి చూడండి... ఎక్కడో ఏయిజం మూలలో దాక్కుంటాయని పలికిన వరిగొండ కాంతారావు ఉద్యానం. గగనం, ఝురీ, సంద్రం, దోస్తానా, అనలానిలం, ప్రణవం లాంటి సంపుటాల కవి, కథకుడు. ఏలికకొక లేఖ, పంచాంగాన్ని నమ్మడం ఎలా! దేహమన్నది భ్రాంతియేనా లాంటి గేయ శతకాలను కూడా వీరు వెలువరించినారు.

"మట్టినీ చెట్టునీ నమ్మినవాళ్ళనీ, మొలకెత్తే విత్తనాలని ఎన్నడు నిర్లక్ష్యం చెయొద్దని చెబుతూ నిజాల్ని మాట్లాడ్డానికి వెరపెందుకు" అని భావిస్తున్న కవి పొట్లపల్లి శ్రీనివాస రావు. "ఉనికి పోరాటాలు మరో ఉనికికి ఎసరు పెడుతున్నందుకు అనివార్యంగా "మూడో కన్ను' తెరవడానికి సిద్దపడుతున్నం" అంటూ సామాన్యజనం పక్షాన వకాల్తా పుచ్చుకున్న ఈయన చైతన్య గులాబీలు, మూడోకన్ను' నడిచి వచ్చిన దారి కవితా సంపుటాలను వెలువరించి తనదైన కోణంలో కవిత్వాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేస్తున్నారు. తెలంగాణ ఉద్యమ ప్రస్థానంలో 'దెబ్బతిన్న బెబ్బులి' స్వీయకవిత్వం, వంటి కవితా సంకలనాలువెలువరించాడు. కవితావార్షిక సంపాదకులు కూడా. ఉద్యమకాలంలో ఊపిరి కవితా సంకలనానికి ఆనిశెట్టి రజితతోపాటు సంపాదకత్వం వహించారు.

వర్గ దృక్పథం ప్రగతిశీల ఉద్యమ భావజాలంతో విస్తృతమైన కవి కథకుడు వ్యాసకర్త వడ్డెబోయిన శ్రీనివాస్. దుఃఖ భాష, పోస్ట్‌మార్టం రిపోర్ట్ కవితా సంపుటాలు, ముఖచిత్రం, మే 20 యుద్ధగానం, హిమాలయాలెవడ్డతాలై, పడావు, ఝుంగు ఎ కాశ్మీర్, వీరవనం, సమైక్యశాపం

లాంటి ఎనిమిదికి పైగా ధీర్ఘ కవితలు వెలువరించారు.

మట్టిలో పుట్టి మట్టిలో పెరిగి మట్టికోసం పోరాడేవారిని మట్టిపాలు చేస్తే ఆ మట్టే నిన్ను శపిస్తుందని 'మట్టిశాపం' వినిపిస్తునే జ్ఞాపకాల ఊటలను అనుభవాల జీవితాలను 'మౌనజ్ఞాపకం'గా మలచి మానవత్వపు రహదారులు నిర్మించే ప్రయత్నం చేస్తున్న కవి కాంచనపల్లి రాజేందర్ రాజు. "జీవన మధురిమ"తో "మళ్ళీ మనం కొత్తగా" జీవించాలని కోరుకుంటున్నాడు.

సహనసూక్తుల తాళ పత్రాల్ని తగలబెట్టేస్తు, ఊడిగాల్లో శక్తులుడిగిపోయిన అశక్తులు లావాలై విస్ఫోటిస్తున్న ఆడగాలి తీవ్రతను చెమట చెట్టులో చూపుతున్న అనిశెట్టి రజిత, అణచబడ్డజాతుల వేదిక మాత్రమే కాదు ఉద్యమజీవి కూడ. నేనొక్క నల్మమబ్బునవుత, గులాబీలు జ్వలిస్తున్నాయి, ఉసురు అనగనగా కాలం కవితా సంపుటాలు, ఓ లచ్చవ్వ, మార్కెట్ స్మార్ట్ శ్రీమతి దీర్ఘ కవితలు గోరంతదీపాలు నానీలు, దస్తఖత్ హైకు, మట్టబంధం కథ సంపుటి ప్రకటించిన కవయిత్రి.

మనసుభాష కవిత్వం, మనసు మనసు మధ్య కథాసంపుటి, రమణీయం కార్టూనులు వెలువరించిన సీనియర్ కవయిత్రి నెల్లుట్ల రమాదేవి గారు వర్తమానంలో అందరిని మెప్పిస్తున్న కవయిత్రి.

డా॥వి.వీరాచారి గారు అభ్యుదయ కాముకుడైన కవి రచయిత విమర్శకుడు. పసిడిమొగ్గలు, సిరిమల్లి సిలకబావ, అనంత పయనం, మనిషిగా బతకాలని ఉంది, రాగాలు-భావాలు వంటి గేయకవితా సంపుటాలు, వర్ణమాల పేరుతో నాటికలు, సమిధలు కథా సంకలనం వెలువరించాడు. అంతేకాకుండా కళారవీ-కవీ, వ్యాసవిరంచి వంటి వ్యాస సంపుటాలు, తెలుగునాట సాంస్కృతిన పునరుజ్జీవనోద్యమాలు- కవులు రచయితలు పరిశోధన గ్రంథం- ఇత్యాదులు వెలువరించారు. తెలంగాణ మలిదశ ఉద్యమ కాలంలో వరంగల్లు రచయితల ఐక్యవేదిక కన్వీనర్గా తెలంగాణ ఉరుములు మెరుపులు, ఓరుగల్లు కథలు, ఆచార్య వాసిరెడ్డి భాస్కరరావు గారి రచనలు-సమాలోచన, అంపశయ్య నవీన్ జీవితం-సాహిత్యం వంటి అనేక గ్రంథాలకు సంపాదకత్వం వహించారు.

వికలాంగులు అత్యంత ప్రతిభావంతులు అంటూ కాలాన్ని గెలుస్తూ, కవితా సంకలనం వెలువరించిన బిల్లా మహేందర్ పోరుగానం గేయాలు, పిడికిలి, గెలుపు చిరునామా కవిత్వం ప్రకటించాడు.

షాడో, నెగడు, గ్లోబల్ కవితాసంపుటాల ద్వారా ముందుకొచ్చిన డా॥చింతం ప్రవీణ్ సామాజిక దృక్పథంగల ప్రగతి శీల భావుకుడు.

'ఉద్యమం నిలిపిన అక్షరం' ద్వారా పిట్టసాంబయ్య, ఆనుగ్రలు, తెలంగాణజంగ్ లాంటి ఉద్యమ కవితా సంకలనాల ద్వారా నల్లెల రాజయ్య ముందుకొచ్చారు.

"కవిత్వం ఎందుకు నాన్న?" అని ప్రశ్నించిన అమ్మతో "నువ్వు నాకు రెండు నేత్రాలనిచ్చావు కవిత్వం నాకు అంతర్‌నేత్రాన్నిచ్చింది" అని ప్రకటించిన కోడూరి విజయకుమార్ ఆవేశపు జ్వాలకు ఆవేదన తీరానికి మనుషులకింత ఆలోచన పంచడానికి 'వాతావరణం' సంపుటి ద్వారా ఒక కాల ప్రవాహంలోకి అడుగుపెట్టారు. 'ఆక్వేరియంలో బంగారు చేప' వెలువరించారు.

కన్నీటి చుక్కలో దాగిన కవిత్వాన్ని మరియు మానవ సంబంధాన్ని పెంచుకోవాలన్న తపనతో పిల్లల భుజాల మీద బరువు దేశన్నే మోస్తున్నట్టుంటుందిలాంటి దృశ్యచిత్రాల్ని మలిచి ఒక పాజిటివ్ థింకింగ్‌తో కవిత్వాన్ని బలంగా చెప్పగల శేషభట్టర్ వెంకటరమణ అంతకన్నా బలమైన 'స్పృహ'తో ముందుకు వచ్చారు.

"ఎవడిహక్కుల పక్కరా ఈ నేల... అంటూ నిప్పులు చెరిగిన 'నిప్పుకణిక', 'రహస్య చిత్రం" రచనలతో డాక్టర్ బన్న అయిలయ్య అణచబడ్డ జాతుల నేటివిటిని ప్రకటించారు. కాబట్టే ఒక బలమైన కవిగా సంయమనతగల కవిగా విమర్శకుడిగా ఐడెంటిఫై అవుతున్నాడు.

'ప్రశ్న గుర్తు ఎవరు కనిపెట్టారో ఏమో గాని కొడవలిగా ఉంటుంది. పరపరా కోస్తుంది. అంటూ అలారం గంటను మోగించి జనాన్ని మేలుకొలుపు గీతాలతో తట్టి లేపుతున్న టి.జితేందర్ రావు సునిశిత అధిక్షేపణతో తనదైన కొత్త ఒరవడితో కలాన్ని నడుపుతున్నకవి.

కవిగా పండితునిగా సాధికారిక విమర్శకుడిగా ఘనతకెక్కిన గిరిజా మనోహర్ బాబు గారిపై వచ్చిన "సత్కృతి" సావనీర్ ఒక అరుదైన గ్రంథం. 'గోపికా వల్లభ', శ్రీసమర్పణం తదితర లోతైన కావ్యాలను క్రపటించిన ఆచార్య యస్.లక్ష్మణమూర్తి గారు తెలుగు ఆంగ్ల సంస్కృత భాషా కోవిదుడు.

తెలుగు నాటకరంగ చరిత్రకు అక్షరాకృతి కల్పించిన ఆకురాలిన వసంతం, దేవతలెత్తినపడగ, చలిచీమలు, మొదలగు పదిహేను వరకు నాటకాలు రచించిన డా॥పి.వి.రమణ అగ్నిమూర్తులు, పృథ్వీసూక్తమ్, అగ్నిగర్భ, కవితాసంపుటాలతోపాటు అనేక అనువాదాలను వెలువరించి భారతీయ తాత్వికచింతనను పెంచిన భండారు సదాశివరావు. అంటరానివాళ్ళు, అమ్మయ్యోగాంధీ బతికాడు, గుడుంబాసురుడు వంటి నాటకాలు రాసిన డా॥వనం మధుసూదన్ తెలంగాణ మాగానంలో విరాజిల్లిన నాటక రచయితా, ప్రయోక్తా.

తెలంగాణ ఉద్యమ సమయంలో 'తెలంగాణ పద్యకవి'గా పరియమైన 'వెలపాటి రాంరెడ్డి' గారు తెలంగాణ కావ్యం, వీరతెలంగాణ, తెలంగాణ పద్యమంజరి, తెలంగాణ నడుస్తున్న చరిత్ర, కోటిగాయాల మౌనం వంటి పద్యకావ్యాలు రచించారు. తెలంగాణ సాయుధ పోరాటం అనే మోనోగ్రాఫ్‌ను వెలువరించారు. అష్టావధానాలతో తెలుగునేలంతా పాకిన డా॥ ఇందారపు కిషన్‌రావు గారు 'కవిత నా సమత' శ్రీనివాస శతకం' 'అవధాన విద్య' కావ్యాలను వెలువరించారు.

'వాన మబ్బుల కాంతిఖడ్గం' తంగేడు జున్ను, 'మరణ శాసనం' 'చుప్‌కే చుప్‌కే'

అంటూ అరంగేట్రం చేసిన డా॥లంకా శివరామప్రసాద్.. మాడ్రన్ భగవద్గీత, సౌందర్య లహరి, పోతన భాగవతం సమగ్రంగా ఆంగ్లంలోకి అనువదించిన దిట్ట. అంతేకాదు గ్రీకు, లాటిన్, పర్షియన్, రష్యన్ సాహిత్యాలను తెలుగులోకి అనువదించారు. స్వప్నశాస్త్రం, జ్యోతిశాస్త్రం సైన్సుతో అన్వయించిన సాధికారిక గ్రంథాలతో పాటు దాదాపు 75 పైగా వీరి రచనలు వెలుగు చూసినవి. ఈ వ్యాస రచయిత, రామా చంద్రమౌళితో కలిసి 'మూడు స్వప్నాలు ఒక మెలకువ' వచన కవిత్వం ప్రచురించారు.

అద్భుతమైన తెలంగాణ నుడికారంతో ఆలోచనాత్మకమైన కథలతో సి.జయపాల్ రెడ్డిగారు 'స్వాప్నికుడు' కథాసంపుటిని వెలువరించారు.

'అవుటాఫ్ కవరేజ్ ఏరియా' అంటూ అణచబడ్డ జాతుల ప్రతిధ్వనిగా నిలిచిన 'పసునూరి రవీందర్ తెలంగాణ రాష్ట్ర సాధన పోరాటగీతాలపై పరిశోధన చేశారు. వేణుగోపాల్ శతకం, యాదగిరి లక్ష్మినర్సింహశతకం, శ్రీ రామ చరితం నెల్లుట్ల రాధాకిషన్‌రావు వెలువరించారు.

కథకుడిగా, కవిగా డా॥ కె.ఎల్.వి. ప్రసాద్, 'కెఎల్వీకథలు', అస్త్రం, హగ్‌మికిక్, కథలు వెలువరించారు. 'పదును', 'స్పందన', సిర్ఫ్ హైదరాబాద్ హమారా 'కవిత్వాన్ని ప్రకటించిన 'నిధి' (మారేడు కొండ బ్రహ్మాచారి), 'చినుకు' పబ్బా శ్రీశైలం, రంగు చక్రపాణి రంగుల కవిత, తెలంగాణ శతకాలు వ్రాసిన నల్లా ఉపేందర్, ప్రస్వాజి పేర కవిత్వం వ్రాసిన జి.ప్రభాకర స్వామి, ఆడెపు చంద్రమౌళి, పిట్టా సత్యనారాయణ పద్యాలు, మాచర్ల సారయ్య, దెహెగాం సాంబయ్య, ఎలక్ట్రాన్, టి.పద్మలత కథలు, హాజీనూరాని, నూర శ్రీనివాస్, శెంకేసి శంకరరావు రచనలతో వరంగల్ నేల సాహిత్యం సంపద్వంతమౌతున్నది. సలసల మరుగుతున్న జ్ఞాపకాల గొంతు/రుద్ధమై దగ్ధమై కంపించే రుద్రవీణై/ఇప్పటికిప్పుడు ప్రాణమైన పోని పాట మానక... అంటూ పాట రహస్యాన్ని పరిచయం చేస్తూన్న ఆవేదనస్వరమై దిగులు మేఘాల మీద రెక్కలున్న పాటను వినిపిస్తున్న గొంతు తీవ్రతతో "తలవంచని అరణ్యం" మై జనారణ్యంలో ప్రవేశించాడు అన్వర్. "ముఠ్ఠి" కవితా సంపుటి 'బక్రి' కథాసంపుటి ప్రచురించిన అన్వర్ పొయట్స్ ఈజ్ ఎ గ్రేట్ హిలర్స్ అనుకుంటూ శ్వాసించే ప్రయత్నం చేస్తున్నాడు.

రకరకాల సంఘర్షణలు దోపిడీలను చూస్తూ సహించలేక తమ భావావేశానికి కవిత్వాన్ని ఆలంబన చేసుకొని ఎదుగుతున్న ఒద్దిరాజు ప్రవీణ్ కుమార్ "దుఃఖానంతర దృశ్యం" ప్రచురించాడు.

మనుషుల మధ్య సంకుచిత అడ్డుగోడలు, అర్థంకాని అలసటలు అసత్య జీవితాలు దగ్ధమైపోవాలని ఆశిస్తూ "కలలకుంచె"తో జీవితచిత్రాలు మలచి "కలల కొలిమి" వంటి కవితా సంపుటాలతో కాలంపై తనదైన సంతకం చేసి ఎందరో యువ కవులకు స్ఫూర్తిగా నిలిచిన (అపరాజిత) పొట్లపల్లి ధరణీశ్వర్ రావు గారి కృషి చెప్పుకోదగ్గదే.

అరుణ కీర్తి గేయాలు, పోరుపిడికిలి ప్రకటించిన అరుణ కీర్తి పతాక, బండారి రాజ కుమార్ గరికపోచ, నిప్పుమెరక, వనపర్తి పద్మావతి "అనురాగ వీచికలు, సగటు మనిషి, నీవే నా ఆలోచనలు," "జోగు అంజయ్య పల్లెలన్ని మల్లెలాయె," జంగా వీరయ్య 'ప్రాస కెరటాలు', నాగబెల్లి జితేందర్ పోరుగింజలు, రక్తాని శ్రావణ్ కొత్త వెలుగులు, తొలిపొద్దు సంపుటాలు. ఇంకా...అసమసమాజ లోతుపాతుల్ని గమనించి బలంగా స్పందిస్తూ తనదైన శైలిలో రచనా వ్యాసంగం కొనసాగిస్తున్న కవయిత్రి కథకురాలు దేవులపల్లి వాణి, సీనియర్ కవయిత్రి బండారు విజయ, కె.రామలక్ష్మి, అనువాదకులు, కవులు యం. రాజేశ్వర్, దామోదర్ రావు పేర్కొనదగినవారు.

అదేవిధంగా జయవీర్రాజు, బాసిరి సాంబశివరావు, డా॥కె.లింగారెడ్డి, గొడిశాల సదానందం, యస్.ఎన్. చారి, ఒద్దిరాజు వెంకటరామారావు, నామాని సుజనాదేవి, ఆర్యూబ్, మిట్టపల్లి శివాజి, యన్.రామేశ్వర్ రాజు, టి.రామస్వామి, ప్రపంచశాంతి పండుగ కవి సిరాజుద్దీన్, 'యుద్ధం' వంటి కవులు రచయితలు రాజ్ మోహన్ 'ఇంకా తెలవారలేదు' కవితా సంపుటి వెలువరించిన శివపురం శైలజ వంటివారి సాహిత్య కృషిని బేరీజు వేసుకోవలసిందే. సాహిత్య సృజనతో పాటు వివిధ కళా రూపాల ద్వారా జన జీవితంలోకి చొచ్చుకుపోయిన వల్లంపట్ల నాగేశ్వర్ రావు, దాదాపు నలభైకి పైగా సాహిత్య తెలుగు హిందీ సంపుటాలకు ప్రకటించిన డా॥ఆర్.మాధవరావు గారు ఒక మొబైల్ ఎన్సైక్లోపిడియా, కథా రచయిత్రి సూర్యముఖి గారిని, కదులుతున్న గ్రంథాలయం శ్రీ కె.యస్.ఆర్.జి. ప్రసాద్ గారిని, నడుస్తున్న సాహిత్యఖజానా శ్రీ నాగిళ్ళ రామశాస్త్రి మొదలగువారంతా ఇక్కడి సాహితిక్షేత్రానికి దుక్కులు దున్ని విత్తనాలు చల్లుతున్నవారే. గోదావరి సాహితీ మిత్రులుగా కొత్తగా పరిచయమైన సొన్నాయిల క్రిష్ణవేణి, వంగాల సంపత్ రెడ్డి, కేతిరెడ్డి యాకుబ్‌రెడ్డి, డా॥కందాల శోభారాణి ప్రభృతులు ఉన్నారు. వీళ్ళేకాక జ్ఞాపకాల దొంతరలో చిక్కుపడిన మరెందరో...



# రాజ్యంలో భాగమై ఓ రామచిలక

- వేల్పుల నారాయణ

రాజ్యంలో భాగమై - ఓ రామచిలకా
రాగాలే పలికేవా - నా రామచిలకా
ప్రజలకు దూరమై - ఓ రామ చిలకా
పాటలే రాసేవా - నా రామ చిలకా ॥రాజ్యంలో॥

ప్రజల చెట్టు మీద - బ్రతుకంత గడిపేవు
చిగురుటాకులు దిని - శక్తినే పొందేవు
పనిపాట బాణీల - పదగతులే నేర్చేవు
కూని రాగం దీసి - గొంతునే పెంచేవు
చెట్టునే మరిచావా - ఓ రామచిలకా
గుట్టనే చేరావా - నా రామ చిలకా ॥రాజ్యంలో॥

గుట్టపైనా రాజు - దిట్టంగా ఉన్నాడు
మాయమాటలతోని - మర్మాలు చేస్తుండు
ప్రజలకు హామీల - పల్లకీ ఇస్తుండు
అమలేది అన్నోల్ల - అంతునే జూస్తుండు
అలాంటి రారాజు - ఓ రామచిలకా
ఆదర్శమేలాయే - నా రామ చిలకా ॥రాజ్యంలో॥

ఉద్యమాల స్ఫూర్తి - ఉన్నతున్నంటాడు
ఉద్యమాలు చేస్తే - అణచివేస్తుంటాడు
నిరసించే హక్కింకా - నీకేడిదంటాడు
ప్రజాస్వామ్య స్వేచ్ఛ - పాతరేస్తుంటాడు
నియంత ఆ రాజు - ఓ రామచిలకా

నీకేల వలపాయె - నా రామ చిలకా ॥రాజ్యంలో॥

తిండి పెట్టేరైతు - తిప్పలే పడుతుండు
పంటకొరకు రైతు - అప్పులే జేస్తుండు
గిట్టుబాటు ధర - చెట్టెక్కి పోతుంటె
ధరలకొరకు రైతు - ధర్నాలే జెస్తుంటే
రైతులకు బేడీలు - రాజ్యమే వేస్తుంటె
రైతులకు కన్నీరు - ఓ రామ చిలకా
పన్నీరు నీ బాటా - నా రామ చిలకా ॥రాజ్యంలో॥

కేజీ నుండి పీజి - ఉచిత విద్యాలేదు
ప్రైవేటు బడి ఫీజు - బాదుడింకా పోదు
డబుల్ బెడ్‌రూం - దరిజేరదింకా
ఉద్యోగ హామీలు - ఉట్టెక్కి పోతుంటే
సంక్షోభ పాలనే - ఓ రామ చిలకా
సంక్షేమమేలాయే - నా రామ చిలకా ॥రాజ్యంలో॥

సాయుధ పోరాట - సంస్కృతీ నాదంటు
తండ్రి తాతల త్యాగ - వారసున్నంటావు
కులవృత్తి విధ్వంస - కుట్రల్లో పల్లెలా
కన్నీటి ఊటలే - నా పాటలంటూనే
సర్కారు సంతలో - ఓ రామ చిలకా
సరుకువై పోతావా - నా రామ చిలకా
ప్రజల గొంతుకనంటు - ఓ రామ చిలకా
వంచించ బోకింక - పంచ రంగుల చిలకా ॥రాజ్యంలో॥

# అరువడి బతుకు

ఏదినం నీకెమక్కర పడుతదోనని
దాతి మొద్దుకు పంతా పాత రేసుకొని
డాకలికి కాళ్లు కట్టేసుకొని
ఎద్దుకంటె ముందు
సాలేల్ల నీకు సాకిరి చేస్తే
సాలకరుకు నీవునాకిచ్చేది
బిచ్చ మెట్లాయె !

పండగ లేదు పబ్బం లేదు
చుట్టాళ్లులేరు తీర్థాలు లేవు
పెండిళ్ళకు చావులకు కూడా పోకుండ
పంట చేండ్ల దిష్ఠి బొమ్మోలే
గోడకు కొట్టిన సున్నమోలే
ఊరు కదలకుండ బతుకంతా అనుగ్రనై
ఊతనిస్తే నా ఆకలి తీర్చిందెవరు
దాతి మొద్దుకు పంతా పాతరేసుకొని
డాకలికి కాళ్లు కట్టేసుకొని
సాలెల్ల నీకోసం బతికితే
సాలకరికి నీవిచ్చేది
బిచ్చమేట్లాయె !

నీ వరి కోత్తాండ్లని తెల్సి
పొలంలకచ్చి నాలుగు పంజలుకడ్తే
నీ ఇల్లాలు కళ్లెర్రజేసి
అద్దుదుద్దంటూ - రెండు పంజలు తీసేసె
అదనెక్కడ తప్పు తుందోనని
ఎగిలి బారంగలేసి కొలిమిరాజేస్తి
పొద్దుకరకర పొదవక ముందే
పెద్ద బాడిసే గాల్లోకి లేపితి

ఎదనాగలి బురదనాగలి
ఎదగొర్రు బురద గొర్రు
ఎన్ని మొద్దులుచెక్కితే
ఎంత ఇనుము సాగదీస్తే
ఈ వరి పండింది ?
పనికొచ్చేకాడ నీ వాయె
బిచ్చంపెట్టకాడ నీ ఇల్లాలాయె !

మొన్నటికి మొన్న
మక్కజొన్న కంకులడుగుతే
మీ ఆమె మంచేత్తెగిరి
కర్ర కర్రకో తిట్టు తిట్టుకుంట
గింజలు పెట్టని పరిగెబుడ్డ లేరిచ్చే
మక్కసాలు బెట్టిన నాగలెవ్వడు జేసె
సాల్లల కొట్టిన గుంటుకెవ్వడు జేసె
కలుపు తీసిన కొడవలెవ్వడు జేసె
నీల్లుకట్టిన పారెవ్వడు జేసె
కంసాలోని కష్టం లేకుండనే
మక్క జొన్న పీసు తోడిందా?
కడకు కాల్చుకతినే కంకులకు
కంసాలోడు పనికి రాకుండపాయె
ఎన్నెన్ని చెప్పను... ఏదడిగినా
ఎంగిలి మెతుకులు రాల్చినట్లేనాయె
అయిన నిన్ననినేమీ లాభం
పండుగ పబ్బం లేకుండ
కట్టు బాంచెలా
సాలెల్ల పనిజేసి
సాలకరికి ఫలితం తీసుకోవాలని
కట్టడి పెట్టినోన్ని అనాలి
కులాలు కుల కట్టుబాట్లు పెట్టినోన్ని అనాలి
తాత ముత్తాతల నుండే వచ్చే పద్ధతని
ఈ అరవడి బతుకు నుండి తెగించి
బయట పడని నా చేతగానితనాన్ని అనాలి.

# ధర్మాగ్రహం

-డా॥ రాపోలు సుదర్శన్

తెలంగాణ సాధనకోసమై పుట్టి
ఉద్యమమే ఊపిరిగా జీవిస్తూ, వికసిస్తూ, విస్తరిస్తూ
సాధించిన తెలంగాణలో ప్రభుత్వ పగ్గాలు పట్టి
బంగారు తెలంగాణగా
నిరసనలు లేని తెలంగాణను చేస్తానని
పొమ్మనజాలక పొగబెట్టినట్టు
ధర్నా చౌక్‌ను పాతిక కిలోమీటర్ల దూరానికి తరలిస్తే
హక్కులను ఉక్కుపాదంతో తొక్కడంగాకేమౌతుంది ?
జీవనదుల్ని ఎండగొడితే ఎడారేర్పడ్డట్టు
హక్కుల సూర్యున్ని లేకుండాజేస్తే -
అన్యాయపు చీకటి అలుముకొకేమౌతుంది ?
జనం గొంతు నొక్కాలనిజూస్తే రెచ్చిపోకేమౌతారు ?
తెలంగాణ జనం, ఉద్యమ ప్రజలే అనాదిగా
ఇమ్మమజేశ్వరాధము"లకు తన కావ్యాన్ని
అంకితమివ్వనన్న విప్లవ కవి పోతన వారసులం
పాలకుల అధికారుల్ని ధిక్కరించిన సర్వాయి పాపన్న
లక్షణాల్ని పునికి పుచ్చుకున్న వాళ్ళం
శారీరకంగా జైళ్ళో బంధించినా
"నా తెలంగాణ కోటి రతనాల వీణ" గా
కీర్తిస్తూ తిరగబడిన కవి జాతీయులం
తన గొడవనే తెలంగాణ గొడవగా జెప్పిన
కాళోజీకి సాహితీ సోదరులం
పాలకుల అకృత్యాలను ఎదిరించిన వీరవనిత
చాకలి ఐలమ్మ పోరాటపటిమను జీర్ణించుకున్నోళ్ళం
అరవై ఏళ్ళుగా తెలంగాణాను
మోసపూరితంగా ఎంత దగా చేసినా
జయశంకరాదుల అవిశ్రాంత పోరాటంతో
ప్రాంతేతరులను పారదోలినం
ఇక ప్రాంతీయుడే మోసానికి పూనుకుంటే పాతరేస్తం
ప్రభుత్వమా! ఖబడ్దార్ !!
ధర్నాచౌక్‌ను తరలించేయత్నం మానుకో !
లేకుంటే మూల్యం చెల్లించక తప్పదనుకో !!

# యుద్ధం

-వంగాల సంపత్ రెడ్డి

నేను ఎట్లుండాలనుకున్నానో
అట్లుండలేక పోతున్నా

నేను ఎట్లుండాలనుకున్నానో
అట్లుండాలని ప్రయత్నించిన ప్రతీసారి
వెక్కిరిస్తున్న సమాజమే నా కళ్ళముందు

గగనాన్ని తాకాలనుకున్న ప్రతీసారీ
పాతాళంలోకి జారిపోయాను

స్వేచ్ఛగా పక్షినై ఎగరాలనుకున్న ప్రతీసారి
ఈ నేల మీద అచేతనంగా కూలబడిపోయాను

ఏటికి ఎదురీదాలనుకున్న ప్రతీసారి
ఏట్లో నే కొట్టుకుపోయాను

ప్రశ్నై నిలబడాలనుకున్న ప్రతీసారీ
మూగవానిగా మిగిలిపోయాను

ఆయుధమై ప్రవహించాలనీ అనుకున్న ప్రతీసారి
అంగట్లో సరుకుగా మారిపోయాను

వర్షమై కురవాలనుకున్న ప్రతీసారి
చినుకు రాల్చని మేఘంగానే తేలిపోయాను

పిల్లగాలి మోసుకొచ్చే పరిమళాన్ని కాలేక
సెలయేరులా పరుగెత్తలేక
నేను మనిషిగా బతకలేకపోతున్నందుకు
వెక్కి వెక్కి ఏడ్చిన ప్రతీసారి
ప్రపంచీకరణ సాలెగూడు
తనలో
నన్ను ఇముడ్చుకుంటున్నది

అయినా
ప్రతీసారి ప్రకటిస్తూనే ఉంటాను
ఫినిక్స్ పక్షే నా ఆదర్శమని

# పుట్‌పాత్ బతుకుల్లో... పూటెట్ల గడుసునో...

-టి. మద్దిలేటి కల్వకోలు

పొద్దున బువ్వుంటే - మాపున బువ్వుండదు
మాపున బువ్వుంటే - పొద్దున బువ్వుండదు

పూటెట్ల గడుసునో... పుట్‌పాతు బతుకుల్లో...

1. తోవాల ప్రక్కల్ల - తోపుడు బండ్లల్ల
అరటి జామాలు - అంగూరు యాపిల్లు
దానిమ్మ బత్తాయి - సపోట సంత్రాలు
నారింజ నిమ్మలు - నేరేడు మామిల్లు
కడగండ్లను కన్నీళ్లను - కడుపులో దాసుకొని
పండ్లను అమ్ముకొని - ఇల్లు గడిపె ఓరన్న

మురిగినవి ఎన్నిరా... ముడిగినవి ఎన్నిరా
ముద్ద బువ్వ దక్కనికి... వడ్డి అప్పు ఎంతాయెరా.. ॥ పూటెట్ల ॥

2. బస్టాండు ముంగిల్ల... మారెడు స్థలముల
నడుమెత్తు మంచేసి... నాన్పిన సంచేసి
కలరు కలరు మల్లేలు... కనుకాంమురా పూలోసి
బంతి చేమంతీలు... బంగారు మల్లేలు
చారెడు పూలతో... మూరెడు మాలల్లి
పండుగలకు పబ్బాలకు... పెండ్లిళ్ళకు అమ్మెటోడ
కోమలి కొప్పులకు... కోరిన పూలమ్మి
కొలువైన దేవుళ్లకు... కలరైన పూలేసి
పూలెన్నో అమ్ముకొని... ఇల్లు గడిపె ఓరన్న
పూలుకొని అమ్మంగ... లాభమెంత లాసెంత

వాడినవి ఎన్నిరా... మాడినవి ఎన్నిరా...
ప్లాస్టిక్ పూలతో... పాడైన బతుకెంత... ॥ పూటెట్ల ॥

3. పట్టణాల బాదుల్లో... పొట్టగడువ బాదల్తో
బట్టల శాపు ముంగిళ్ళ... బతుకు గడువ తమ్ముళ్లు
షోరూమ్స్ ముంగిళ్ళ... షోకేజి బొమ్మలై
బఫూన్స్‌గ ఒకరు... బెలూన్స్‌లో ఇంకొకరు
ఎత్తేత్తు కట్టెలు... కాళ్లకు కట్టుకొని
చిరు పాటకు చిందేస్తూ... చిత్రంగ ఆడెటోళ్లు
మల్టీనేషన్ కంపెండ్ల... మాల అమ్మె ఓరన్న
మాటరాని వెతలల్లో... మాయమైన బతుకెంత

నెల జీతం ఎట్లారా... నీ ఇల్లెట్ల గడిచెరా...
పిల్లలను సాదనికె... అల్లాడిన బతుకెంతరా... ॥ పూటెట్ల ॥

4. కొలిమి లాంటి ఎండల్లో... కొబ్బరి బొండల మ్మెటోడ
పుచ్చకాయ కర్బూజ... పచ్చలు గోసి అమ్మెటోడ
చెరుకు గడ తుంచేసి... చక్రంలో నలిపేసి
చెరుకు రసం అమ్ముచూ... సేదతీర్చె ఓరన్న
ఆరెంజు అంగూరు... ఫైన్ ఆపిల్ పండ్లతో
పండ్ల రసం జ్యూసమ్మి... బతుకు గడిపె ఓరన్న
కొకకోల వచ్చేసి... కొబ్బరిని మింగేసె
జ్యూస్ ప్యాకట్స్ వచ్చి... జ్యూసు బండిని మింగేసె.. ॥ పూటెట్ల ॥

5. సాయంత్రం వేళల్లో... సామాను సంచుల్తో
అద్దాల మండ్లతో... అడ్డమీద ఆపేసి
బర్నారు పొయ్యిబెట్టి... బాండిలో నూనోసి
బజ్జీలు బోండాలు... వడలేసి అమ్మెటోడ
కాలేటి పెన్నంపై... కట్‌లెట్ చేసమ్మి
సాసర్లో సాంబరోసి... గప్‌చిప్‌లు ముంచిస్తూ
సల్లబడె పొద్దుల్ల... సరదాల మాటల్లో
సంతృప్తిగ తినిపిస్తూ... సంతషించే ఓరన్న...
గ్యాసెంత కాలిందో... గ్యాదరెంత అయిందో
నూనె, పిండి కెంతాయె ... తిండికెంత మిగిలేరా... ॥ పూటెట్ల ॥

6. తోవ గోడ నీడన... గోనె సంచు పరుచుకొని
సానెరాయి వేసుకొని... పట్టుగార రంపంతో
గూటం ఆరె మిగ్గతో... గుండ్రాని స్టాండుతో
ఇనుప సీలల డబ్బితో... సూది దారం కండెతో
తెగిపోయిన చెప్పులను... తెలివితో (ముడుచుచూ) కుట్టిస్తూ
ఆరిపోయిన బూట్లకు... అందంగా రంగేస్తూ...
చేయిజాచి అడుగంగ ... చిల్లెర ఎంతిచ్చిరో
చిల్లెర డబ్బుతో... ఇల్లెట్ల గడిసెనో
బాటా షూ కంపెనితో... బతుకు ఆగం చేసెనో
పారగన్ కంపెనోడు... పొట్టగొట్టి పోయెనో... ॥ పూటెట్ల ॥

7. తట్టల్ల బుట్టల్ల... కాయగూరలు నింపి
ఎదురు బొంగు మంచంపై... బెంచీపై పెట్టుకొని
కాయగూరలమ్మోయని... ఆకుకూరలమ్మోయని
మాటి మాటికరుచుచు... అమ్మెటి ఓయమ్మ
రైతులతో కొని అమ్మగా... లాభమెంత నీకొచ్చె
పాడైనవి ఎన్నిరా... పాలిపోయినవి ఎన్నిరా
తై బజార్ చిట్టికి... కట్టేటి సొమ్మెంత
మారు బేరం శేటుకి... వడ్డెంత కడితివో...
పుట్టెడు దుఃఖాన్ని... పొట్టలో దిగమింగి
బుట్టిదంద చేసెతల్లి... బువ్వకెట్ల గడిసిందో... ॥ పూటెట్ల ॥

అభ్యుదయ

# క్యాస్ లెస్ ఈగిల్

-వడ్డెబోయిన శ్రీనివాస్

వెన్నుపోటు పెద్దనోటుకు
వెల వెలల పెద్దలనోటు పుట్టాక
చెమటచుక్క
చేతులు రాలాయి కాళ్ళూ కరిగాయి

నల్లధనం మూతిమీది మీసం మెలేసింది
నకిలినోటు అమృతం తాగి నవయవ్వనైయ్యింది

పుట్టలోంచే నల్లపాములు
జాతీయజెండా తెల్బయ్యాయి
చెమటవాసన ధనమే తెల్లబోయింది

తప్పెడి గురే పెట్టినప్పుడు
పావురం నేల కూలింది
పెద్దల నోటు క్యాస్ లెస్ ఈగిల్ గూడైయ్యింది

డాలరైజేషన్ దాగుడు మూతల్లో
గుంజుకొచ్చుకున్న గాంధీ అద్దాల చుట్టూ
గాడ్సేకాపలున్నట్టు
కమలాల చెట్టాపట్టాల్లో
నల్లదొరలు తుప్పిర్ల తుగ్లక్ ను
నయనానందకరంగామో(ది)స్తుంటే
'క్యూ' కట్టిన తెల్లనోటు
కూలిపోయింది
చేతలోడు చెల్లా చెదురైతే
చూసెటోడు సుడిగాలై చుట్టబెట్టుకున్నడు
న్యాయం ఇంట్లో పైస నల్లపూసైతే
నేరం ఇంట్లో పంచభక్ష్య పరమాన్నాల్లా
వడ్డించిన కొత్తనోట్ల కొండలు

కురిసే వెన్నెల కోసం నోరు తెరిచిన
ఫుట్‌పాత్ మీది కలలతోట
పుట్టెడు దుఃఖంలో కాలింది
సన్నకారు సరుకు వీధులన్నీ
చలిజ్వరంతో ముడ్చుకున్నాయి

నల్లకుబేరుల హార్టుపుల్లయ్యింది
తెల్లకు చేలులకు హార్టెటాకొచ్చింది

తస్మాత్ జాగ్రత్తా !
ఇక్కడ మోదీ పాలిస్తున్నాడు పాలిస్తున్నాడు
నల్లధనం నహిహై నహిహై నహిహై
అదీ ఇదీ అవతల్దీ లోపల్దీ అంతా
తెల్లధనంహై తెల్లధనంహై తెల్లధనంహై

# చేనేత జీవితం

- ఆదెపు చంద్రమౌళి

ఆ॥ వె॥ పద్మశాలివారు పరమేశు కరుణచే
పుణ్యకర్ములైరి పుడమియందు
చేవ గల్గియుండి చేనేత వృత్తిలో
ప్రజ్ఞ జూపినారు ప్రజల కొరకు...

ఆ॥ వె॥ వాసిగాంచినారు వస్త్రనిర్మాతలు
పట్టువీడకుండి ప్రతిభమీరి
అగ్గిపెట్టెలోన అలరియుండునటుల
చీరె నేసినారు చిత్రముగను...

ఆ॥ వె॥ నేత వృత్తిలోన నేర్పరులైనను
వెనుకబడిన కులము వెతలు గల్గి
పనికి తగిన ఫలము ప్రాప్తమ్ము లేకను
ప్రాణములు విడిచిరి పాలుపోక...

ఆ॥ వె॥ అణచివేతవలన ఆర్థిక పరముగా
ప్రగతి శూన్యమయ్యె బ్రతుకులోన
రాజకీయముగను రాణింపు లేకను
సాంఘిక అభివృద్ధి సన్నగిల్లె...

ఆ॥ వె॥ పక్షపాత దృష్టి ప్రభువులు చూపగా
బీసివారికెపుడు బీదతనమె
దాపురించు చుండు ద్రవ్యంబులోపించి
బ్రతుకు నావనీడ్చ భారమయ్యె...

ఆ॥ వె॥ సానుకూలమైన సహకార సంఘాలు
జౌళిశాఖవారు జాలిజూపి
పలువిధమ్ములైన పథకాలు ప్రకటించి
అమలు పరచవలయు ఆర్తిదీర్చ...

ఆ॥ వె॥ ఆర్థిక వనరున్న ఆశలు చిగురించి
బడుగు జీవితాలు భద్రముగను
పసిడి భవిత తోడ భాసురంబగుచును
శాంతి సుఖముపొందు శాశ్వతముగ...

ఆ॥ వె॥ సత్ఫలమ్ములైన సంక్షేమ పథకాలు
సత్వర ఫలితమ్ము సార్థకతన
కార్మిక జనమెల్ల కష్ట ఫలితమ్మును
పొందవలయుసుగతి నందవలయు...

# మార్పు కష్టమే...

-అనిశెట్టి రజిత

ఈ మధ్య రమ తన మిత్రులు కొంత కాలంగా పనిచేస్తున్న 'వేదిక'లో చేరింది. అనుకోకుండా వారం పది రోజులు వాళ్ళంతా పల్లెటూర్లకు క్యాంపులకు పోయారు. రమకు అత్యవసరమైన పని ఉండటం వల్ల క్యాంపులకు పోలేదు. ఆ సమయంలో వాళ్ళ వాడలోనే ఒక సమస్యలో తలదూర్చింది. వెనకాముందూ చూసుకోలేదు. సాంఘిక దురాచారాల్ని ఎదిరించడం అంటే మొత్తం సమాజానికే ఎదురుతిరగడం అని కొత్తగా సమాజాన్ని పట్టించుకుంటున్న రమకు తెలువదు.

కొన్ని రోజుల క్రితం వాడలో తాగుబోతు శంకరి చనిపోయిండు. వయసు ముప్పై ఐదేళ్ళే, భార్య నిర్మలకు ముప్పై ఉంటాయి, ఇద్దరు మగపిల్లలు బడికిపోతున్నరు. పానం అంత బాగుండని ముసలి తల్లి. శంకరి ఉప్పరి పనికి పోయేటోడు నెలకు పది రోజులు. ఆ పైసలతోటి తాగుడు. వాడల తమాషాజేసుడు... ఇల్లంత ఈరంగం... తల్లీ... భార్యా... పిల్లల్ని ఆటాడించెటోడు. తాగి తాగి వాడు సావుకొచ్చిండు. నిర్మల కూడ బొక్కల బొమ్మతీర్గ ఉంటది. పిల్లలూ సరైన తిండిలేక ఈసురో అన్నట్లుంటరు.

మిత్రబృందం క్యాంపు నుండి తిరిగి రాంగనే, సునందను రమ కలుసుకొని శంకరి చనిపోయినంక, నిర్మల పట్ల బంధువులు వాడలోల్లు ఆచారాలంటూ చేస్తున్న అర్థంలేని అమానుష తంతుల్ని చూడలేక, తను వాళ్ళను నిలువరించబోయిందీ... దాన్ని తరతరాల ఆచారాలను ఎదిరించే వ్యతిరేకిగా వాళ్ళు తనపై తిరగబడిందీ... నానా మాటలు అన్నదీ చెప్పుకున్నది. రమలో నిరాశను చూసి సునంద "నెవ్వేం తప్పుచేయలేదు రమా... కని అదాటున మంటలకు దునికినవ్... మనోల్లను కొంత మందిని సపోర్టుకు పిల్చుకునేది ఉండె... ఇంతకు ఒట్టి తిట్లతోనే ఒదిలిన్రా లేక చేయి చేసుకున్నరా" అడిగింది సునంద. "అంత పనీ అయ్యేదే గని సాంబయ్య తాత వచ్చి నన్ను మా ఇంటికి తీసుకొచ్చిండు". "బిడ్డా నువ్వు ఆలోచించిందే మంచిదేగని వాళ్ళకు ఆ ఎరుకలేదు... గింత తొందరగ మర్తరా... అదేదో గనకార్యం అనుకుంటరు... విన్నవు గద ఆడోళ్లూ మగోళ్లూ తూలుకుంట వీరావేశంతోటి ఎట్ల ఎగపోసిన్లో..."

"తాతా అది గాదే ఆ పిల్ల వయసెంత... జీవితం ఇగ ఆగిపోతదా అయిపోతదా... గాజులు పగలగొట్టుడు... గవన్నీ ఏంది..." ఆమె ఎంత కుంగిపోవాలె... ఏం పాపం జేసిందని ఆ శిక్షలన్ని... పిల్లలు బెంగటిల్లరా... ఆ తల్లి మనాది బట్టదా..." "ఆగురా తల్లి ఆగురా... తొందరపడకు... మారాలె గిదంతా మారాలె కని మూర్ఖులు... వాళ్ళను మార్చాలె... నువ్వు ఇంట్లనే ఉండు... అక్కడికొచ్చినా నిర్మలకు తోడుగ ఉండు... లొల్లి చేయకు... నా మాటిను"

అని సాంబయ్య తాత ఆమెను ఇంట్ల కట్టడిజేసి చావుకాడికి పోయిండు... అని సునందకు చెప్పింది రమ.

"నీకిప్పుడు ఆ పిచ్చి తంతునంతా ఆపలేకపోయిన్ననే బాధ. నలుగురు నాలుగు రకాల మాటలని అవమానించిరనే బాధ. నువ్వు అనుకున్నది అంటే ఆ అమానుషత్వం, మూఢాచారాలనుండి ఆమెను కాపాడలేకపోగా ఓడిపోయినన్న దుఃఖం అంతేనా"

"ఆ... అవును అన్నీ ఉన్నయి..."

"నువ్వేం ఓడిపోలేదు... అట్లని గెలవనూలేదు... కానీ ఎప్పటికైనా మనమే గెలుస్తం... మంచి గెలుస్తది... ఇట్లాంటి వికృత చేష్టల్ని ఎదిరించేటోళ్లు... ప్రశ్నించేటోళ్లు ఉన్నరని వాళ్ళు తెలుసుకుంటరు. వాళ్ళలో కొందరైనా ఆలోచిస్తరు... ఇంతెందుకు సాంబయ్య తాత లాంటి పెద్దలు నిన్నే సమర్థిస్తరు... నీ బాధ సహజమే కనీ తాత్కాలికం... ఇంతకు నిర్మలను కల్సుకున్నవా... పోదాంపద... ఆ పిల్లకు ధైర్యం జెప్పి మంచి చెడులు తెల్సుకుందాం అని ఇద్దరూ మాట్లాడుకుంట నిర్మల ఇంటికి పోయిండ్లు...



వేదిక సభ్యులు నిర్మలకూ, పిల్లలకూ, పెద్దమనిషి నర్సమ్మకూ బట్టలు కొనుక్కపోయి ఇస్తున్నరు. కొంత డబ్బు సాయం కూడా చేస్తున్నరు. ఆర్నెల్లైనా నిర్మల తప్పుచేసినట్లుగా బయిటికెళ్ళకుండా ఇంట్లనే ఉంటున్నది. కొద్దిగనైనా ఆమె చేసే కుట్టుపని పూర్తిగ తగ్గిపోయింది. ఇట్ల కాదని నిర్మలను వాళ్ళకు తెలిసిన లేడీటైలర్ దగ్గర పని నేర్చుకోమని మూడు నెల్లు శిక్షణనిప్పించి... ఆమె ఇంట్ల కుట్టుపని చేయడానికి వాళ్ళ బట్టలూ వాళ్ళకు తెలిసినవాళ్ళ బట్టలూ ఇప్పించిన్రు.

నిర్మల తెలివైనది... సంవత్సరం నాటికి బాగా కోలుకున్నది. చేతినిండ పని దొరికింది... వాళ్ళిప్పుడు కడుపు కింత తిని కంటికి నిద్ర పోతున్నరు. నర్సమ్మ కూడ రమా, సునందలు ఇప్పించే విటమిను మాత్రలు, టానిక్‌లు, ఇంట్ల ప్రశాంతత తోటి కొంచెం బలం పట్టింది. కోడలి పని చూసి ఇంట్ల ఆపనీ ఈ పనీ జరంత చూసుకుంటున్నది. పిల్లలిద్దరూ 'వేదిక' అక్కలు చెప్పే అదనపు చదువుతోటి మంచిగ బడికి పోయొచ్చి చదువుకుంటున్నరు.

నిర్మల ఇప్పుడు బోసిపోయి... బీరిపోయి లేదు... మునపటి తీర్గ బొట్టుపెట్టుకొని మంచి బట్టలు కట్టుకుంటున్నది.

వాడలోల్లు అంతగ దీన్ని పట్టించుకోలేదు. చేబదుల్ల కోసం రోజూ ఎవరో ఒకరు నిర్మల ఇంటికి పోతనే ఉంటరు. పొదుపు సంఘం నిర్మలే నడుపుతున్నది. పనులుతీరంగనే చాలా మంది నిర్మల ఇంట్ల చేరుతరు... ఇది చూసి రమకు వీళ్ళకు అక్షరాలు దిద్దేపనిపెడ్తే ఎట్లా ఉండదన్న ఆలోచన వచ్చింది. నాడు రమను దులపరిచ్చినోల్లే ఇప్పుడు రమక్కకు తమ

ఇంటిగోడు చెప్పుకుంటరు... మెల్లెగ వాళ్ళనో దారికి తెచ్చి అక్షర సేద్యం కూడ మొదలు పెట్టిండ్లు 'వేదిక' అక్కలు...

నిర్మల బతుకు బండి గతుకులు దాటి రోడ్డుమీదికి వచ్చింది. అంటే సరైన దారిల బడిందన్న సంతృప్తి ఉన్నా ఇట్లాంటి నిర్మలలు వందలూ వేలల్ల ఉన్నరు. వాళ్ళ సంగతేందన్న దిగులు రమక్కకూ సునందకూ...

పల్లెల్ల పేదరికం, ఉపాధి పరిమితంగా దొరకడం భర్తల తాగుడూ... వేధింపులూ... కులాల తక్కువతనం తేడాలూ... ఇవన్నీ స్త్రీలకు నరకం చూపిస్తుంటయి... అంటే బతుకంటే ఈ హింసలూ... కష్టాలనే అనుకుంటరు. తాగకపోతే, భార్యను తిట్టక కొట్టకపోతే తను మొగోడే కాదనుకుంటరు మొగోళ్లు... భర్త తిట్లు... గొడ్డు చాకిరి... హింసలు ఇవే బతుకనుకుంటరు ఆడోళ్ళు... భరించలేక కొందరు చెరువులల్ల... బావులల్ల దునికి ప్రాణం తీసుకుంటరు.

ఈ కష్టాలన్నింటికి తోడు భర్త చనిపోతే ఇగ ఆ స్త్రీ కడగండ్లకూ చెరలకూ అంతే లేదు... మనుషుల్ని తంతులనీ, ఆచారాలనీ అంటరానితనాలతో వెలివేయడం ఏ నాగరికతకు గుర్తో ఏ సంస్కారానికి సంబంధించిందో... ఈ దురాచారాలూ.. మూర్ఖత్వాలన్నీ స్త్రీల జీవితాల చుట్టూ పాములై బుసకొడ్తూ పడగలెత్తి మోహరిస్తయి. రమను కమ్ముకున్న ఆలోచనలు ఆమెకు రాత్రిళ్ళు నిద్రలేకుండ చేస్తున్నయి.



నెల నెలా వేదిక సోదరీమణులు ఒక్కొక్క సామాజికాంశం మీద ఒక దగ్గర చేరి మాట్లాడుకొని చర్చలు చేస్తరు. తమ అనుభవాలు పంచుకుంటరు. ఈసారి హైద్రాబాద్ నుండి రచయిత్రి వసంతలక్ష్మిని పిల్చుకున్నారు. ఆమె "స్త్రీ-సమాజం-దురాచారాలు" అనే అంశం మీద గంటసేపు మాట్లాడింది. అక్కడున్న అక్కలు "అణిచివేత" మీద చాలా ప్రశ్నలు వసంతగారిని అడిగిండ్లు.

"అణిచివేత" అనేది అతి క్రూరమైన ప్రమాదకరమైన ఆయుధం. అది మనిషితనాన్ని, మనిషి ఉనికినీ సర్వనాశనం చేస్తుంది. ఈ అణిచివేత భూస్వామ్యం, ధనస్వామ్యం, మతస్వామ్యం, కులస్వామ్యం అనే నాలుగు విధ్వంసక అస్త్రాల ద్వారా బలహీనులపై ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తుంది. ఆధిపత్యం తన పబ్బాని గడుపుకుంటూ అధికారాన్ని ప్రయోగిస్తుంది అంటూ ఎంతో వివరంగా ఆమె "అణిచివేత" మీద చెప్పుకొచ్చిండ్లు.

ఇంటి బాధలూ... ఈతి బాధలతో వచ్చిన స్త్రీలు తమ కష్టాలూ సమస్యలూ చెప్పుకున్నరు... "వేదిక" అక్కలు ఇచ్చిన ఓదార్పు ధైర్యంతో మేము దిక్కులేనోళ్ళంకాదు... మమ్ముల్ని పట్టించుకునే సాటి స్త్రీలున్నరనే నమ్మకంతోటి ఇళ్ళకు పోయిండ్రు.

ఎవరైనా వారి ఇండ్లకు తిరిగిపోలేని పరిస్థితి ఉంటే కొద్దిరోజులు 'వేదిక' సభ్యుల

ఇండ్లల్ల ఉండి సమస్య పరిష్కారం అయినంకనే వారి ఇండ్లకు పోతుంటరు...

స్వంతంగా బతకాలనుకున్న స్త్రీలకు వారి వారి శక్తి సామర్థ్యాలను బట్టి ఆయా పనుల్లో శిక్షణనిప్పించి... పనిముట్లు కొనిచ్చి వాళ్ళు స్వశక్తితో జీవించే ఆసరా కూడా 'వేదిక' చేపడ్తుంది.

వేరే జిల్లా నుండి విద్యార్థులు తమ 'వేదిక' పనితీరు గురించి తెలుసుకోవడానికి వచ్చినపుడు... ఈ విషయాలన్నీ వేదిక సభ్యురాలు సరళ వాళ్ళకు వివరిస్తూ ఉన్నది... అయితే ఆమె చెప్పినట్లు వాళ్ళు వింటున్నట్లూ అదంతా అంత తేలికగా జరిగే పనికాదు... వేదిక సభ్యులెవ్వరూ అంత డబ్బున్నోళ్ళు కాదు... అయినా వారి శక్తి మేరకు ఈ పనులన్నీ చేస్తుంటరు... వీళ్ళకు పరోక్షంగా కొందరు ప్రత్యక్షంగా కొందరు సహాయపడుతుంటరు...

మహిళలిప్పుడు మునపటంత నిస్సహాయులు కాదు... వాళ్ళు గ్రూపులు కట్టడం తెలుసుకున్నరు... గ్రూపులద్వారా ఎన్నో పనులు నేర్చుకున్నరు... ఒక్కళ్లూ చేసేది తక్కువ పది చేతులు కలిస్తే సాధించేది ఎక్కువ అని గ్రహించుకున్నరు.

అయినా... కానీ ఈ మార్పు ఇంకా ఇంకా పెరగాల్సి ఉన్నది. మహిళలు ఇంకా చదవాలి... అక్షర జ్ఞానంతో పాటు ప్రపంచ జ్ఞానం రావాలె... ఐక్యత పెరగాలె... సమస్యలతో పోరాటం సంఘం కట్టి చేయాలె... మారడం తేలికైన పనికాదు. దానికో కొత్త జన్మనెత్తాలె... కష్టపడంది ఏదీ కాదు, ఏదీ రాదు... ధైర్యం చేస్తే అసాధ్యమే లేదు. ఇప్పటికే ఈ కుళ్ళిన సమాజం మనుషులను భయభ్రాంతులకూ... బలహీనులకూ గురి చేయడంలో పట్టుపట్టి ఉన్నది. లోకం బలహీనులకూ గురి చేయడంలో పట్టుపట్టి ఉన్నది. లోకం లోకం అనుకుంట లోకులకు ఈ సామాన్యులు భయపడుతూ ఉంటరు...

ఎవరో మారాలనుకుంటం... మనమూ మారాలె... మార్పు మంచిదే... సమాజం మనోత కలిసి రాక ఏం జేస్తది... మారని మనిషే. మారని సమాజం తుప్పుబట్టిపోతరు... కుళ్ళి కుళ్ళి చస్తరు... సరళ విద్యార్థులతో మాట్లాడుకుంటనే ఆమె ఆలోచనలు మరో దారిల నడుస్తున్నయి.

చాలా మందికి ఎట్లనో అట్ల బతకడమే తెలుసు. బతుకులోంచి జీవితంలోకి అడుగుపెట్టాలని కూడా అనుకోరు... కొంతమంది స్త్రీలు సమాజంకోసం ఏమైనా చెయ్యాల్నని వస్తరు... కని వెంటనే వెనకకు తగ్గుతరు... అయితే అది తాత్కాలికమే అనుకోవాలె... జ్ఞానోదయం అయిన మనిషిని అందునా స్త్రీని ఏదీ ఆపలేదు. ఆమె జీవించే హక్కునూ... ఆమె ఆత్మగౌరవాన్ని... ఆమె సంపూర్ణ జీవితావిష్కరణనూ ఆపాలనుకుని దుష్టశక్తులు పతనం గాక తప్పదు... అనుకుంటూ సరళ ఆ వచ్చిన విద్యార్థి బృందాన్ని, ఈ మధ్య ఓటమి చెరపీడి జీవితాన్ని గెలుచుకున్న మహిళలను పరిచయం చేయడానికి తీసుకొని పోయింది.

అభ్యుదయ

# వీరలక్ష్మి

-రాసో

అప్పటికి సుమారుగా ఉదయం 10 గంటలు కావస్తున్నది. సుక్క పొద్దున లేచి పశువులను వెంటేసుకుని చేను చెల్కల మీదకి పోయిన రైతులు ఒక్కరొక్కరుగా ఇంటికి చేరుకుంటున్నారు. ఊరిలోని ఆడవాళ్లు పొలం పనుల కోసమని ఒకరిని ఒకరు కేకలేసి పిలుచుకుంటు వీధుల్లో గుమికూడుతూ ముచ్చటించుకుంటున్నరు. వూరు వూరంత సందడి సందడిగా వుంది. కాపువాడలో రామకోటయ్య కాలం చేసాడన్న సంగతి ఊరిలోని నాలుగు వాడలను అల్లుకొని పోయింది. ఒక్కసారిగా ఊరును నిశ్శబ్దం ఆవహించినట్టయింది. స్వంత పనులు మానుకొని ఒక్క రొక్కరుగా రామకోటయ్య ఇంటి బాట పట్టారు. గ్రామంలో ఎవరు చనిపోయినా అందరూ కలిసి దహన కార్యక్రమంలో పాల్గొనె సాంప్రదాయం గ్రామ సంస్కృతిలో మిగిలేవున్నది.

తూరుపువాడ నుండి వస్తున్న సరోజన పోశమ్మ గుడిదాటి వెళ్తున్న మల్లక్కను కేకేసి పిలిచి ఆపింది. ఏం మల్లక్క మన వీరలక్ష్మి భర్త కాలం చేశాడట నీకు తెలిసిందా? అడిగింది సరోజన. అవునక్కా నేను అక్కడికే పోతాన, పాపం రెండు రోజులుగా జ్వరమట అన్నది మల్లక్క. ఏం జరాలో పాడో నమ్మా చిన్నప్పుడు జరం వస్తే మా అవ్వ రెండు పూటల ఎల్లిపాయ మిరంతోటి బువ్వ తినిపిత్తె సప్పున తగ్గిపోయేది. ఇప్పుడేమో మతమతాన మనసుల పాణాలె మింగుతానయ్ ఈపాడు జరాలు, అనుకుంటూ ఇద్దరు రామకోటయ్య ఇంటికి చేరుకున్నారు.

అక్కడికి ముందుగా చేరుకున్నది జగన్నాథం, అతని భార్య మల్లికాంబ. వీరిది రామకోటయ్య ఇంటికి ఎగువన ఉన్న ఐదవ ఇల్లు. రామకోటయ్య ప్రక్కన కూర్చున్న వీరలక్ష్మి అతని నుదురుపై నుదురుపెట్టి వాలిపోయి వుంది. ఆమె చేతిలోకి తీసుకున్నా అతని చేయి అట్లాగే ఇంకా ఎత్తిపట్టేవుంది. ఆఖరి క్షణం అతడు ఇక సెలవంటూ భార్యకు తన చేయినందించిన ఆత్మీయ స్పర్శకు ప్రత్యక్ష రూపమది. ఈ హఠాత్తు అనుభవం ఆమెను నిశ్చేష్టురాలును చేసింది. మల్లికాంబ దగ్గరకుపోయి తన చేతిని వీరలక్ష్మి తలపై వేసి ఒడిలోకి తీసుకునేంత వరకు ఆమె ఈ లోకంలోకి రాలేకపోయింది. పొగిలి, పొగిలి ఏడ్చే ఆమెస్థితి పలువురిని కంటతడి పెట్టిస్తున్నది.

రామకోటయ్యతో జగన్నాథంకు యాబది ఏళ్ళ పూర్వపు సంబంధం. ఇద్దరు ఒకే వయసు వారు కావడం, ఒకేసారి కుటుంబ వ్యవహార బాధ్యతలతో వ్యవసాయంలోకి రావడం వారి సాన్నిహిత్యానికి కారణమైంది. రామకోటయ్య తండ్రికి ఒక్కగానొక్క కొడుకు. అతను యుక్త వయసునాటికి తల్లి అకాల మరణం చెందింది. అప్పటి నుండి తండ్రి కొడుకులది 'జోడెడ్ల'బంధం! తండ్రితో కలిసి రామకోటయ్య తనకున్న మూడు ఎకరాల భూమిలో వ్యవసాయం సాగించాడు. రైతు బిడ్డకు ఆడదాని ఆధారం పెద్ద దిక్కు. ఆ అవసరం తెలిసిన రామకోటయ్య

తండ్రి, కొడుకు పెండ్లి తలపెట్టాడు. తన బావ మరిది కూతురు వీరలక్ష్మితో వివాహం జరిపించాడు. వీరలక్ష్మి పెళ్ళిలో రామకోటయ్యతో వేసిన ఏడు అడుగుల మాటేమోకాని జీవితాంతం అతని అడుగుల వెంటనే ఆమె అడుగుల ప్రయాణం కొనసాగించింది. అందుకే రామకోటయ్య తమ ఆశయాన్ని సాధించుకోగలిగాడు. వీరికి ముగ్గురు కొడుకులు ఒక్క కూతురు. తన తండ్రి తనకు మూడు ఎకరాలు ఇచ్చినట్టుగానే, తను, తన కొడుకులకు భూమి సంపాదించి ఇవ్వాలనేది రామకోటయ్య ఆశయం. ఈ విషయాన్నే తను పదే పదే చెప్పెటోడు. తన ఆశయానికి ఆరాటానికి వీరలక్ష్మి ఆయువు పట్టయింది.

జోడెద్దుల దొడ్డి మందతో నిండిపోయిందని తన సంతానాన్ని గురించి చెప్పుకుంటూ మురిసిపోయేటోడు రామకోటయ్య. తను అనుకున్నట్టుగానే కొడుకులకు పెండ్లిల్లు చేసి ముగ్గురికి ఒక్కొక్కరికి మూడు ఎకరాల భూమి సమకూర్చి ఇచ్చి వేరు కుటుంబాలుగా బ్రతికే విధంగా వృద్ధి చేశాడు. తన తండ్రి ఇచ్చిన మూడు ఎకరాల నుండి ఒక ఎకరం భూమిని పసుపు కుంకాల క్రింద బిడ్డకు ఇచ్చి పెండ్లి జరిపించాడు.

ఇప్పటి రామకోటయ్య వయస్సు డెబ్బది ఐదు వసంతాలు అయి వుంటుంది. జగన్నాథం రామకోటయ్య బాల్యం నుండి ఒకరికి ఒకరు తోడుగా దుక్కిచేత నుండి మొదలుకొని పంట ఇల్లు చేరే వరకు ప్రతి విషయంలోను కూడబలుక్కొని పని చేసేవాళ్లు. వూరిలోని మోతుబరి రైతులకు తీసిపోకుండా పంటలు పండించాలన్న మొండి తలంపువాళ్ళది. ఆ రకంగా వారి జీవితపు ఎదుగుదలలో ఒకరి ప్రమేయాన్ని తగ్గించి చూడలేని సావాసం. యాభై వసంతాల అనుభవ సంఘటనలు సాదృశ్యాలుగా జగన్నాథం మనసుపొరల్లో మెదలసాగాయి. ఎదలో ఏదో తెలియని మంట జగన్నాథంను కంటనీరు పెట్టిస్తున్నది. సూర్యోదయం సాగి సాగి చీకటి గర్భంలోకి చొరబడినట్లుగా మనిషి కాలధర్మం పాటిస్తున్నట్లుగా రామకోటయ్య కదిలిపోయాడు.



తల్లి పక్కను విడిచి రామకోటయ్య వేలుపట్టి నడిచిన జీవితం అరువది సంవత్సరాలది వీరలక్ష్మికి. ఒక్కసారైనా అవసరం కోసం తల్లి ఇంటివైపు ఆశగా ఎదిరి చూడాల్సిన అవసరం ఆమెకు రాలేదు. కన్న వారి ఆత్మీయతను మరిపింపచేసిన గొప్ప సహచర్యం రామకోటయ్యది. నిజానికి వారిది కంటికి చూపుకు వున్న సంబంధంలాంటిది. అందుకే కాబోలు కన్నవారు అలుముకొని చేసిన పలకరింపులు, అయినవారు ఆప్తుల ఓదార్పులు చుట్టు ముసిరివున్న తన మనసులోని వెలితి భావనను దూరం చేయలేకపోతున్నాయి.

ప్రాణకోటి అంతటిలో మానవ జాతిని తరలింపచేయడంలో కాలానిది ఓ ప్రత్యేకత. వీరలక్ష్మి దీనికి అతీతమైనది ఏమికాదు. అప్పటికి తోడు బాసిన ఆమె జీవితాన్ని పదిహేను రోజులు కావస్తూనే వున్నది. కర్తవ్యం వైపు ఏదో లాగుతున్నట్లుగానే ఆమె చేనుబాట పట్టింది.

తమ రెండెకరాలలో ఓ మూలన సాగు చేసిన మక్కజొన్న చేను వల్లిన ముఖాలతో వారికోసం ఎదిరిచూస్తున్నట్లుగా అనిపించింది. తన దైన్యపుస్థితిని ప్రత్యక్షంగా చూసినట్లుగా ఉంది వీరలక్ష్మికి. ఎదలోని దుఃఖము ఎగదన్నుకొని వచ్చి కంటనీరై కారుతున్న, నీటిమోటారుకు కరెంటు మీట నొక్కింది. బావిలోని నీరు కాలువలో దూకి ఆమె కన్నీటితో కలిసి పంట చేను వైపుకు పరుగుపెట్టింది.

బావి గట్టున నిలిచి తన రెండెకరాలను తేరిపారగా చూడసాగింది వీరలక్ష్మి. కన్నీటి పరదాల మాటు నుండి, మసక మసకగా కనిపించే భూమి రామకోటయ్య రూపంలా గంభీరంగా తోచింది ఆమెకు. అరువది సంవత్సరాల కలివిడి. చేతలో చిందిన వారి చెమట చుక్కల బంధం ఆ మట్టి పెల్లల్లో ఒక్కటిగా ఇమిడి వున్నాయన్న వాస్తవం అర్థమయిందన్న నిశ్చయానికి వచ్చింది ఆమె. ఊరట కోసం ఆరాట పడుతున్న మనసు కుదుట పడ్డట్టయ్యింది. మునుపటి నిస్సత్తువ ఇప్పుడు ఆమెలో లేదు. ఇప్పుడు కర్తవ్యం బోధపడిన కర్మయోగి స్థితి ఆమెది.

ఎప్పటిలాగే దుక్కిని పంటలతో సంపన్నం చేస్తున్నది. ఒంటరి తనపు లేమి ఎక్కడా కనిపించనంతగా పంటలను ఫలవంతం చేస్తున్నది. అరువై సంవత్సరాల అనుభవపు దీక్ష కృషి ఆమెది. "కర్తవ్య దీక్షతో సాగే కృషిని అడ్డగించడానికి ఓటమి కూడా భయపడుతుందన్న నిజాన్ని రుజువు చేస్తున్నట్లుగా వుంది ఆమె కృషి. అప్పటికి ఏడాది గడిచేపోయింది. ఎందుకో ఆమె కుడి కన్ను మసక మసకగా అనిపించింది. ఒకనాడు మాటల సందర్భంగా మల్లికాంబతో చెప్పింది కూడా. కంటి డాక్టరు చూపించుకోరాదు అని మల్లికాంబ ఇచ్చిన సలహా వీరలక్ష్మికి అంతగా అవసరం అనిపించలేదు. మరోకన్ను బాగానే వున్నది కదా అన్న ధీమ ఆమెది. వైరాగ్యపు అనుభవం కల్గించిన మొండితనము అయివుంటుంది కాబోలు.

తనవాళ్ళ అవసరాల బాధ్యతను నెరవేర్చుతూ, ఒడిదుడుకుల ఒత్తిళ్ళను అధిగమిస్తూ తోడు బాసిన జీవితపు రోజులను దొర్లిస్తూ సాగించిన కాలం రెండు సంవత్సరాలు అయిపోయింది. ఎందుకో ఇప్పుడు ఎడమ కన్ను కూడ దూరపు వస్తువులను గుర్తుపట్టనట్లుగా కష్టంగా అనిపించింది. ఆమెకు వెనుకటి లాగే మల్లికాంబతో చెప్పి చూసింది. ఇప్పుడు మల్లికాంబ కాస్త ఘాటుగానే మందలించింది. కండ్ల చూపంటే పిల్లగాల్ల పరాచికాల వీరలక్ష్మి, అనద్దుగాని మీ ఆయన పోయిన కాన్నుండి నీకు సంపాదన మీదే కాయిసు బాగా పెరిగిపోయింది. ఎప్పుడు చూసిన ఆ చెల్కలనే పడిసత్తానవు. ఎందుకే ఆ సంపాదన అంటూ కఠినంగానే మాట్లాడి వూరుకుంది మల్లికాంబ. విధి కూడ గుర్తించలేని మానసిక మర్మం ఆమె ఎదలోతుల్లో దాగివున్న సంగతి మల్లికాంబకు మాత్రం ఎలా తెలుస్తుంది.

మరుసటి రోజు ఇద్దరు కలిసి మండల కేంద్రానికి పయనమయ్యారు. తన మాటను పట్టించుకున్నందుకు మల్లికాంబకు లోలోపల సంతోషంగా వుంది. కంటి డాక్టరును కలిసి

వీరలక్ష్మి కండ్ల పరీక్ష చేయించుకుంది. కుడి కన్ను ఆపరేషన్ చేసిన చూపురాదని కంటిలో పెరిగిన పొర చాలా ముదిరిపోయిందని, ఎడమ కన్ను త్వరగా ఆపరేషన్ చేయిస్తే చూపు తప్పక వస్తుందని డాక్టరు తేల్చి చెప్పారు. నీ మొండి తనంతో గింత కాడికి తెచ్చుకుంటివి వీరలక్ష్మి, అంటూ విచారపడంది మల్లికాంబ. అయినా వీరలక్ష్మి ధైర్యం చెడలేదు. ఎడమ కన్ను ఆపరేషన్‌కు సిద్ధపడింది. మల్లికాంబ, పెద్ద కోడలు తోడురాగ కంటి ఆపరేషన్ విజయవంతంగా పూర్తి చేసుకుంది వీరలక్ష్మి, కూతురుకు కబురు పెట్టడంతో తల్లికి ఆసరగా వచ్చి బిడ్డ అన్ని విధాలుగా తల్లికి సేవలు చేయసాగింది. ఏడవ రోజు దాటినందున డాక్టరుని కలిసి కంటి పరీక్ష చేయించుకుంది. చూపు బాగుంది నెల రోజులు జాగ్రత్తగా కాపాడుకోమని సూచనలు చెప్పి, మందులు వ్రాసి ఇచ్చి వాడమని చెప్పాడు డాక్టరు. తల్లి, కూతురు కలిసి ఇంటికి చేరుకున్నారు.

తెల్లవారింది! బిడ్డను తన ఇంటికి తిరుగు ప్రయాణానికి సిద్ధం కమ్మని చెప్పింది తల్లి. ఆడ తోడులేని రైతు సంసారం ఎద్దులేని వ్యవసాయం లాంటిదన్న సంగతి అనుభవం నేర్పిన జ్ఞానం ఆమెది. తల్లి మాటకు ఎదురు చెప్పకుండానే తన ఇంటికి తిరుగు ప్రయాణమైంది కూతురు. పెద్ద వదినను కేకేసి పిలిచింది. గదవ క్రింద చెయ్యి పెట్టి అమ్మను నువ్వే చూసుకోవాలే వదిన, వాళ్ళంటే దూరంగా వున్నారు, అంటూ బ్రతిమిలాడినట్లుగానే అంది. చేతిలో చెయ్యి వేయించుకొని అమ్మ బాధ్యత నీదేనంటూ మరీ చెప్పింది. తల్లి దగ్గరకు పోయి రెండు చేతులు చేతుల్లోకి తీసుకొని కండ్లకు అద్దుకొని, అమ్మ ఆరోగ్యం! జాగ్రత్త అంటూ ఇల్లు వదిలి కదిలిపోయింది వీలక్ష్మి కూతురు.

మనిషికి తను ఎదగాలన్న ఆశ - ఆరాటం వుండటం సహజం. మంచిదికూడా. కాని ఎదుటి వారు తనకన్న ఎక్కువగా ఎదగ కూడదు అనే కుత్సితపు బుద్ధి మాత్రం మానవ సంబంధాలలోని ఆత్మీయతలను కాలరాసి వేస్తుంది. సరిగ్గా అదే జరిగింది ఇక్కడ.

తనకు పసుపు కుంకాల కింద ఇచ్చిన ఎకరం భూమిని తమ పెద్దన్నకు అమ్ముకొని పోయింది వీరలక్ష్మి కూతురు. ఇద్దరు తమ్ముళ్ళు బయటకు చెప్పుకోలేదు. కాని తమకంటే అన్నకు ఎక్కువ భూమి అయినందుకు వారికి మనసులో కంటగింపుగానే వుంది. రెండవ రోజు కంటిలో మందు వేయడానికి వచ్చిన పెద్దకోడలు నీ చిన్న కొడుకు నీ భూమిలో నాగలి కట్టి దున్నుతున్నాడని అత్తకు చెవిలో చెప్పి వెళ్ళిపోయింది. వీరలక్ష్మి దిగ్గునలేచి చేనుబాట పట్టింది. గట్టుపైన నిలబడి ఏరా చిన్నోడా! ఏందిరా గీ పని అని నెమ్మదిగా మందలిచ్చినట్లుగా అడిగింది. నా వాటా కాడికి నేను దున్నుకుంటాన, వాల్లది దున్నుతలేను గదా, నేను బాగుపడాలని లేదా అవ్వ నీకు? అంటు కటువుగానే జవాబిచ్చిండు చిన్న కొడుకు. నేను పండించి కూడా మీకు, మీ పిల్లలకే పెడుతానా కాదురా! నాకు ఒక్క మాట కూడా చెప్పకుండా, గిట్ల తెగబడ్డపని చేయబడితివి. నేను సచ్చినంక మీకు కాక ఇంకెవరికి అని బాధతోనే అంది. కాని తల్లి మాటలకు

తిరుగు సమాధానం చెప్పకుండానే తన పని తాను చేసుకుపోతూనే వున్నాడు చిన్న కొడుకు. వీరలక్ష్మికి అర్థం అయిపోయింది అతను కావాలనే చేస్తున్నడని. పేగు తెంచుకొని పుట్టినంత మాత్రాన కొడుకు కాజాలడు, తల్లి మనసులోతుల్లో దాగిన ఆశలు-ఆలోచనలు గుర్తెరిగి మసలుకున్నోడే కొడుకన్న సంగతి అతనికి తెలిసిందికాదు. ఇనుప గోర్లతో ఎవ్వరో ఒల్లంత గీరుతున్న బాధ, తన నుండి తనను ఎవ్వరో లాక్కుపోతున్నట్లుగా మనసు గందరగోళపడుతున్నది. కండ్ల నీళ్ళను తుడుచుకుంటూ మౌనంగా వెనుదిరిగింది వీరలక్ష్మి. ఏదో తెలియని వేదన రాత్రంత ఆమెను నిద్రపట్టకుండా చేసింది.

కొడుకు తన భూమిని దున్నడాన్ని ఆపించాలన్న ఆరాటం ఆమెను గ్రామ సర్పంచి వద్దకు లాక్కుపోయింది. కన్నీళ్ళతో తన సమస్యను చెప్పుకుంది. మూడుసార్లు సర్పంచ్ మనుషులను పంపించి కబురు పెట్టిన వీరలక్ష్మి చిన్న కొడుకు రాలేదు. విషయం తెలిసిన మిగిలిన ఇద్దరు కొడుకులు కూడా పట్టించుకున్న పాపాన పోలేదు. మధ్యాహ్నం వరకు ఎదిరి చూసిన ఆమెకు నిరాశే ఎదురైంది. చేసేది లేక ఇంటికి వెనుదిరిగింది. ఒంటరి తనపు జీవితానుభవం మొదటిసారిగా చవిచూసినట్లయింది ఆమెకు.

మరుసటి రోజు రెండవ కొడుకు కూడ నాగలి కట్టి దున్నుతున్నట్లు పెద్ద కోడలు ద్వారానే తెలియవచ్చింది. ఇప్పుడు ఆమెకు మనసు మనసులో లేదు. ఒళ్ళు ముక్కలు ముక్కలుగా విడిపోతున్నట్లుగా వుంది. ఏమి చేయాలో తెలియని స్థితిలో మళ్ళీ సర్పంచినే ఆశ్రయించింది. అతని సలహా మేరకు పోలీస్ స్టేషన్‌కు పోయింది. వీరలక్ష్మి ఎదుటపడి పలకరించిన పరిచయస్తులకు తన గురించిన విషయం చెప్పుకొని కంటతడి పెట్టక తప్పింది కాదు. నాలుగు రోజులుగా అదే పనిగా ఆమె స్టేషన్ చుట్టూ తిరుగుతూనే వుంది. అప్పటికి గాని ఇన్స్‌స్పెక్టర్‌కు తీరిందికాదు. అరె ఆ ముసల్దాన్ని పిలవరా అంటూ సెంట్రీని పురమాయించిండు ఎస్.ఐ.యాతం వేసితోడినట్లు నీళ్ళు కుమ్మరించే కండ్లతో వీరలక్ష్మి ఎస్సై కాళ్ళ మీద పడబోయింది. అతడు వారించాడు విషయం చెప్పమన్నాడు. చిక్కిన ముఖముపై కన్నీటి ధారల చాయలు అతని మనసును గెల్కినట్లైంది. ఆమె పూర్తిగా చెప్పకుండానే హూంగార్డును పిలిచి ఈ ముసలవ్వ కొడుకులను అర్జెంటుగా వెంట పెట్టకొని తీసుకురా అంటూ గట్టిగానే చెప్పి, ముసలవ్వ నువ్వు పోయి ఆ చెట్టు క్రింద కూర్చోమని ఎస్సై చెప్పాడు. వీరలక్ష్మి బయటికి వచ్చింది తొవ్వ ఖర్చులకోసమని తెచ్చుకున్న రెండు వందల రూపాయలు హూంగార్డు చేతిలో పెట్టింది. ఎందుకో తనకు పరిష్కారం దొరుకుతుందని చిన్న ఆశ ఆమెకు ఊరట కల్గిస్తున్నది ఇప్పుడు.

గంట కాలం గడవకుండానే కొడుకులిద్దరు సర్పంచుతో సహా ఎస్.ఐ. ముందు వాలిపోయారు. వారితోపాటు వీరలక్ష్మి కూడా వరుసలో నిలబడింది. ఏందిరా ముసలిదాన్ని భూమి చెప్పకుండానే దున్నుతాండ్లట, సర్పంచి పిలిచినా రాలేదట, ఒల్లు బలిసిందారా మీకు, అంటూ గట్టిగా దబాయించే అడిగాడు ఎస్.ఐ. కొడుకులకు కుతికలు దగ్గర పడి, నోట మాట

రావటం లేదు. చేతులు గట్టిగా ముడుచుకొని దిష్టిబొమ్మల్లా నిలుచుండిపోయారు. సర్పంచి కల్పించుకొని ఈ పంచాయితి నేను పరిష్కారం చేసిపెడుతానంటు ఎస్.ఐ.కి హామీ ఇచ్చాడు. రెండు రోజుల్లో పరిష్కారం చేసుకొని కాగితం మీద రాసి నాకు ఇవ్వాలే. లేదంటే బిడ్డ, పోలీసు తడాక ఏందో చూపిస్తా, సర్పంచి ముఖం చూసి ఇడిసి పెడ్తానా, పొర్లిచ్చి సంపితే తెలిసేది మీ పోటు మొగోళ్ల సంగతి. ఓ ముసలవ్వ పెద్ద మనుషులు చెప్పినట్లు విను, నువ్వు కూడా మంకుపట్టుపట్టకు. వీళ్ళు పరిష్కారం చేయకుంటే రెండు రోజుల తరువాత నా దగ్గరకు రా నేను చూసుకుంటా, ఇగపోండ్లి అంటూ ఎస్.ఐ. పంపించేశాడు.

కన్న తల్లిని పోలీసు స్టేషన్ పాలు జేస్తిమి కదా అన్న బాధ వారికి ఏ కోశానలేదు సరికదా, మమ్ములను పోలీసు స్టేషన్ రప్పిస్తదా అన్న వెర్రి కోపం మాత్రం కల్లెదుటే వున్న తల్లితో మాట్లాడ నివ్వకుండా చేసింది వారిని.

ఎవరి కోసమైతే యాతన బ్రతుకును సునాయాసంగా భరించిందో, ఎవరి బ్రతుకులు బాగుపడి బంగారం కావాలని కలలుకని ఆరాటపడిందో, వారితోనే తలపడవలసివచ్చినందుకు వీరలక్ష్మికి తన మీద తనకు జాలి వేసినట్లయింది. ఛీ... ఏం, జీవితం? నాది అని మొదటి సారిగా తన జీవితం మీద విరక్తి కల్గింది ఆమెకు.

కారే కన్నీళ్ళను మాటి మాటికి చీర కొంగుతో తుడిచి నందుకేమో కన్ను ఎర్రబారి వాపు చేసింది. గుంజటం మొదలు పెట్టింది. ఇంటి బాధకన్న ఆమెకు ఇప్పుడు కంటి బాధ భరించరానంతగా వుంది. పంచాయితి పట్టింపు పక్కన పెట్టి పెద్ద కోడలును వెంట తీసుకొని, డాక్టరు వద్దకు పోయి చూపించుకుంది. ఏం, చేసినవమ్మా కన్నును, అనవసరంగా చూపును నాశనం చేసుకుంటివి అంటూ డాక్టరు చిరాకు పడుతూ అన్నడు. కంటింకి ఇన్ఫెక్షన్ సోకి రోజులుగడిచినయి, వెంటనే ఎందుకు రాలేదు అన్న డాక్టరు ప్రశ్నకు చెప్పడానికి వీరలక్ష్మికి ఏం జవాబు లేకుండా పోయింది. ఆమె మౌనాన్ని ప్రక్కకు తోస్తూ ఈ మందులు క్రమం తప్పకుండా వాడు, వాపు గుంజడం, ఎర్ర బారడం తగ్గిపోతుంది కాని, చూపు వస్తుందని నేను నమ్మకంగా చెప్పలేను అన్నాడు డాక్టరు.

డాక్టరు గారి మాటలు పిడుగుపాటులా వినిపించాయి వీరలక్ష్మికి. మసకబారిన చూపు కమ్ముకు వస్తున్న చీకటి జీవితాన్ని స్పష్టంగా చూస్తున్నట్లు అనిపించింది ఆమెకు. ఏం బాధపడకు అత్త ఇంకా పెద్ద డాక్టరుకు చూపించుకుందాం నువ్వేం రందిపడకు అంటూ కోడలు పలికిన ఓదార్పు మాటలు పెద్దగా పట్టించుకున్నట్లుగా అనిపించలేదు. మౌనంగా వుండి పోయింది వీరలక్ష్మి.

ప్రస్తుతం తను వున్న పరిస్థితిలో పెద్దలు చేసే పరిష్కారం ఎలా ఉండబోతుందో ఆమెకు అర్థం అవుతూనే వుంది. భూమితో తన బంధం తెగిపోవటం ఖాయం అన్న నిశ్చయానికి

వచ్చింది ఆమె. వాటాలు వేసుకుని తనను కొడుకులు పోషించే అనుభవపు దృశ్యాలు తనకండ్లెదుటే కనిపించసాగాయి. చూపుకోల్పోయి ప్రతిదానికి ఇతరులపై ఆధారపడి బతకాల్సిన తీరు ఎంతటి నరక యాతనమో ఊహిస్తున్న కొద్ది మనసు భయంతో కంపించిపోసాగింది. స్వతంత్రంగా జీవించి పరుల ముందు పరువుగా బ్రతికిన హుందా తనపు మానసిక స్థితి ఆమెది. పరాధీనమై పరాభవం చెందడానికి ఆమె మనసు ఏమాత్రం అంగీకరించడం లేదు. రాత్రంతా ఆలోచించిన తన సమస్యకు పరిష్కారం ఏమిటి? అన్న దానికి సమాధానమే దొరకలేదు ఆమెకు.

మసకచీకట్లు సమిసిపోయి వేకువ వెలుగులు వూరిని అలుముకుంటున్నాయి. వూరి జనాలను నిద్రలేపుతున్నట్లుగా కాకులు కావు... కావు... అంటూ గోలచేస్తున్నవి, పిచ్చుకలు కిచ... కిచ... మంటు వాటికి వంతపాడుతున్నట్టుగా సందడి చేస్తున్నాయి. మంచం మీద నుండి దిగ్గున లేచింది వీరలక్ష్మి. మసక చూపును కూడదీసుకొని గోడ మూలకేసి నడిచింది చెక్క మీద పెట్టి వుంచిన డబ్బాలను తడిమి చూసింది. లావుగా తగిలిన డబ్బాను తీసుకొని యదావిధగా మంచంలో కూర్చొంది. రామ... రామ... అంటూ రామకోటయ్యను మూడుసార్లు తలుచుకుంది డబ్బాకు బిరడా బిగించి చేత పట్టుకొని నెమ్మదిగా మంచంలో ఒరిగిపోయింది.

తూరుపు ఎర్రబారి ప్రాణకోటికి దారి చూపుతున్నట్టుగా ఉన్నది. ఎప్పటిలాగా పాల గ్లాసుతో పెద్ద కోడలు అత్త అని పిలుచుకుంటూ ఇంట్లోకి పోయింది. అప్పటికే వీరలక్ష్మి నోటి నుండి తెల్లని నురగలు ధారలుగా పారుతున్నాయి. అది చూసిన వీరలక్ష్మి పెద్ద కోడలు నివ్వెరపోయి కెవ్వుమంటూ అరుచుకుంటూ బయటికొచ్చి బిగ్గరగా ఏడ్వసాగింది. "కాపువాడలో వీరలక్ష్మి ఊపిరి తీసుకున్నదట" వార్త క్షణాలలో వూరి జనాలకు చేరి కలిచివేసింది. మంచంలో పడివున్న వీరలక్ష్మి దీనస్థితిని చూసి జగన్నాథం, మల్లికాంబ అడుగు ముందుకు కదలనిస్థితిలో ఆమె ఇంటి వాకిటిలో నిలబడిపోయారు. మాటను మింగిన మౌనం జగన్నాథం కంట నీరైసాగింది. అయాచితంగా మల్లికాంబ వైపు చూశాడు. ఆ చూపులోని గోస మల్లికాంబకు అర్థం అయినట్లుగా ఉంది. నెమ్మదిగా వచ్చి అతని ఎదపై తలవాల్చి రోదించ సాగింది తనూ మౌనంగా !



# ఆదర్శం

-నెల్లుట్ల రమాదేవి

బైక్‌ను స్లో చేసి చెట్టు క్రింద ఆపి అటువైపు చూసాడు కార్తీక్. సందేహం లేదు... సమీరే!

రోడ్డు కవతల కోట గుమ్మం లాంటి జైలు తలుపులకు వున్న చిన్న డోర్‌లోంచి బయటికి వచ్చి, సెక్యూరిటీ గార్డ్‌తో ఏదో మాట్లాడుతోంది.

అతడు నవ్వుతూ ఏదో అంటున్నాడు. అంతలోనే భుజానికి వేసుకున్న బ్యాగ్ సర్దుకుంటూ వచ్చి బైక్ పార్క్ చేసుకున్న స్కూటీ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయింది.

హెల్మెట్ పెట్టుకుని వున్న తనను గమనించలేదేమో అనుకున్నాడు కార్తీక్.

ఇది మూడో ఆదివారం సమీరను అలా... జైల్లోంచి బయటకు వస్తూండగా చూడడం. యాదృచ్ఛికమే ఐనా తను జిమ్‌కు వెళ్ళి వచ్చే టైమ్‌లోనే ఆమె జైలులోంచి బయటకు రావడం జరుగుతోంది.

కారణం ఏమిటో అడుగుదామని మొబైల్ మీదకు చెయ్యి పోనిచ్చిన వాడల్లా, ఒక్క క్షణం ఆగాడు.

'ఏం చెబుతుంది? అసలు... నిజం చెబుతుందా? తను కలిసింది నేరస్థుడినో, తీవ్రవాదినో, హంతకుడినో అని చెపుతుందా? లేకపోతే డిగ్రీ చదివే రోజుల్లోనే అతన్ని ప్రేమించాననీ, ఏదో పెద్దవాళ్ళ బలవంతం వల్లనే, నీతో పెళ్ళికి ఒప్పుకున్నాననీ చెబితే తను భరించగలడా?

తల్లిదండ్రులకు తను ఒక్కడినే కొడుకుననీ, ఎమ్.టెక్. చదివి ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్‌గా పనిజేసే తనకు ఉమ్మడి కుటుంబంలో వుండి తల్లిదండ్రులను ప్రేమగా చూసుకునే అమ్మాయి కావాలనీ అడిగినప్పుడు సమీర సంతోషంగా ఒప్పుకుందే! తను కూడా ఏదో కాలేజీలో ఇంగ్లీష్ లెక్చరర్‌గా చేరొచ్చునందే! ఇదేమిటి మరి? వాళ్ళ పేరెంట్స్‌కు తెలుసో... లేదో!

ఆలోచనలతో అసహనంగా మారదు కార్తీక్. వడివడిగా జైలువైపు నడిచాడు.

వెళ్ళిన ఐదునిమిషాల్లోనే బయటికి వచ్చాడు.

'క్షమించు సమీరా! జైలులో డిగ్రీ పరీక్షలు రాస్తున్న ఖైదీలకు వాలంటరీగా ఇంగ్లీషు టీచ్ చేయడానికి వెళ్తున్న నిన్ను అనుమానించి మగాడిననిపించాను. నీకు అంతా విడమర్చి సారీ చెప్తేగానీ, నా మనస్సు తేరుకోదు!' అనుకున్నాక అతని హృదయం తేలికైంది.

# లోకంతీరు

తాటిపాముల రమేశ్

బాంచెన్‌దొరా! పిలిచావట!

వంగి వంగి దండం పెడుతూ రాజయ్యా, రంగయ్యదొర ఎదురుగా పది గజాల దూరంలో నిలబడ్డాడు.

అవునురా! నీతో పనిబడ్డది. అది నీ ఒక్కడి వల్లే అవుతుంది.

"చిత్తం దొరా! ఆ పనేమిటో" నసుకుతున్నాడు రాజయ్య.

"అంత కంగారు అయితే ఎలా?" రంగయ్య అడిగాడు రాజయ్యను.

రాజయ్యకు ఎందుకు కబురు పెట్టాడో తెలియక కంగారుగా ఉంది.

అక్కడ రంగయ్యతోపాటు, గ్రామంలోని ముఖ్యమైన వ్యక్తులు, పెత్తందార్లు, పైరవికార్లు పది, పదిహేను మంది దాకా కుర్చీల్లో ఆసీనులై వున్నారు.

"ఏం లేదురా రాజుగా! ఊరు నడిబొడ్డున ఒక బావి తవ్వాలిరా"

రంగయ్య గొంతు నుంచి మాటలు తూటాల్లా వచ్చాయి.

"అట్టాగేనండి"! రాజయ్య నమ్రతగా బదులు పలికాడు. బావి కోసం కేటాయించిన స్థలంలో అందరూ టెంకాయలు కొట్టారు, పూజలు చేశారు. నీళ్ళు పడాలని ముక్కోటి దేవతలకు మొక్కుకున్నరు.

రాజయ్యను పని ప్రారంభించమన్నాడు.

రాజయ్య బండమనిషి. మనసు మాత్రం బంగారం. హరిజనుడు. ఊరంతటికీ తలలో నాలుకలాగా ఉంటాడు. అతని జీవితంలో ఇంతే ఇమ్మని ఏ పనికి డిమాండ్ చేసిన దాఖలాలు లేవు.

అసలు తెలంగాణ పల్లెల్లో ఇటీవల వచ్చినటువంటి ఓపెన్ కాస్ట్ ప్రాజెక్టు తవ్వకాల వల్ల భూగర్భజలాలు అడుగంటిపాయె. పరిసరాలలోని సహజనీటి వనరులు దెబ్బతినడం వల్ల చుక్క నీరు దొరకక పల్లె కన్నీరు కారుస్తుంది.

ఓపెన్ కాస్టులతో, సెజ్‌లతో భూమిని కోల్పోయి పొట్ట చేతపట్టుకొని వలస పోతున్నటువంటి తెలంగాణ పల్లె ప్రజలకు తిరిగి తిరిగి నా అనే వాళ్ళులేక చివరికి ఉన్న వూళ్లోకి వచ్చారు. వాళ్ళలో రాజయ్య కూడా ఒకడు.

రాజయ్య ఉత్సాహంగా బావి తవ్వకాల్లో పడిపోయాడు. అతనికి తోడుగా మరో ఇద్దరిని సహాయంగా పెట్టుకున్నాడు.

రాజయ్య మిగతా ఇద్దరి సహాయంతో దాదాపు ఇరవై అడుగుల లోతైన బావిని తవ్వాడు. రెక్కలు ముక్కలైన జలఊట ఛాయ కూసింతైనా అవుపడలేదు. మరో రెండు అడుగులు తవ్వాడు. ఒకపక్క దాహం మరోపక్క శరీరమంతా చెమట ఏరులా పారుతుంది.

"దాహంగా వుంది నీళ్లు కావాలి" పైకి కేకపెట్టాడు. "ఆ కాస్త తవ్వు, పని అయ్యాక నీళ్ళు ఇస్తాం" రంగయ్య ఉరుముతూ కఠినంగా అన్నాడు.

ఇక తప్పేటట్లు లేదు అని సర్దిపెట్టుకున్నాడు రాజయ్యా! గడ్డ పారను అసహనంగా, కసిగా భూమిలోనికి దించాడు. పారకు "ఖల్" మని రాయి అడ్డు తగిలింది. ఆ రాయిని బలంగా ప్రక్కకు నెట్టి పైకి తీసి భూమి పైకి పంపాడు.

అప్పుడు కాస్త తడి తగిలింది.

అప్రయత్నంగా రాజయ్య నోటి వెంబడి... దొరగారు! గంగమ్మ తల్లి కనికరించిందిండి అనేమాట.

బావిపైన దొరలంతా ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బులైనారు. బావిలోపల రాజయ్యకు నోరు పిడసకట్టుకపోయింది.

తొలి నీటి ధార తనివితీరా దోసిళ్ళతో గొంతు తడుపుకుంటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇదంతా గమనించిన రంగయ్యకు ఒక ఆలోచన తలుక్కున మెరిసింది.

అంటరానివాడు నీల్లు తాగితే మైల పడిపోతాయని మూర్ఖంగా ఆలోచించాడు. వెంటనే పైన పని చేస్తున్న ఇద్దరిని వేరే పనికి పురామాయించాడు.

"గంగమ్మ తల్లికి రెండు చేతులు జోడించి, గంగమ్మను దోసిల్లలోకి తీసుకోవడానికి సిద్ధపడుతున్న రాజయ్య నెత్తిమీద బండరాయి పడింది.

నోటి వెంట పొలికేక వెలువడింది. అదే సమయంలో ఒకేసారి భూమి పొరల్లోంచి వచ్చిన విషవాయువు పైపైకి తన్నుకొచ్చింది. ఉక్కిరిబిక్కిరవుతున్న రాజయ్య నన్ను రక్షించండి దొరా అని కేక పెట్టాడు.

"ఒక రాయి పొరపాటున జారి బావిలో పడిపోయిందిరో" అని రంగయ్య కేకలు పెట్టాడు. రాజయ్య కొన ఊపిరి కాస్త బండరాయి నెత్తిమీద పడటంతో గాల్లో కలిసిపోయింది. బావి పైనంతా చుట్టూ మూగారు, కేకలు విన్న మిగిలిన ఇద్దరూ పనివాళ్లు పరిగెత్తుకొచ్చారు. ఒకడు గట్టు మీద ఉన్న త్రాడు తీసుకొని గబగబా బావిలోనికి దిగాడు. నిర్జీవంగా వున్న రాజయ్యను పైకి మోసుకొచ్చాడు.

పాపం రాజయ్య కుటుంబానికి "జలగండం రాసి వుంది కాబోలు అని" తలకొ మాట అంటున్నారు. అయితె అసలు నిజం ఒక్క రంగయ్యకే తెలుసు అది ఎప్పుడో సమాది అయి పోయింది.

# ఆత్మన్యూనత భావం వద్దు! ఆత్మగౌరవ బావుట ఎగరేద్దాం!!

- సూగూరి




నేటి సమాజంలో కులాల గురించి మాట్లాడుకోవడం అంటే గొంగట్లో అన్నం తింటూ వెంట్రుకల్ని ఏరడమే అవుతుంది. 'మనిషి' గురించి ఆలోచించడం అంటే బూతద్దం పెట్టి వెతకటమే. ఇది 'ఎల్పిజీ' యుగం. మనిషి సరుకైన తరుణం. ఆలోచనలకు రంగులులేవు. ఆవేశాలు లేవు. మోసాలు తప్ప. ఇలాంటి సంక్లిష్ట సామాజిక వ్యవస్థలో బి.సి.రైటర్స్ వింగ్ వారు డా॥చింతం ప్రవీణ్ సంపాదకత్వంలో వివిధ కులాలకు చెందిన దాదాపు ముప్పది ఎనిమిది మంది కవులతో నలభై ఒక్క కవితలతో బి.సి. అస్తిత్వ వాద యువకవిత్వం టాగ్‌లైన్‌తో "సమూహం" కవితా సంకలనాన్ని వెలువరించారు. ఇందులోని కవితలన్నీ ఉత్పత్తి కులాల కష్టాలను కన్నీళ్లను ప్రతిఫలించాయి.

అయితే ఈ కవితా సంపుటిలోని కవులందరూ ఒక చారిత్రక సత్యాన్ని విస్మరించారన్నది నిజం. ఈ మాట అనడం నిష్ఠూరమే అయినా, నిజం నిజమేకదా? ఎందుకంటే ఒకప్పుడు సామాజిక నిర్మాణంలో పునాదులైన ఉత్పత్తి శక్తులన్నీ కూడా కులాలుగా ఉండేవి. బతుకు దెరువు కోసం చేసే వృత్తి కులంగా ఎట్లా మారిందో, వాటికి నీచ-ఉన్నత అనే ముద్రలు ఎప్పుడు పడ్డాయో అని తెలుసుకోడానికి శోధించి... శోధించి డా॥బాబాసాహెబ్ అంబేద్కర్ ఈ దేశంలో కులం నిచ్చెనమెట్ల వంటిది అని చెప్పగలిగాడే కానీ, ఈ వ్యవస్థను పూర్తిగా నిర్మూలించే మందును కనుక్కోలేక పోయాడేమో అనిపిస్తుంది. కొంతలో కొంతైన 'రిజర్వేషన్ పద్ధతి' ఈ వ్యవస్థను మెరుగు పరుస్తుందని భావించి రాజ్యాంగంలో పొందుపరచడానికి పోరాడి సాధించాడు. కానీ అది భవిష్యత్తులో ఓటు బ్యాంక్‌గా మారిపోతుందని, చదువు, సమీకరించు, పోరాడు అనే దిశను దప్పి, కొందరి దశను మాత్రమే మారుస్తుందని ఆ మహానుభావుడు తన జీవిత కాలంలోనే గుర్తించ గలిగాడు. కాబట్టి కులానికి-దేవునికి తావులేని బౌద్ధాన్ని స్వీకరించి, నేను హిందువును కాదు అని ప్రకటించారు. అంతటి మేధావినే వ్యాకులపరచిన కుల వ్యవస్థ, దానికి పెట్టని కోటగా నిలిచిన హిందుత్వాన్ని కెలకడమంటే తేనెతుట్టెపై రాయి విసరడమే. "సమూహం'లో జ్వాలల్ని రగల్చడమే. 'అస్తిత్వం పేరిట' 1990 దశకం నుండే తెలుగు సాహిత్యంలో ఈ ధోరణి

ప్రారంభమైంది. మాకు అన్యాయం జరిగిందంటూ కులాలుగా, మతాలుగా, స్త్రీలుగా, పురుషులుగా విడిపోయి ఎవరికి వారు ఆవేశాన్ని-ఆవేదనను ప్రకటిస్తున్నారే తప్ప "మనం ప్రాథమికంగా మనుషుల సమూహం" అనే వాస్తవాన్ని గుర్తించి బాధ్యతగా ఉండేవాళ్లు ఈ వ్యవస్థలో మృగ్యమైపోయారు.

ఈ వాస్తవాన్ని గుర్తించిన 'సీతారాం' ఈ సంకలనానికి రాసిన ముందు మాటలో "ఈ సంపుటిలో భిన్న బి.సి. కులాలకు చెందిన కవుల స్వరాలను కొంచెం ఆలకించండి. ముఖ్యంగా యాదవులు, స్వర్ణకారులు, గౌడ కులాలకు చెందిన కవులు రాసిన కవితలను పరికించండి. స్వరభేదం, స్వరతీవ్రత మనకు తెలుస్తుంది. అదే విధంగా చాకలి, మంగలి కులాలకు సంబంధించిన కవితలను ఒకటికి పదిమార్లు చదివి చూడండి. స్వరహీనత, స్వరలుప్తత మనకు కనిపిస్తుంది అన్నారు." ఇది వాస్తవం.

అయితే "సీతారాం" తన పద్ధతిలో కవిత్వంలాగా విషయాన్ని కప్పిచెప్పాడు. "సీతారాం" పేర్కొన్న కులాలే కాకుండా పద్మశాలి, కాపులాంటి మరికొన్ని కులాలు కూడా ఇందులో ఉన్నాయి. సూక్ష్మంగా పరిశీలిస్తే ఒకే కులంలో కూడా మనకు స్వరభేదం కనిపిస్తుంది. పద్మశాలి, కాపు, స్వర్ణకారుల కులాల్లో అందలాల్లో ఊరేగుతున్నవాళ్లు ఉన్నారు. ఆత్మహత్యలు చేసుకుంటున్న వాళ్లూ ఉన్నారు. కాబట్టి సర్వరోగ నివారిణి పెన్సిలిన్ ఇంజక్షన్ అన్నట్లు బి.సి. కులాలన్నీ కష్టాల కొలిమిలో కాలిపోతున్నాయి అనే సూత్రీకరణ చేయడం సరికాదు.

ఇకపోతే ఈ సంకలనానికి రాసిన ముందు మాటలోనే "సీతారాం" "పాముచావకూడదు. కట్టె విరగకూడదు". అనే పద్ధతిలో "అధికశాతం జనాభా కలిగిన బి.సి.ల్లో ఇప్పటికీ ఐక్యత అన్నమాటే రావటంలేదు..." అని చరిత్రలో బి.సి.లను దోషులుగా నిలబెట్ట జూస్తున్న శక్తులు ఉన్నాయంటూ" ఒక ఆరోపణ చేసి, తనదైన పద్ధతిలోనే వీటిని "గురివింద గింజ రాజకీయాలు అని అనసూలేం. అనకుండా ఉండనూ లేము అని అస్పష్టప్రతిపాదన చేశాడు. నిజం చెప్పాలంటే బి.సి.ల్లో అనైక్యత వున్నమాట నిజం. కారణం ఒకప్పుడు ఈ దేశంలో బ్రాహ్మణుల్లోనే బ్రాహ్మనిజం ఉండేది. ఇప్పుడు బి.సి.ల్లో ఇది క్యాన్సర్‌లా వ్యాపించింది. ఇది సామాజిక సత్యం. భవిష్యత్తులో ఇది చారిత్రక సత్యంగా మారిపోయినా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు.

ఇక్కడ ఇంకో విషయాన్ని గమనించాలి. ఇవ్వాల కులం-మతం రాజకీయ చదరంగంలో పావులు అవుతున్నాయి. బతుకనేర్చినవాడికి బావుటాలు అవుతున్నాయి. బ్రాహ్మణిజానికి పునాదులు అవుతున్నాయి. మేధావులకు హెూదాల పీఠాలు అవుతున్నాయి. ప్రపంచీకరణ ప్రభావం మూలంగా చెట్టు పేరు చెప్పుకొని కాయలమ్ముకునే వ్యవహారం వాణిజ్య రూపందాల్చింది. ఈ ప్రపంచంలో మనిషి అనేవాడు కనిపించడం లేదు. విచిత్రం ఏమిటంటే సూర్యుని చుట్టు భూమి తిరుగుతున్నట్టు 'మనిషి' చుట్టే అవన్నీ తిరుగుతున్నాయి. ఈ ఊబిలోంచి బయటపడితేనే 'మనిషి' బతుకుతాడు. రండి మనిషిని బతికించుకుదాం. ఆత్మగౌరవ బావుటను ఎగరేద్దాం అని నినదించడం సులభమే కానీ, అది ఆచరణలో సాధ్యమవుతుందా అన్నది నాలోని సందేహం. ఎందుకంటే బి.సి. సబ్‌ప్లాన్ డిక్లరేషన్ సదస్సు వరంగల్లులోని యూనివర్సిటి ఆర్ట్స్ & సైన్స్ కళాశాల ఆడిటోరియంలో

2013 సెప్టెంబర్ 14-15 తేదీల్లో బి.సి. భారతంపేరిట జరిగింది. ఇది జాతీయ సదస్సు. కాకతీయ విశ్వవిద్యాలయం ఎస్.డి.ఎల్.సి.యి. పూర్వ సంచాలకులు ఆచార్య కె.మురళీ మనోహర్‌గారు ఈ సదస్సుకు నేతృత్వం వహించారు. ఇది ఒక చారిత్రాత్మక సంఘటన సందర్భంకూడా. వరంగల్లు రోడ్లన్నీ వివిధ కుల వృత్తుల వారి ఊరేగింపులతో సబ్బండ వర్ణాల జాతరగా మారిపోయాయి. ప్రారంభ-ముగింపు సమావేశాలు చాలా అద్భుతంగా జరిగాయి. ఎందరో మేధావులు బి.సి. రాజకీయనాయకులు ఈ సభల్లో పాల్గొని కర్తవ్య నిర్దేశం చేశారు.

అయితే ఈ రెండు సదస్సులకు మధ్య జరిగిన ఆయా కులాలవారి సభలు మాత్రం సందేహాలకు ఆస్కారాన్ని కలిగించాయి. నిర్వాహకులు ప్రతికులం వారికి ప్రత్యేక రూములను కేటాయించి వారి వారి సమస్యలను గురించి చర్చించండి. రాయండి. అన్ని కులాల స్థితిగతులను సమస్యలన్నింటిని కలిపి ఒక సమగ్రమైన నివేదికను రూపొందిద్దాం అన్నారు. కానీ ఆ సదస్సులు అలా జరగలేదు. మన సీతారాం ముందు మాటలో అన్నట్లుగా కొన్ని కులాల "స్వరాలు" మాత్రమే అక్కడ వినిపించాయి. అక్కడ బి.సి.ల్లో ఉండే అనైక్యత కూడా స్పష్టంగా కనిపించింది. కారణం రాజకీయ ప్రయోజనం. వ్యష్టిప్రయోజనం. ఆరోజు ఇక్కడ సీతారాం ఉండి ఉంటే బి.సి.లు ఐక్యంగా ఉండరని కొందరు కుట్రపూరిత మాటలు అంటున్నారు అనే మాటను రాసేవారు కాదు.

ఈ సందర్భంగా నాకు ఇంకో అనుభవం కలిగింది. నేను తెలంగాణ మలిదశ ఉద్యమసమయంలో తెలంగాణ రచయితల వేదికలో క్రియాశీలంగా పనిచేసి 'వరంగల్లు రచయితల ఐక్యవేదికను' స్థాపించడంలో సఫలీకృతున్ని అయిన తీరును పరిశీలించిన ఆచార్య మురళీమనోహర్ గారు బి.సి. కవులు -రచయితలను గుర్తించి ఒక వేదిక మీదకు తెచ్చే బాధ్యతను నాకు ఇచ్చారు. ఈ పని నేను చేయగలనని ఎంత ఉత్సాహంగా ముందుకెళ్లానో నాకు అంతకుమించిన నిరుత్సాహం ఎదురైంది. ఎప్పుడు ఎవరిని కులాలు అడగనివాడిని, కవులు - రచయితల కులాలను విచారించడం మొదలు పెట్టాను. వరంగల్లులో ఎక్కువగా దళితకవులే నాదృష్టికి వచ్చారు. ఆ తరువాత మైనారిటి కవులు. దొరికిన పిడికెడు మంది బి.సి.కవులతో మురళీ మనోహర్‌గారి ఆజ్ఞమేరకు మాకు కేటాయించిన హాల్లో కవి సమ్మేళనం నిర్వహిద్దామంటే ఎవ్వరూ రాలేదు. చివరిదాక నేనొక్కడినే మిగిలాను. పదే పదే అందరికి ఫోన్లు చేసి విఫలమయ్యాను. ఈ విషయంలో డా॥చింతం ప్రవీణ్ కుమార్ "బి.సి. రైటర్స్ వింగ్" ద్వారా కృషిచేసి 'సమూహం' పేరుతో బి.సి. అస్తిత్వవాద యువకవిత్వాన్ని పుస్తకంగా వెలువరించినందుకు అభినందిస్తున్నాను. ఈ అస్తిత్వం అవసరాల దృష్ట్యా ఏర్పడిందా? సమస్య దృష్ట్యా ఏర్పడిందా? అనే విషయాన్ని లోతుగా పరిశోధించి ముందుకు వెళ్తే డా॥ చింతం ప్రవీణ్ తప్పనిసరిగా లక్ష్యాన్ని సాధిస్తాడని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను. అందుకు ఊతగా నాకున్న అభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నాను.

మనిషి బతకాలంటే ఏదో ఒక పనిచేయాలి. పని అంటే శ్రమకు పర్యాయ పదం. అది చమటకు ప్రతిరూపం. సమాజ నిర్మాణానికి - జీవనానికి మూలధనం. కాబట్టి సమాజంలో

ఎవరో ఒకరు ఏదో ఒక పని చేయక తప్పదు. అది ఏ పనైనా సరే నీచమైందికాదు. దానికి "విలువ" కట్టేవాడు నీచుడు. ఆ విలువ ఆధారంగా ఆ పనిని చేసే వారికి గౌరవ-అగౌరవాలు ఇచ్చేవాడు నీచుడు. వీళ్లే సమాజంలో చీడపురుగులు. దోపిడి దారులు. ఇదీ అసలు రహస్యం. ఈ రహస్యాన్ని చెప్పకుండా మనుషులను కులాలుగా, మతాలుగా విడగొట్టి "గుడి చుట్టు తిరిగి గుళ్లోకి వెళ్లిన తరీక వాదాలు - వివాదాలు సృష్టిస్తున్నారు. పుట్టిన కులంకాదు ముఖ్యం. మనిషిలోని ఆలోచన ముఖ్యం అని ఎలుగెత్తి చాటిన మహనీయులకు కూడా కులాలను అంటగట్టి, మనిషిని మాయం చేస్తున్నారు. ఇది చాలా ప్రమాద కరమైన ప్రవర్తన.

కులం అనే ఈ కుబుసం వదలాలంటే బాబాసాహెబ్ అంబేద్కర్ అన్నట్లు 'చదవాలి', సమీకరించాలి, పోరాడాలి, అప్పుడే మనం మనుషులం అవుతాం. మాకు ఈ మార్కుల చదువులు వొద్దు-మనుషులుగా బతికే చదువులు కావాలి అనే దిశగా మన ఆలోచనలు సాగినప్పుడే కళాశాలలు, విశ్వవిద్యాలయాలు విజ్ఞాన నిలయాలుగా విరాజిల్లుతాయి. లేకపోతే డిగ్రీల సర్టిఫికెట్లను ఉత్పత్తి చేసే కర్మాగారాలుగా మిగిలిపోతాయి. కులాల కంపుతో కుమ్ములాటకు నిలయాలుగా మారుతాయి. ప్రస్తుతం ఈ దేశంలోని విశ్వవిద్యాలయాల పరిస్థితి ఇదే. సంప్రదాయ విద్యా-దూరవిద్య-సెల్ఫ్‌ఫైనాన్స్ కోర్సులు అనే ఊబిలో కూరుకపోయి ఒకవైపు ప్రభుత్వ పరంగా విద్యావిధానం కునారిల్లుతుంటే, కార్పోరేషన్ విద్యావిధానం ఎల్.పి.జి. ముసుగులో మూడు పువ్వులూ ఆరు కాయలుగా విరాజిల్లుతూ విద్యను వ్యాపారంగా మార్చివేసింది. ఒక్కసారి మనం ప్రజాకవి వేమనను గుర్తుచేసుకుంటే తప్ప ఈ ఊబిలో నుండి బయటపడలేం అన్నది నిజం.

"కులము గలుగు వాడు గుణము గలుగువాడు
విద్యచేత విర్రవీగువాడు
పసిడిగలుగువాని బానిస కొడుకులు"

ఈ దేశంలో పుట్టి, ఈ దేశంలో పెరిగి, ఇక్కడి గాలిని పీల్చి, ఈ నేల నీరు తాగి ఎదిగిన వాళ్లంతా, మాది ఉన్నతకులం మేమే మేథావులం అని విర్రవీగే వాళ్లంతా ఇవ్వాల ధనిక దేశంలో బానిసలుగా బతకటం చారిత్రక సత్యం కాదా ?

కులము లేనివాడు కలిమిచే వెలయును
కలిమి లేనివాడు కులము దిగును
కులముకన్న మిగులు కలిమి ప్రధానంబు

అన్న వేమన మాటలను ఒక్కసారి పరిశీలిస్తే ఈ దేశంలో తరతరాల నుండి "కలిమి చుట్టే కులం-మతం తిరిగిందన్న" నిజం చెలుస్తుంది.

కులవృత్తులను నీచంగా చూడకూడదని, వృత్తి అనేది బతుకునిచ్చేది. కాబట్టి అలాంటి వృత్తిని - ఆ వృత్తిని కొనసాగిస్తున్న సమాజంలోని శ్రామిక వర్గాన్ని నీచంగా పరిగణించే బ్రాహ్మనిజంపై వీరబ్రహ్మం ధ్వజమెత్తి వృత్తి జీవితానికి ఆత్మగౌరవాన్ని కలిగించిన చారిత్రక సత్యం మన ముందు వుంది.

ఇలా చెప్పుకుంటూపోతే, ప్రపంచమంతట ఎంతో మంది సంస్కర్తలు-మేధావులు కులవ్యవస్థను రూపుమాపడానికి, మతం మత్తువదలించడానికి ఎన్ని త్యాగాలు చేశారో ఒక్కసారి దృష్యమానం అవుతారు. విభాత సంధ్యగా చరిత్ర పుటల్లో మనకు కనిపిస్తారు. కాబట్టి మిత్రులారా! శ్రామిక వర్గానికి చెందిన మనం "కులం" ఊబిలో కూరుకపోయి ఆత్మన్యూనత భావాన్ని ప్రకటించడం భావ్యం కాదు. ప్రతికుల వృత్తిలో కళాత్మకత ఉంది. బతుకు దెరువు ఉంది. మన కళాత్మకతను దోపిడి చేసేవాన్ని, మన బతుకుల్ని చిద్రం చేస్తున్నవాన్ని నిలదీసి పాత రెయ్యాలే తప్ప. అయ్యో నేను దోపిడికి గురి అవుతున్నానంటూ, నా కులమే అన్నికుల వృత్తులకు మూలం అనే తీరులో ఉండకూడదు. ఎవరికి వారు మాకులం గొప్ప. మాకులం గొప్ప అనుకుంటూ పోతుంటే పాలకులకు విభజించు పాలించు అన్న ద్వంద్వ నీతిని ప్రదర్శించడానికి అవకాశం కలుగుతుంది. మనల్ని ఎదగనివ్వకుండా చేయడం వారికి సులువు అవుతుంది. చరిత్రలో ఇదే జరిగింది. ఇప్పుడూ ఇదే జరుగుతుంది. ఈ చరిత్రను తిరగరాయడానికి ఏమి చేయాలో ఆలోచిద్దాం.

ఇక "సమూహం" కవితా సంపుటి విషయానికి వద్దాం. కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, గౌడ, చాకలి, మంగలి - ఇలా వివిధ వృత్తుల్లోని కష్టాలను కన్నీళ్లను కవులు నిక్షిప్తంచేశారు. "సీతకష్టాలు సీతవి - పీత కష్టాలు పీతవి" అన్నట్లు ఎవరి కష్టాలు వాళ్ళకు ఉన్నాయి. కన్నీళ్లూ ఉన్నాయి. ఎదుటివారి బాధల్ని అర్థం చేసుకొని స్పందించే సమాజంలో మనం ఉన్నామా ? అలాంటి మనుషులు ఉన్నారా? ఆలోచించాలి. మొసలి కన్నీరు కార్చే వాళ్ళ వల్ల ప్రయోజనం ఏముంది.

ఎవరో తోడు వస్తారని
ఏదో మేలు చేస్తారని
ఎదురుచూసి మోసపోకుమా?
నిజం మరచి నిదుర పోకుమా?

అని శ్రీశ్రీ అన్నట్లు మనం మోసపోకూడదు. రచయితల్లారా! కవుల్లారా!! ఆలోచించండి. "కవిత్వాన్ని బాధకు పర్యాయ పదంగానే చూడకండి. బాధ్యతకు శక్తిరూపం" అని కూడా ఆలోచించండి. ఇవ్వాల వృత్తులు కులాల పరంగా లేవు. కానీ కులాలున్నాయి. ఇవి రాజకీయాల చుట్టు, మతం చుట్టు తిరుగుతూ సమిష్టి ప్రయోజనం కోసం కాకుండా వ్యష్టి ప్రయోజనం కోసం ఉపాధేయంగా అవుతున్నాయి. మన సమూహంలో ఉంటూ, మన సమూహం పేరు చెప్పుకొని, వాడుకొని ఎదిగిన వాళ్లు - ఉన్నత పదవుల్లో కావచ్చు, ఉద్యోగాల్లో కావచ్చు కుటుంబ పరంగా ఎదుగుతున్నారు. మనల్ని కరివేపాకులా వాడుకుంటున్నారు. అందుకే మన బతుకులు ఎక్కడేసిన గొంగడి అక్కడే అన్న తీరుగ ఉండిపోతున్నాయి. కాబట్టి కుల రాజకీయాలు, మతరాజకీయాల నుండి మన ఆలోచనల్ని నడవడికల్ని దారి మళ్ళించి ప్రజారాజకీయాలకు నాంది పలుకుదాం. అప్పుడే "మనిషి" అనే మాటకు అర్థం. మానవత్వానికి విలువ. బతుక్కు ఒకదారి.

# 'భూ'... చిత్రించిన నవల ప్రజల మనిషి

-దాసరి సంజయ్ కుమార్

నిజామాబాద్ జిల్లాలో కామారెడ్డి సమీపంలో దిమ్మగూడెం అనే గ్రామం ఉన్నది. ఆ గ్రామానికి దొర రాంభూపాలరావు. ఆయన కూతురు పెళ్ళికి కోటయ్య తన ఆవును పోగొట్టుకున్నాడు. ఆ పెళ్ళి అయిదురోజులకు కావల్సిన కూరగాయలు రైతులే అందించాల్సి వచ్చింది. ఆ గ్రామ ప్రజలు తమ ఇండ్లలోని పాలను బాగా కాచి తీసిన వెన్నను భద్రపరిచి నెయ్యి తయారు చేసి ఇవ్వాల్సివచ్చింది. తినుబండరాలు అందించే బాధ్యత కూడా గ్రామ వైశ్యుల నెత్తిన పడింది వీధులు శుభ్రపరిచే బాధ్యత భేగాడిపై పడింది. ఎన్నడులేంది కంఠీరవం కూడా దొరింటికి వెళ్ళాల్సివచ్చింది.

ప్రజల మనిషి అనే నవలలో వట్టికోట ఆళ్వార్ స్వామి చేసిన పెళ్ళి వర్ణన ఇది. దీని వల్ల 1938కి పూర్వం తెలంగాణ పెత్తందారి వ్యవస్థలో ప్రజలు ఆర్థిక దోపిడికి ఎలా గురయ్యారో తెలుస్తుంది. ఆ కాలంలో ఒక వైపు నిజాం నియంతృత్వ పాలన, మరోవైపు గ్రామంలో పెత్తందార్ల దోపిడి నిరాటంకంగా కొనసాగేది. దిమ్మగూడెం గ్రామానికి చెందిన కంఠీరవం తన అన్న దాష్టికం వల్ల పల్లె నడిచి నిజామాబాద్‌కు వెళ్తాడు. అక్కడి గ్రంథాలయ ఉద్యమంతో ప్రభావితుడై ప్రభుత్వాన్ని ఎదిరించే స్థాయికి ఎదగడంతో పాటు ప్రజల మనిషిగా కంఠీరవం ఎలా ఎదుగుతాడో ఈ నవల ద్వారా రచయిత వ్యక్తంచేశారు.

ఆనాటి రాజకీయ ఉద్యమాల ఫలితంగా 'మాలపల్లి' తర్వాత వచ్చిన నవలలో 'ప్రజల మనిషి' చెప్పుకోదగింది. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ పుట్టుకకు పూర్వం తెంగాణలోని రాజకీయ-సామాజిక వాతావరణాన్ని ఈ నవల చిత్రీకరిస్తుంది.

ఈ నవల 1955లో వెలువడింది. రచయిత 1946 నుండి 1953 సంవత్సరాల మధ్య కాలంలో నిజామాబాద్ జైల్లో వున్నప్పుడు ఈ నవలను ప్రారంభించి 1952లో ఆళ్వార్ స్వామి పూర్తి చేశారు. ఈ నవలలో భూమి సమస్య ప్రధానమైనది. దున్నేవాడికే భూమి అనే భావన తెలంగాణ రైతాంగంలో ఎంతగా పాతుకు పోయిందో ఈ నవల తెలియజేస్తుంది. కొమురయ్య భూమిని దొర రాంభూపాల్‌రావు ఆక్రమించుకొని భూమిని దున్నటానికి అరకలని పంపుతారు. వారిని అడ్డగిస్తూ కొమురయ్య తల్లి అన్నమ్మ "నా ప్రాణంపోయిన సరే భూమిని దున్ననివ్వము, ఇప్పుడు భూమి గుంజుకున్న వాళ్ళు రేపు మెడ పిసుకుతారు. ఎట్లాగైనమాయి కుక్కబతుకులే. ఎప్పుడో సచ్చేది ఇప్పుడే సస్తే..." అంటూ అరకలకి అడ్డుగా నిలుస్తుంది. భూమికోసం రైతులు తమ ప్రాణాలను కూడా ఖాతరు చెయ్యరని చెప్పడానికి ఈ సంఘటన నిదర్శనం.

మతం పరివర్తన విషయంలో కూడా భూసమస్యే ప్రధాన పాత్ర వహిస్తుంది. తమ బ్రతుకులు బాగుపడడానికి భూములు, కొలువులు ఇస్తామని సర్కారు చెప్పటం వల్ల తాము మతాలలో చేరినట్టు ముస్లిం సాహిబుగా మారిన మల్లిగాడు కోర్టులో చెబుతాడు. ఆర్యసమాజ ప్రచారకుడైన విజయదేవుడు గ్రామాల్లోని భూస్వామ్య వ్యవస్థలో జోక్యం చేసుకోవడాన్ని రాంభూపాల్ రావు సహించడు. దీనివల్ల వర్గ సంబంధాల్లో మౌలికంగా తేడాలు రానంతవరకే దోపిడి వర్గాలు కొన్ని విషయాలను సహించరనే నిజం వ్యక్తమైంది. దొర రాంభూపాలరావు నాగళ్ళు చెరువు లోతట్టులో దున్నడం ప్రారంబిస్తే గ్రామ ప్రజలంత సంఘటితంగా ప్రతిఘటిస్తారు. విజయం సాధిస్తారు. కొమురయ్య భూసమస్యతో రగిలిన ప్రజా చైతన్యానికి పరందామయ్య, కంఠీరవం వంటివాళ్ల సహాయం ప్రజలకు దోహదం చేస్తుంది. వారిలోని సామాజిక చైతన్యం ఎంతగానో తోడ్పడుతుంది. ఆంధ్రా మహాసభ ద్వారా పొందిన ఉత్సాహం వల్లనే గ్రామ ప్రజలు రాంభూపాలరావుతో భూసమస్యపై పోరాటం చేశారు. వట్టికోట ఆళ్వార్ స్వామి కేవలం రచయితనేకాదు. ప్రజాపోరాటాల్లో పాల్గొన్న కార్యకర్త. కాబట్టి ఆయన తన అనుభవాలనే ప్రజల మనిషి నవలలో చిత్రీకరించారు. ప్రజల మనిషి నవలలో నాయకుడైన కంఠీరవం మరెవరో కాదు వట్టికోట ఆళ్వార్ స్వామే.



# జాతీయ భావ వికాసానికి సాహిత్యము ఒక సాధనము

- డి. రామాచారి

ప్రపంచ నాగరికత నేపథ్యంలో జాతీయ భావవికాసం గూర్చి పరిశీలించినట్లయితే, మధ్యయుగాల నాటి అఖండ క్రైస్తవ కామన్‌వెల్త్ పాలన నాగరిక ప్రపంచాన్ని ఐక్యంగా ఉంచాలనే తపన మనందరికి తెల్సిందే అయినప్పటికిని, దేశభక్తికి - జాతీయ భావనాభివృద్ధికి - యుద్ధమే మూలమని చాలమంది చరిత్రకారుల అభిప్రాయం కదా! ఈ దృష్ట్యా పరిశీలిస్తే 1453 సంవత్సరంలో సుదీర్ఘకాలంపాటు సాగిన యుద్ధానికి కారణం ఇంగ్లాండ్-ఫ్రాన్స్ దేశాలు. ఆదేశ ప్రజలు యుద్ధాన్ని బలపరచి తమ దేశభక్తిని జాతీయభావాన్ని ప్రకటించుకున్న విషయం మనకు తెలిసిందే. ఇకపోతే విశ్వ నాగరికత ప్రపంచంలో "సాహిత్య-కళారంగాలను" స్పృశిస్తే ఫ్రెంచి పరిపాలనలో 14వ లూయి రాజు తగు విధంగా, తన సమయాన్నంత రాజ్యపు అనుదినవ్యవహారాలలో గడిపేవారు. అయినప్పటికిని, కళాకారులను, రచయితలను అన్ని రంగాలలోని ప్రతిభావంతులను, ఆహ్వానించేవారుకదా! కనుకనే చరిత్రలో "ఫ్రెంచి" సాహిత్యము - కళలు. విశ్వవ్యాప్తమయి వర్ధిల్లినవికదా! కనుక మన భారత జాతి వికాసానికి, జాతీయ భావ వ్యాప్తికి, మన రచయితలు, సాహితీవేత్తలు, కళాకారులు ఎందరో దోహదపడ్డ సంగతి తెల్సిందే.

బంగారు తెలంగాణ రాష్ట్ర అవతరణానికి కూడా అభ్యుదయ సంకల్పంతో మన కళాకారులు, సాహితీ వేత్తలు చేసిన అవిరళమైన కృషి, ప్రత్యేకించి మన రాష్ట్ర ప్రజల స్పందన అందుకు దోహదం చేసిన ఇప్పటికి జానపద పాటలు - ఆకర్షణీయమే. మన అందెశ్రీ, గోరటి వెంకన్న, నందిని సిద్ధారెడ్డి, సుద్దాల అశోకతేజ, డా॥వీరాచారి, దేశపతి శ్రీనివాస్, రసమయి బాలకృష్ణ, వల్స పైడి, విమలక్క తదితరులు ఎందరో మహానుభావులు తమ తమ అమూల్యమనై రచనల ద్వారా ప్రజల రాష్ట్ర కాంక్ష - జాతీయ భావవికాసానికి దోహదపడే రీతిలో దిశానిర్దేశం చేసిన సంగతి మనందరికి తెల్సిందే కదా !

అందుకేనేమో - ఆనందవర్ధనుడి కవిత్వానికి - నిర్వచనమైన క్రాంతదర్శనము - వామనుడి - అలంకార ప్రీతి, బామహుని-పురోశీర్షాలు కలగలసి పోసిట్లుండే మన తెలంగాణపాటలు

ఆటలు - ధూం... దాం.. అన్ని ఇన్నీ కావు అక్షరసత్యాన్ని సువర్ణాక్షరంగా మార్చిన - మహానుభావులు - మరెందరో, కనుకనే సాహిత్య ప్రక్రియ - జాతీయ భావ వికాసానికి సాధనంగా దోహదపడుతుంది కదా !

# కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత అంపశయ్య నవీన్ గారితో ముఖాముఖి

- డా॥ వి. వీరాచారి

**(అభ్యుదయ సాహిత్య త్రైమాసిక పత్రిక ప్రారంభ సంచిక కోసం ఇంటర్వ్యూ చేయడానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత డా॥ అంశయ్య నవీన్ గారిని అరసం కలిసింది. మేము ఏ కార్యక్రమం చేసినా మాకు వెన్నుదన్నుగా ఉంటూ మమ్మల్ని నిరంతరం ప్రోత్సహిస్తున్న నవీన్ గారు మా విన్నపాన్ని గౌరవించి ఇంటర్వ్యూ ఇచ్చారు. వారికి ధన్యవాదాలు)**

**1. రచయితల సంఘాల పట్ల మీ అభిప్రాయాన్ని తెలియచేస్తారా ?**

జ. రచయితల సంఘాల వల్ల రచయితలకు ఎంతో కొంత ప్రయోజనం కల్గాలి. రచయితలకు ముఖ్యంగా కావల్సినదేమిటంటే? వాళ్ళ రచనల ప్రచురణ - అలా ప్రచురించబడిన రచనలకు కొంత పారితోషికం ముట్టడం - కేరళ రాష్ట్రంలో రచయితల సహకార సంఘం అనే సంస్థ చాలా కాలం నుండి పనిచేస్తోంది. రచయితల రచనల ప్రచురణల విషయంలోనూ, పారితోషికం విషయంలోనూ ఈ సంస్థ చాలా గొప్ప విజయాలను సాధించంది. అలాంటి సంస్థే మన తెలంగాణ రాష్ట్రంలో ఏర్పడితే రచయితలకెంతో మేలు కల్గుతుంది.

**2. రచయితగా అర్ధశతాబ్దానికి పైగా సాగిన మీ సాహితీ ప్రస్థానంలో రచయితల సంఘాలతో మీకున్న అనుబంధాన్ని తెలియచేస్తారా ?**

జ॥ నేను కొంతకాలం అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడిగా ఉన్నాను. నల్లగొండలో పని చేసినప్పుడు నల్లగొండ జిల్లా రచయితల సంఘాన్ని స్థాపించడంలో కృషిచేశాను. అలాగే కరీంనగర్‌లో పనిచేస్తున్నప్పుడు కరీంనగర్ జిల్లా రచయితల స్థాపనలోనూ, నిర్వహణలోనూ చురుగ్గా పనిచేశాను. విద్యార్థిగా ఉన్నప్పుడే 1957లో వరంగల్‌లో కాళోజీ సోదరులు స్థాపించిన మిత్రమండలిలో చురుగ్గా పాల్గొనేవాడిని. మిత్రమండలి ఇప్పటికీ సజీవంగానే ఉంది.

**3. రాజకీయ-సామాజిక నిబద్ధతల పట్ల రచయితలకు ఏమేరకు బాధ్యత ఉండాలంటారు.**

జ॥ రచయితలకు స్వేచ్ఛ చాలా ముఖ్యం. రాజకీయ, సామాజిక నిబద్ధత విషయంలో రచయితల బాధ్యతను గూర్చి రచయితలే నిర్ణయించుకోవాలి.

**4. రచయితల సంఘాల్లో ఒకప్పుడు వున్న నిబద్ధత తపన ఈ కాలపు సంఘాల్లోని రచయితల్లో ఉందంటారా ?**

జ॥ ఈ రోజుల్లో రచయితల సంఘాలేవీ ఇదివరకటి సంఘాల్లాగా చైతన్యవంతంగా పని చేస్తున్నాయా? అని నా సందేహం. ఏదైనా ఒక సంఘం కొంతకాలం నిబద్ధతతో, ఉత్సాహవంతంగా పనిచేసినా అది ఎంతోకాలం నిలవడం లేదు. రచయితల సంఘాల్లో నిబద్ధతతో పనిచేసే కర్యకర్తలు కూడా తగ్గిపోతున్నారు.

**5. ఒకప్పుడు కళకళ కోసమే అన్న భూస్వామ్య సంస్కృతిపై తిరుగుబాటు చేసి 'కళకళకోసం కాదు ప్రజలకోసం' అంటూ ప్రజాస్వామ్య (సంస్కృతికి) భావాలకు పునాదులు వేసిన కవులు - కళాకారులు ఇవ్వాల కళ ప్రభుత్వ ప్రచారాలకే అన్న స్థితికి వచ్చారన్న అపవాదు వినిపిస్తుంది. మీరేమంటారు.**

జ॥ 'కళ కళ కోసమే' అన్న వాదాన్ని ఇప్పుడెవరూ అంగీకరించడంలేదు. "కళ కళకోసం కాదు-ప్రజలకోసం" అనే వాదాన్నే ఇవ్వాల్టి రచయితలు అనుసరిస్తున్నారు. అందరు కారు గానీ కొందరు రచయితలు ప్రభుత్వ ప్రచారాలకు అంకితమైపోతున్నమాట నిజమే. ప్రభుత్వ పోషణవల్ల చాలా ప్రయోజనాలున్నాయని వాళ్ళు భావించటమే అందుక్కారణం అనుకుంటాను.

**6. మీ సుదీర్ఘ సాహిత్య జీవితంలో అనేక రచయితల సంఘాలను చూసి ఉంటారు. వాటిల్లో అరసంతో మీకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంబంధం ఉండి ఉంటుంది. ఆ విషయాలు తెలియచేస్తారా ?**

జ॥ 1960లోనూ, 1970లోనూ నేను అరసంలో క్రియాశీల సభ్యుడిగా పనిచేశాను. మద్రాసులో ఉంటున్న కొందరు రచయితల కారణంగా అరసం రెండుగా చీలిపోయింది. 1970లో హైదరాబాద్‌లో అభ్యుదయ రచయితల సాహిత్యవేదిక నిర్వహించిన సభలకు శ్రీశ్రీ ముఖ్య అతిథిగా ఆహ్వానించబడ్డారు. కానీ ఆయన్ను ఆ సభలకు రానివ్వకుండా ఆపేసి విరసం అనే విప్లవ రచయితల సంఘాన్ని ఆయననే అధ్యక్షుడిగా నియమించి స్థాపించారు. రచయితల సంఘాల్లోకి రాజకీయాలు ప్రవేశించాయని భావించి నేను రచయితల సంఘాలతో సంబంధాల్ని తెంచేసుకున్నాను.

**7. అభ్యుదయ సాహిత్య పత్రికను పునఃప్రారంభిస్తున్నాం. గతంలో ఆ పత్రిక చేసిన సాహిత్య సేవను? ఇప్పుడు ఆ స్థాయిలో పత్రికను నడపడానికి మేము చేయవలసిన కృషికి సంబంధించిన సూచనలను సలహాలను తెలియచేస్తారా ?**

జ॥ 'అభ్యుదయ' పత్రికను పునఃప్రారంభిస్తున్నందుకు సంతోషం. పూర్వపు స్థాయిలో 'అభ్యుదయ'ను వెలువరించటానికి తీవ్రంగా కృషి చెయ్యవలసి ఉంటుంది. ఇప్పుడున్న సమస్య ఏమిటంటే మంచి లోతైన, విశ్లేషణాత్మకమైన వ్యాసాలు రాసే రచయితల కొరత - మంచి రచనలు చేసేలా రచయితలను మోటివేట్ చేసి వాళ్ళకు కొన్ని నిర్దిష్టమైన సూచనలిచ్చి వారిచేత మంచి రచనలు చేయించాలన్నది నా ప్రధానమైన సూచన.

**8. ప్రపంచ చరిత్రలోనే మైలురాయిగా నిలిచిన తెలంగాణ విమోచనోద్యమాన్ని కాలరేఖలు నవలలో చిత్రించారు. అహింసాయుతంగా సాగిన తెలంగాణ రాష్ట్రసాధన ఉద్యమానికి కూడా అంతటి పేరు ఉంది. ఈ ఉద్యమ నేపథ్యంలో నవలను రాయాలన్న ఉద్దేశం మీకేమైనా ఉందా ?**

జ॥ తెలంగాణ మలిదశ ఉద్యమాన్ని చిత్రించే నవల రాయాలని రెండు మూడేళ్ళుగా ఆలోచిస్తున్నాను. తప్పకుండా రాస్తాను.

**9. మీరు కథరాసినా-నవలరాసినా వాస్తవికతకు దర్పణం పడతారు. వస్తువైవిధ్యానికి ప్రాముఖ్యతనిస్తారు. మనకు తెలియని మనలోని మనిషిని సమాజాన్ని దృశ్యమానం చేస్తారు. ఇలా రాయడం కోసం మీరేమైన హెూమ్‌వర్కు చేస్తారా ?**

జ॥ హెూమ్‌వర్క్ చెయ్యకుండా నేను యే రచనను కూడా ప్రారంభించను. నేను ఎవరితో కాసేపు మాట్లాడినా ఆవ్యక్తి మానసిక పరిస్థితి ఎలా ఉందో తెలుసుకునే ప్రయత్నం చేస్తాను. నా రచనల్లో పాత్రల అంతరంగాన్ని చిత్రించే ప్రయత్నం చేస్తాను.

**10. చివరిగా, దేశభాషలందు తెలుగులెస్స అంటారు ? మిగతా భారతీయభాషలను, అందులోనూ దక్షిణాది భాషలతో పోల్చుకుంటే జ్ఞానపీఠ పురస్కారాలు తెలుగులో లెస్సుగానే ఉన్నాయి. విశ్వనాథ తరువాత దాదాపు ఇరవై ఏండ్లకు సినారెకు ఇచ్చారు. అయనకిచ్చి ఇరవై ఏండ్లు దాటిన తరువాత ఈ పురస్కారం రావూరి భరద్వాజ గారికి దక్కింది. ఈ ఆలస్యానికి కారణాలు ఏమై ఉంటాయి.**

జ॥ జ్ఞానపీఠ పురస్కారాల విషయంలో మనమేమీ చెయ్యలేం - తెలుగుకు అన్యాయం జరుగుతున్నదన్న బాధ చలా మందిలో ఉంది. తెలుగులోని గొప్ప రచనలు ఇతర భాషల్లోకి ముఖ్యంగా హిందీ, ఇంగ్లీషు భాషల్లోకి అనువదించబడలేదు. ఒకవేళ అనువాదాలొచ్చినా వాటిని పెద్ద ప్రచురణల సంస్థలు ప్రచురించలేదు. ఈ కారణం వల్ల తెలుగురచయితలకు లభించాల్సినంత ప్రచారం లభించలేదు.

**11. నేటియువ రచయితలకు మీరిచ్చే సూచనలు? సలహాలు.**

జ॥ నేటి రచయితలు ఎక్కువగా కవిత్వాన్ని రాస్తున్నారు. కవిత్వం విపరీతంగా వెలువడటం వల్ల అది చాలా పలుచబడిపోతున్నది. ఈనాటి రచయితలకు రాయాలన్న ఉత్సాహం దండిగానే ఉందిగాని అందుకు తగిన కృషిగానీ, క్రమశిక్షణగానీ వాళ్ళలో కొరవడుతున్నాయి. ఇదివరకటి సాహిత్యాన్ని వాళ్ళు అధ్యయనం చేసి రాయటంలోని మెళకువల్ని తెలుసుకోలేకపోతున్నారు. ఇప్పటి రచయితలకు నేనిచ్చే సూచన ఇదే. రాయటాన్ని సీరియస్‌గా తీసుకోండి. మీలో సహజమైన ప్రతిభ ఉంటే దానిని అభివృద్ధి చేసుకోండి. సహజమైన ప్రతిభ లేనప్పుడు రాయటం జోలికి వెళ్ళకండి. యేది రాసినా అవి మీ హృదయంలోంచి వెలువడాలి. ఇదివరకెప్పుడో చలంగారన్నట్టు మీ హృదయంలో కలం ముంచి రాయండి.

12 మన తెలంగాణ | www.manatelangana.news జయశంకర్ జిల్లా వార్తలు | గురువారం | 6 జులై 2017

# నా వృత్తి రాజకీయాలు.. ప్రవృత్తి సాహిత్య అభిరుచి







● స్పీకర్ సిరికొండ మధుసూదనాచారి

మనతెలంగాణ/కెయు క్యాంపస్, వరంగల్: నావృత్తి రాజకీయాలు అయినా ప్రవృత్తి సాహిత్య అభిరుచి, అభిమానమే అని తెలంగాణ రాష్ట్ర శాసనసభ తొలి స్పీకర్ సిరికొండ మధుసూదనాచారి అన్నారు. కాకతీయ విశ్వవిద్యాలయం దూర విద్య కేంద్రంలోని జాఫర్ నిజాం సెమినార్‌హాల్‌లో బుధవారం సాయంత్రం పూలే ఆశయసాధన సమితి(పాస్) ఆధ్వర్యంలో పాస్ వ్యవస్థాపక అధ్యక్షులు డాక్టర్ సంగని మల్లేశ్వర్ అధ్యక్షతన, పాస్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డాక్టర్ వి.వీరాచారి రాసిన రాగాలు-భావాలు, అభ్యుదయ-భావగీతాలు పుస్తకాన్ని ఆవిష్కరించారన్నారు. ఈ సందర్భంగా ముఖ్యఅతిథిగా విచ్చేసిన స్పీకర్ మాట్లాడుతూ తనకు ఇప్పుడు 60 సంవత్సరాల వయస్సు ఉందని అందులో 35 సంవత్సరాలుగా రాజకీయాల్లో ఉన్నానని, నేను చదువుకున్న వాడినని, చదువుకొనే వాడినని కాదని ఆయన చెప్పారు. గానుగలాంటి నా నిత్య బిజీ జీవితంలో నుంచి బయటకు రావడానికి ఇలాంటి కార్యక్రమాలు మానసిక ప్రశాంతతకు దోహదపడుతాయని మధుసూదనాచారి తెలిపారు. నేను పరకాలలో చదువుకునేటప్పుడు కాకతీయ యూనివర్సిటీలో చదువుకోవాలనే కోరిక ఉండేదని, కాకతీయ యూనివర్సిటీలో చదువుకునే రోజుల్లో తనకు పాఠాలు చెప్పిన ప్రొఫెసర్ల లాగా ఎదగాలనే ఆకాంక్ష ఉండేదని ఆయన తెలిపారు. యూనివర్సిటీలో చదువుకోవాలనుకోవడం తపన, భావన కలగా ఉండేదని ఆ కల నెరవేరిందని మధుసూదనాచారి చెప్పారు. నాకు కూడా కవిత్వాలు,కథలు, పద్యాలు రాయడం అలవాటు ఉందని తెలిపారు. అనేక వేదనలకు, సంఘర్షణలకు కవులు, రచయితలు స్పందించాలని ఆయన కోరారు. వాస్తవాల ఆధారంగా మానవీయ కోణంలో రచనలు రావాలన్నారు. అక్షరాస్యత పెరిగే కొద్ది స్వార్థం పెరుగుతుందన్నారు. డాక్టర్ వి.వీరాచారి సమాజాన్ని జాగృతం చేయడానికి దోహదపడాలని వీరాచారిని కోరారు. రాగాలు-భావాలు పుస్తకాన్ని వీరాచారి స్పీకర్‌కు అంకితమిచ్చారు. ఈ కార్యక్రమంలో పాస్ ఉమ్మడి వరంగల్ జిల్లా అధ్యక్షులు డాక్టర్ వల్లూరి రాంచంద్రం, కెయు ఎస్‌సి, ఎస్‌టి సెల్ డైరెక్టర్ ఈసం నారాయణ, పరకాల, జడ్పీటిసి పాడి కల్పనాదేవి, టిఆర్‌ఎస్ నాయకులు ప్రతాప్‌రెడ్డి, పాస్ నాయకురాలు అనురాధ, శ్రీధర్, ఈశ్వర్‌కుమార్, వంగాల సుధాకర్, పి.పద్మ, వీరస్వామి, మురళి, సూర్యకిరణ్, సుమన్, నివాస్, వెంకటేష్, ప్రశాంత్, సాహిత్య ప్రియులు కవులు, పాస్ సభ్యులు తదితరులు పాల్గొన్నారు.

# తెలుగు సాహితీ శిఖరం సినారె



మన తెలంగాణ/హైదరాబాద్ : తెలుగు సాహితీ ప్రపంచంలో తన కవిత్వాన్ని, వక్తృత్వాన్ని ఒక విలక్షణ రీతిలో నడిపి నందుకు ఎందరో తనకు అనుయా యులుగా మారారని తెలంగాణ సారస్వ త పరిషత్తు ప్రాచ్య కళాశాల ప్రధానాచా ర్యులు డాక్టర్ చంద్రశేఖర్‌రెడ్డి అన్నారు. తెలంగాణ అభ్యుద య రచయితల సంఘం (అరసం), తెలంగాణ సార స్వత పరిషత్తు ప్రాచ్య కళాశాల పూర్వ విద్యార్థుల సంఘం సంయుక్తాధ్వర్యంలో తెలంగాణ సారస్వ త పరిషత్తులో సోమవారం సాయంత్రం జరిగిన ఆచార్య సి.నారాయణరెడ్డి సంస్మరణ సభ, కవి సమ్మేళనానికి అయన ముఖ్య అతిథిగా హాజరయ్యా రు. కందిమళ్ల ప్రతాపరెడ్డి మాట్లాడుతూ, ప్రజానాట్య మండలికి భగత్‌సింగ్‌పై సినారె రాసిన బుర్రకథ, వందేమాతర గీతం వరస మారుతుందన్న పాట రచన వెనుకున్న నేపథ్యాన్ని తెలిపారు. మాజీ ఎం.పి ఎస్.రామ చంద్రారెడ్డి ప్రసంగిస్తూ, సినారేలోని మానవతా పార్శ్వా న్ని ఎత్తి చూపారు. సాహిత్య విమర్శకుడుగా సినారేను లక్ష్మణ చక్రవర్తి సోదాహరణంగా తెలిపారు. ఈ సభకు అధ్యక్షత వహించిన రాపోలు సుదర్శన్ పరిషత్తుతో, అరసంతో సినారేకున్న అనుబంధాన్ని వివరించారు. సభానంతరం జరిగిన కవి సమ్మేళనంలో అమ్మంగి వేణుగోపాల్, నాళేశ్వరం శంకరం, కంశ్రీ, చెన్నకేశవ రెడ్డి, పరమాత్మ, నాగభూషణం, కొండపల్లి నీహారిణి, అవధాని అంజయ్య, కేవీఎల్, పి.కమల, [illegible] సినారేపై తమ కవితల్ని వినిపించారు.

# 'వేల్పుల'కు తెలుగువర్సిటీ కీర్తి పురస్కారం

గోదావరిఖని(రామగుండం): తెలుగు సాహిత్యంలో అభ్యు దయ సాహిత్యోద్యమానికి కృషి చేస్తున్న గోదావరిఖనికి చెందిన సింగరేణి మాజీ ఉద్యోగి, అభ్యుదయ రచయితల సంఘం రాష్ట్ర కార్యదర్శి వేల్పుల నారాయణను తెలుగు యూనివర్సిటీ 2016 సంవత్సరానికిగాను కీర్తి పురస్కారాన్ని ప్రకటించింది. నారాయణ 1960 నవంబర్ 10న పెద్దపల్లి జిల్లా కాల్వ శ్రీరాంపూర్ మండలం [illegible] గ్రామంలో రాజయ్య, రాజమ్మకు జన్మించారు. కొలనూర్ హైస్కూల్‌లో పదో తరగతి పూర్తి చేశారు. మెకానికల్ ఇంజినీరింగ్‌లో డిప్లొ మా, సోషియాలజీలో పోస్టు గ్రాడ్యుయేషన్ పూర్తి చేశారు. 1974 నుంచే సాహిత్యం రాయడం ప్రారంభించారు. 2014లో జరిగిన తెలంగాణ అభ్యుదయ రచయితల సంఘా నికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. 2013లో అఖిల భారత అరసం కార్యవర్గ సభ్యుడిగా ఎన్నికై జాతీయ సాహిత్య కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటున్నారు. ఓ వైపు రచయితల సంఘం కార్యక్రమాలు కొనసాగిస్తూనే విస్తృతంగా సాహితీ రచనలు చేశారు. [illegible] (నవల), ఎద నాదాలు, ప్రభాతగీతం పాటల సంపుటాలు, [illegible] భూమి, చురక కవితా సంపుటాలు సొంతంగా రాసి ప్రచురించారు. గ్రామీణపోరాట గీతాలు, అనేక కవితా, పాటల సంకలనాలకు సంపాదకత్వం వహించారు. సింగరేణి గని కార్మికులపై



వేల్పుల నారాయణ



నారాయణ సంపుటి

చైతన్య గీతాలు రాసి 'సింగరేణి సిరిమల్లె' ఆడియో క్యాసెట్ తీసుకు వచ్చారు. మూడు దశా బ్దాలకుపైగా జర్నలిస్టు గా పనిచేస్తూనే రాజకీ యాలపై '[illegible]', ముల్లుగర్ర కాలం రాశారు. సాహితీ సేవలకు గుర్తింపుగా గతంలో ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు, రచయిత తుమ్మల వెంకట్రామయ్య పురస్కారం అందుకున్నారు. తెలుగు యూనివర్సిటీ కీర్తి పురస్కారాన్ని ఆగస్టు 15న అందుకోబోతున్నారు. ఆయనకు పురస్కారం రావడం పట్ల పలు సాహితీ సంస్థలు, కార్మిక సంఘాలు, కార్మికులు సంతోషం వెలిబుచ్చారు.

సాక్షి Sun, 30 July 2017
epaper.sakshi.com/c/[illegible]

## ఉద్యమంలో అభ్యుదయ సాహిత్యానిది కీలక భూమిక: సీపీఐ

హిమాయత్‌నగర్: తెలంగాణ ఉద్యమ తొలిదశ నుంచి మలిదశ ఉద్యమం వరకు ప్రజలను చైతన్యవంతులను చేసి ఏకతాటిపై నడిపించడంలో అభ్యుదయ సాహిత్యం పాత్ర ఎంతో కీలకమని సీపీఐ రాష్ట్ర కార్యదర్శి చాడ వెంకట్‌రెడ్డి అన్నారు. తెలంగాణ రాష్ట్ర సాధన వరకు కవులు, రచయితలు సాహిత్యం ద్వారా ఉద్యమ స్ఫూర్తిని రగిల్చారని పేర్కొన్నారు. తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ దినోత్సవాల సందర్భంగా మఖ్దూంభవన్‌లో అభ్యుదయ రచయితల సంఘం(అరసం) ఆధ్వర్యంలో కవిసమ్మేళనం నిర్వహించారు. 'అభ్యుదయ' త్రైమాసిక పత్రికను వెంకట్‌రెడ్డి ఆవిష్కరించారు. సంఘం అధ్యక్షుడు వి.వీరచారి అధ్యక్షతన నిర్వహించిన ఈ సమ్మేళనంలో రచయితలు కందిమళ్ల ప్రతాప్‌రెడ్డి, వాసిరెడ్డి భాస్కర్‌రావు, వేల్పుల నారాయణ, రాపోలు సుదర్శన్, కన్నం లక్ష్మీనారాయణ, పల్లేరు వీరస్వామి, కాళిదాసు, బందారు సుజాత, నాగభూషణం, కొండపల్లి నిహారిణి, కమల్‌రెడ్డి, తిరుపాల్ తదితరులు పాల్గొన్నారు. తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమానికి ఎలా ఊతం ఇచ్చారో..రాష్ట్రం వచ్చిన తర్వాత పాలనా పరిస్థితులు, ప్రభుత్వ తీరుపై ప్రజలకు అవగాహన కల్పించేదిశగా ముందుకు వెళ్లాలని, ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షలను నెరవేర్చడంలో ప్రభుత్వం విఫలమవుతున్న తీరును ప్రజలకు పాటలు, పద్యాలు, రచనల ద్వారా వివరించాలని చాడ పిలుపునిచ్చారు.



అభ్యుదయ త్రైమాసిక పత్రికను ఆవిష్కరిస్తున్న చాడ, అరసం ప్రతినిధులు

ఆంధ్రజ్యోతి Mon, 05 June 2017
epaper.andhrajyothy.com//c/19579532

08 నమస్తే తెలంగాణ గురువారం 06, జులై 2017

## రచనలతో మానసిక ప్రశాంతత : స్పీకర్



పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న స్పీకర్

హన్మకొండ, నమస్తేతెలంగాణ : మానసిక ప్రశాంతతకు రచనలు దోహదపడతాయని స్పీకర్ సిరికొండ మధుసూదనాచారి అన్నారు. డాక్టర్ వీరాచారి రచించిన 'రాగాలు-భావాలు' అనే అభ్యుదయ భావ గీతాల పుస్తకాన్ని కేయూ దూరవిద్య జాఫర్ నిజాం హాల్‌లో బుధవారం సాయంత్రం ఆవిష్కరించి మాట్లాడారు. వాస్తవాల ఆధారంగా మానవీయ కోణాలను రచించాలన్నారు. అక్షరాస్యత పెరిగినకొద్దీ స్వార్థం పెరుగుతుందని డాక్టర్ వీరాచారి సమాజాన్ని జాగృతం చేయడానికి దోహదపడే పుస్తకాలను రచించారని తెలిపారు. ఈ సందర్భంగా వీరాచారి తన పుస్తకాన్ని స్పీకర్‌కు అంకితమిచ్చారు. పూలే ఆశయ సాధన సమితి వ్యవస్థాపక అధ్యక్షుడు సంగని మల్లీశ్వర్ అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో పాస్ ఉమ్మడి జిల్లా అధ్యక్షుడు వీ రాంచంద్రం, కేయూ ఎస్సీ, ఎస్టీ సెల్ డైరెక్టర్ నారాయణ, పరకాల జడ్పీటీసీ కల్పనాదేవి, టీఆర్ఎస్ నాయకులు ప్రతాప్‌రెడ్డి, పాస్ నాయకులు అనురాధ, ఈశ్వరకుమార్, సుధాకర్, పద్మ, వీరస్వామి, మురళీ, సూర్య కిరణ్, సుమన్, నివాస్, వెంకటేశ్, ప్రశాంత్‌తో పాటు సాహిత్య ప్రియులు, కవులు పాల్గొన్నారు.




అధ్యక్షోపన్యాసం చేస్తున్న డా॥రాపోలు సుదర్శన్, కార్యనిర్వాహక కార్యదర్శి అరసం తెలంగాణ రాష్ట్రం. సి.పి.ఐ. రాష్ట్ర కార్యదర్శి చాడ వెంకట్‌రెడ్డి, ఆదిరెడ్డి తదితరులు



తేది:16-07-2017 ఆదివారంనాడు డా॥వి.వీరాచారి గారి 'మనిషిగా బతకాలని ఉంది' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న బి.సి.కమీషన్ ఛైర్మన్ బి.ఎస్.రాములు.



తేది:16-07-2017 ఆదివారంనాడు బి.సి.కమీషన్ ఛైర్మన్ బి.ఎస్.రాములు గారికి 'మనిషిగా బతకాలని ఉంది' పుస్తకాన్ని అంకితమిస్తున్న డా॥వి.వీరాచారి.




తేది:16-07-2017 ఆదివారంనాడు జరిగిన 'మనిషిగా బతకాలని ఉంది' పుస్తకావిష్కరణలో ప్రసంగిస్తున్న కవి డా॥వి.వీరాచారి గారు




దీక్షలో కూర్చున్న అరసం రాష్ట్ర అధ్యక్షులు డా॥వి.వీరాచారి, ప్రధాన కర్యాదర్శి వేల్పుల నారాయణ, కార్యవర్గ నిర్వాహక కార్యదర్శి డా॥రాపోలు సుదర్శన్, సాహితీ స్రవంతి బాధ్యులు డా॥భూపతి వెంకటేశ్వర్లు వివిధ సంఘాల రచయితలు, కవులు.



తేది:20-08-2017 ఆదివారంనాడు తెలంగాణ మలిదశ ఉద్యమం – నా రచనలు, అనుభవాలు ఈ అంశంపై అరసం కార్యాలయంలో ప్రసంగిస్తున్న వెలపాటి రామారెడ్డి



సినారె జన్మదినం సందర్భంగా పూలమాల వేస్తున్న కె.యు.తెలుగు శాఖాధ్యక్షులు డా॥వేలూరి శ్రీదేవి, డా॥ వీరన్న, డా॥సుజాత, అరసం రాష్ట్ర అధ్యక్షులు డా॥వి.వీరాచారి



ఆచార్య కొత్తపల్లి జయశంకర్ గారి జయంతి సందర్భంగా జయశంకర్ విగ్రహానికి పూలమాల వేసి నినాదాలు చేస్తున్న అరసం రాష్ట్ర అధ్యక్షులు డా॥వి.వీరాచారి తదితరులు

## యువత సినారెను స్ఫూర్తిగా తీసుకోవాలి

అరసం రాష్ట్ర అధ్యక్షుడు డాక్టర్ వీరాచారి ఉద్బోధ



సినారె చిత్ర పటానికి నివాళులర్పిస్తున్న శ్రీదేవి, వీరాచారి తదితరులు

**కేయూక్యాంపస్(కాళోజీ జంక్షన్):** తెలుగు సాహిత్యంలో కీర్తి పతాకాన్ని జాతీయ స్థాయిలో నిలిపి జ్ఞానపీఠ అవార్డు సాధించిన డాక్టర్ సి.నారాయణరెడ్డిని యువతరం స్ఫూర్తిగా తీసుకోవాలని అరసం రాష్ట్ర అధ్యక్షుడు,వరంగల్ సీకేఎం కళాశాల తెలుగు శాఖాధ్యక్షుడు డాక్టర్ వీరాచారి పిలుపునిచ్చారు. శనివారం కేయూ తెలుగు విభాగం శాఖాధ్యక్షురాలు డాక్టర్ వేలూరి శ్రీదేవిఅధ్యక్షతలో సినారె జయంతిని నిర్వహించారు. ముఖ్యఅతిథిగా హాజరైన వీరాచారి మాట్లాడుతూ..సినారె సాహిత్య విస్తృతాన్ని, గాఢత్వాన్ని వివరించారు. ప్రతీ పుట్టిన రోజు కు ఓ నూతన కవితా సంపుటిని తీసుకువచ్చిన గొప్ప సాహితీ పరిశోధకు ఉన్నారు. తెలంగాణ రచయిత సంఘం అధ్యక్షుడిగా నిజాం కాలంలో నే పనిచేశారన్నారు. శ్రీదేవి మాట్లాడుతూ.. సినారె సాహిత్యాన్ని ప్రతి సాహిత్య విద్యార్థి అధ్యయనం చేయాలన్నారు. కేయూ రాజనీతి శాస్త్రం ప్రొఫెసర్ జి.వీరన్న, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ విభాగం హెడ్ సుజాతకుమారి,డాక్టర్ ఈదుల చంద్రమౌళి, తెలుగు పరిశోధకులు మర్రిగాల పద్మారాయణరెడ్డి గుండెం చంద్రశేఖర్, కిశోర్, తదితరులు పాల్గొన్నారు.



కె.యు. తెలుగు విభాగం అధ్యక్షులుగా నియామకమైన డా॥ వేలూరి శ్రీదేవి గారికి అభినందనలు తెలుపుతున్న డా॥ వి.వీరాచారి, అధ్యక్షులు, అరసం, తెలంగాణ రాష్ట్రం




ప్రసంగిస్తున్న తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య ఎస్. వి. సత్యనారాయణ




ప్రసంగిస్తున్న తెలంగాణ రాష్ట్ర గ్రంథాలయ సంస్థ చైర్మన్ డా॥అయాచితం శ్రీధర్




ప్రసంగిస్తున్న తెలంగాణరాష్ట్ర సాహిత్య అకాడమీ సంచాలకులు డా॥నందిని సిధారెడ్డి

# అభ్యుదయ త్రైమాసిక పత్రిక చందా వివరాలు

| | | |
|---|---|---|
| విడి పత్రిక | : | రూ. 25/- |
| సంవత్సర చందా | : | రూ. 100/- |
| జీవిత చందా | : | రూ. 2000/- |

**అభ్యుదయ త్రైమాసిక పత్రికను చదవండి-**
**తెలుగు భాషా సంస్కృతులను పరిరక్షించండి**

PRSV-M02A101



# తెలంగాణ

అడవుల కొండల అనుంగుబిడ్డలు
పొలాల పొత్తిట పెరిగిన పాపలు
లేచిరి క్రోధోద్ధత భీకరులై
సమరోద్ధృత కాక్షేయక కరులై
తళతళ తళతళ మెరిసెను కొడవలి
ఎగసి ఎగసి నర్తించెను నాగలి.
పుట్టకీటుతో కదిలి రాచరిక
అట్టాలికములు మట్టిని కలిపెను.
బేరకుబేరుల మేడలు మిద్దెలు
గడగడ గడగడ వడకుచు కూలెను.
హలాకూల జారుల పరిపాలన
పర్రెలువారి బదాబదలయ్యేను.

–మఖ్దూం మోహియుద్దీన్



కళ కళకోసం కాదు ప్రజలకోసం...

Bulletin Printed, Published & Edited by Dr.V.VEERACHARY. On behalf of ARASAM, T.S. Printed at UMASHANKAR OFFSET Printers, H.No.8-10-37, Radhika Theatre Lane, Girmajipet, WARANGAL-506002, (TS) Published : H.No.2-1-132/1, Madhavanagar Colony, Road No.3, Vidyaranyapuri, Gopalpur Road, Hanamkonda, WARANGAL URBAN District.

98

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A101 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | , NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |